# సంస్కృత రూపకములలో నాందీ ప్రస్తావనలు



శ్రీభాష్యం విజయసారథి

ప్రచురణ :

సర్వవైదిక సంస్థానమ్

కరీంనగర్

1993

SAMSKRITA RUPAK
NANDI PRASTAVA
By Sribhashyam Vijaya Sarat

First Edition 1993 Sept.

Copies 1000



Price : Rs 25 -

ప్రతులకు :

1. సర్వ వైదిక సంస్థానమ్
శ్రీ యజ్ఞవరాహక్షేత్రం
కరీంనగర్ - 505 002. A. P.

2. యస్. బి. వరప్రసాదశర్మ
ఇం. నెం. 16-4-144/1
శివనగర్
వరంగల్ - 506 002. A. P.

ముద్రణ :

పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాద్-380.
ఫోన్లు : 611413, 600547

# అంకితం

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధ!

సర్వోదయ నాయకాగ్రణీ!

వాక్కీల కోటీరకోటీమణీ!

భండారు వంశావతంస ముక్తాహార!

ప్రాచ్యభాషా సముద్ధరణ ధురీణ!

వైదిక సంస్కృతి పరంపరా రక్షాపారీణ!

## మాననీయ శ్రీచంద్రమౌళీశ్వరరావుగారికి

అక్షరోపహారముగా

ఈ కృతి సమర్పితము

## శ్రీభాష్యం విజయసారథి

# శ్రీమహాలక్ష్మ్యై నమః

తెలుగు భాషలో వివిధ సాహిత్య ప్రక్రియలను గురించి ఎన్నో పరిశీలన గ్రంథములు వెలువడినవి కాని సంస్కృత రూపక సాహిత్యమునుగురించి అందున, నాందీ ప్రస్తావనల గురించి పరిచాయక పరామర్శ నిబంధములు నాకు తెలిసినంత వరకు చాల తక్కువ అని పేర్కొనుట విప్రవాదం కాదు.

తెలుగువారికి నాందీ ప్రస్తావనల స్వరూప స్వభావములు వాటి ఉద్దేశము పరంపరను గురించి నాతి విస్తృతముగా ఒక పరామర్శ గ్రంథమునందించ వలయునను చిరంతనోత్కంఠ నేడు నెరవేరినది.

విద్యార్థిదశనుండి అధ్యాపక పదవి నధిష్ఠించిన 37 సం॥దాక అన్ని విధాల ఎదుగుటకు భూమికగా, వేదికగా, ఆస్థానిగా వెలసిన శ్రీవిశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల పాలకవర్గ ప్రధాన కార్యదర్శిగా దాని వృద్ధికి నిర్విరామ కృషిసల్పుచు మా అధ్యాపక అనధ్యాపకులపట్ల వాత్సల్యమెంతో నెరపుచున్న మాన్యశ్రీ భండారు చంద్రమౌళీశ్వరరావుగారికి ఈ గ్రంథము అంకితమొసగు భాగ్యము కలిగినందుకు ఎంతో సంతోషించుచున్నాను.

ఈ నిబంధము తొలిప్రతి నొనగూర్చిన చి॥ డా॥ కే. యాదగిరి (తెలుగు ప్రాధ్యాపకుడు కా.వి.వి. వరంగల్) కి; నిర్దుష్టప్రతి సువర్ణాక్షరబంధురముగా సిద్ధపరచిన సహాధ్యాపకులు శ్రీ మాదిరాజు బ్రహ్మానందరావునకు శుభాశంసలు తెలుపుచున్నాను.

గ్రంథ ప్రకాశనకై తగిన సలహా లొసగిన మిత్రులు ఆచార్య శ్రీ కోవెల సుప్రసన్నాచార్య గారికి ఎంతో కృతజ్ఞుడను.

నా సారస్వత తపస్సునకు భంగము వాటిల్లకుండ అనుక్షణము కంటికి రెప్పలాగ నన్ను చూచుకొనుచున్న నా ధర్మపత్ని శ్రీభాష్యం హేమలతయొక్క సంపూర్ణ సహయోగము కూడ ఈ గ్రంథావిర్భావమునకు తోడుపడినది.

గ్రంథ ప్రచురణకు అర్థపరముగా సహకరించుచు సర్వవైదిక సంస్థాన సర్వతోముఖ వికాసమునకు నా కండగా నిలిచియున్న వదాన్య సభ్యుల సహ కారము మరువరానిది. ముఖ్యముగా నాకు తోడునీడగా సర్వవైదిక సంస్థాన ప్రధాన కార్యదర్శి శ్రీ వి. మోహన్‌రెడ్డి, యజ్ఞ వరాహక్షేత్ర నిర్వహణను ప్రాణ సమముగా భావించుచు కావిస్తున్న విశిష్టకార్యవర్గసభ్యులు శ్రీ మాదాటి కృష్ణారెడ్డి (అడ్వకేట్, కరీంనగర్) గారు, ఇతర కార్యవర్గ సభ్యులు సర్వథా సర్వదా అభి నందనార్హులు. ఇంతమంది సహకారముతో రూపొందిన ఈ గ్రంథము జిజ్ఞాసు వులకు ఉపకరించునేని అంతకన్న రచయితకు కావలసినది ఏముండును?

**రచయిత**

# ప్రరోచన

విద్వచ్ఛిరోమణులు, ఉత్తమ కవితల్లజులు శ్రీమాన్ శ్రీ భాష్యం విజయ సారథిగారు - సంస్కృత రూపకములలోని నాందీ ప్రస్తావనలను గూర్చిన ఈ గ్రంథమును రచించి సంస్కృత రూపక పరిణామమును గూర్చిన జిజ్ఞాసువులకు మహోపకారమును చేసినారు.

సంస్కృత భాషలో రూపకముల పరిణామము వేలయేండ్లది. భరతుని నాట్య శాస్త్రము క్రీస్తుశకానికి నాల్గైదు వందల సంవత్సరాలకు ముందరిదే ఐతే నాటికి ఈ పరిణామము పొంది, సుస్థస్థితిని పొందిన రూపకప్రక్రియ బహు ప్రక్రియాసముపేతమై వ్యాప్తి పొందియున్నది. నాట్యశాస్త్రములోని రూపక విచారణము చూచినచో అది నాటికి భారతీయుల యేండ్ల కృషికి, సాధనకు ఫలముగా గోచరించుచున్నది. నాట్యమండపముల నిర్మాణము, దానిలో ఆయా స్థానముల నిర్దేశము గమనించినచో అది యెంతగా ఆధునిక నాటక రంగమునకు సన్నిహితముగా నున్నదో తెలియవచ్చును.

భరతుని నాటికే బహుముఖముగా విస్తరించియున్న రూపక ప్రక్రియ శ్రవ్యకావ్యమునకు ప్రతిస్పర్థి. శ్రవ్యకావ్యమునకు కవి- సహృదయు లిద్దరే భాగ స్వాములు. రూపకమట్లు కాదు రంగస్థలము- రంగస్థలమును సన్నద్ధముచేయుట- నాట్యాచార్యుడు- నటబృందము- ఆహార్యాదికమును, సంగీత కార్యములను నిర్వహించువారు మొదలుగా - ఇది యొక ప్రపంచము. అప్రత్యక్షములైన దేశ కాలములను ప్రత్యక్షీకరించుట దీని ప్రయోజనము.

శ్రవ్యకావ్యము సర్గబంధము, దృశ్యకావ్యము అంకబంధము. రూపకేతి వృత్తమును ప్రదర్శించుటలో ఉన్న పరిమితుల ననుసరించి అంకములేకాక విష్కంభాదులు కూడ కథా సూచకములై కథను ముందుకు నడిపించుచున్నవి. కథావిష్కారక్రమమును నిర్దేశించునది పంచసంధి విధానము. ఈ రకమైన నియతి కథా నిర్మాణములో శ్రవ్యకావ్యమునకు ఆలంకారికులు విధిగా నిర్దేశించలేదు.

కావ్యమునందు అవతారిక, ఉపసంహారముల వంటివి నాందీప్రస్తావనలు భరత వాక్యమును. ఈ రెండును రూపకము యొక్క ఆద్యంతములలో నిక్షేపింప బడినవి. నాందీప్రస్తావనలు రూపకమునకు సామాజికులకు నడుమ పరస్పర ఉన్ముఖీకరణము లక్ష్యముకాగా, భరతవాక్యము సామాజికముగా రూపకలక్ష్యమును సూక్ష్మముగ నిర్దేశించుచున్నది.

కాళిదాసు రూపక తత్త్వమును గూర్చి చేసిన విశ్లేషణము ముఖ్యమైనది. అది చాక్షుషక్రతువు. భిన్నరుచులుగల జనులందరను ఒకే విధమున ఆరాధించు విధానము. ఈ కాంతమైన చాక్షుషక్రతువుగా భావించుటలో కాళిదాసు నాటికి దీనికి గల పవిత్రమైన స్థానమును మనము గుర్తింపవచ్చును. క్రతువు యజ్ఞము. యజ్ఞము ఈ భూమిలోని జీవరాశికిని, ద్యులోకమునందలి దేవతామండలికిని అనుసంధించు ఒక విశిష్టమైన ప్రక్రియ. సర్వజీవ చైతన్యమును అగ్నిముఖముగా ఆజ్యచరుసమిద్రూపమైన ఆహుతులచేత, అనేక బలులచేత దేవతాధీనముచేసి వారిని

తృప్తి నొందించుట ఈ ప్రక్రియ. ఈ దేవతలు పంచభూతముల సృష్టిని నిర్వహించు ఇతర ప్రకృతి సంబంధములైన శక్తుల అభిమాన దేవతలు. పంచ యజ్ఞములలో నిత్యము అనుష్ఠింపవలసిన దేవ యజ్ఞమునందు ప్రకృతిలోని సమంజస లక్షణమే లక్ష్యము.

అయితే యజ్ఞము బహిరంగమైన సృష్టిలోని సమన్వయమును సాధించుట లక్ష్యము కలది కాగా, చాక్షుషమైన ఈ క్రతువు అంతరమైన ప్రకృతిలోని సామంజస్యమును సాధింపవలసినది. అక్కడ అగ్నిముఖులైన దేవతలు సంతుష్టులు కావలసియుండగా, ఈ చాక్షుషక్రతువున నేత్రముఖులైన అంతర దేవతలు ఇంద్రియాధిష్ఠాన దేవతలు, అంతరంగాధిష్ఠాన దైవతములు తృప్తిపడ వలసియున్నది. ఈ ఆరాధనము వలన చేతస్సులో ఒక శాంతి భావము స్థాపింపబడుచున్నది.

నాట్యశాస్త్రము రూపకమును నాట్యమనినది. ఈ నాట్యము కర్మభావాన్వయాపేక్షి. లోకములో కర్మ వ్యష్టికరణము. అయితే నాట్యము దీని లోతుల లోనికి పోయి సర్వజనీనమైనదాని ఆంతర్యమును, అన్వయమును వెలికితీయునది అందువలన కర్మఫలమైన ఇష్టానిష్టములు పరోక్షానుభవ దశలో సుఖదుఃఖాపాదకములు కాక విలక్షణమైన అనుభవమునకు కారణములగుచున్నవి. మనోబుద్ధ్యహంకారములను దాటిన చిత్తస్థానములో లోకము తానై, తానే లోకమై సాక్షాత్కరించుచున్నది. 'త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావాను కీర్తనమ్.' 'దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినాం విశ్రాంతి జననం కాలే నాట్యమేతద్భవిష్యతి'. 'సప్తద్వీపానుకరణం' ఇత్యాదిగా నాట్యశాస్త్రము దీనిని వర్ణించినది.

సూత్రధారుడు లేదా నాట్యాచార్యుడు ఈ నాట్యమునకు కేంద్ర స్థానము. ఈతడు యజ్ఞములో బ్రహ్మ స్థానము. ఈ నాట్యక్రతువును తన దక్షత చేత నిర్వహింపబూనినవాడు. హోత, ఉద్గాత మొదలైనవారు సహాయకులు అచ్చట కలుగగా, యిచ్చట నటవర్గము, ఆతోద్య నిర్వాహకులు దీనికి సహాయకులు. రెంటికి లక్ష్యము త్రైలోక్యారాధనమే.

యజ్ఞమునందు అగ్నిముఖముగా అర్చనము కొనసాగినట్లు, చక్షువు నాట్యమునందు ప్రధానాంశము. చక్షురభిమాన దేవత అగ్నియే. చక్షువునకు విషయము రూపము కాగా, చక్షురభిమాన దేవతార్చనముగా నుద్దిష్టమైన ఈ విద్యాప్రవర్తనము రూపకము.

క్రతు శబ్దమునకు సంకల్పము, ప్రణాళిక, దక్షత, అర్చన ఇత్యాదికములైన అర్థములు కలవు. రూపక ప్రక్రియను కూడ ఇవి సర్వతోముఖముగ అన్వయించును. యజ్ఞశాల నిర్మాణము వంటిదే నాట్యశాలా నిర్మాణము. నాట్యమునకు పూర్వరంగమును స్పష్టముగా అనుశీలించినప్పుడు దాని లక్ష్య స్వరూపములు మనకు అవగతము కాగలవు.

రూపక ప్రదర్శనమునకు ముందు నాట్యశాలలో రక్షోనాశకరములైన మంత్రముల అనుష్ఠానము సప్త వార పర్యంత ముపదిష్టమైనది. నాట్యాచార్యుడు త్రిమూర్తులను, ఇంద్రుని, కార్తికేయుని, సరస్వతిని సిద్ధి, బుద్ధి, మేధ, స్మృతి, ధృతి, మతీత్యాది భావ దేవతలను; సోమ, సూర్య, మరుత్తులు, లోకపాలురు, మిత్రాగ్నులు, వర్ణదేవతలు, రుద్రులు, కాలుడు కలి, మృత్యువు, నియతి, కాల దండము, విష్ణు ప్రహరణము, వాసుకి, వజ్రము, విద్యుత్తు సముద్రములు, గంధర్వులు, అప్సరలు అసురులు, నాట్యకుమారులు, గణపతి ఇతర భూత సంఘములు, దేవతలు ఆహ్వానింపబడినారు. ఒక విధముగా సృష్టిలోని సర్వ చైతన్యాధిష్ఠానములను ఆవహించినట్లు గోచరించుచున్నది. పూర్వరంగ పూజ సంపూర్ణముగా ఒక తంత్ర విశేషమే. ఆహూతులైన సర్వదేవతల మంత్రములు అనుష్ఠింపదగినవి, విర్దేశింపబడినవి. పూర్ణకుంభస్థానము దీని ప్రధానాంగమే.

ఈ పూజ వలన రంగప్రదర్శనము ఆ గ్రామమునకు ఆబాలవృద్ధమైన జనులకు క్షేమమును కలిగించును. పూజలేమి లోకక్షోభ హేతువు. యాజకునకు తిర్యగ్యోని జన్మము కల్గించును.

ఈ పూర్వరంగము తరువాత నాంది. పూర్వరంగమున సాగి సర్వజన శ్రేయోభావము దీనియందు ప్రకటపరుగుట విశేషము. ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశాత్మకమైన ఈ నాంది అందరకు ఆనందము కలిగించునది, కలుగవలెనని ప్రార్థించునది. ఈ శ్లోకములోని భావ సౌందర్యముచేత, సంగీత మాధుర్యము సామాజికుల కొకవిధమైన ప్రరోచనము కలిగించుట దీనికి ప్రధాన ప్రయోజనము. సామాజికుల చైతన్యములో ఒక ప్రేయోరూపమైన దీప్తి ప్రకాశము దీని లక్ష్యము.

ఈ విధానము చూచినప్పుడు పూర్వరంగము నాందియు ఒక ఈశ్వరారాధనమే అని తోచును. సాహిత్య రంగమున సాహిత్య సాధనమును ఒక తపస్సుగా, ఆరాధనావిశేషముగా సంకల్పించిన వారున్నారు. నాట్యప్రయోజనము కూడ ఒక సాధనావిశేషమే. విశ్వనాథ తన 'వేయిపడగలు'లో రూపక ప్రదర్శనమును ఒక సాధనగా చేసికొన్న విధానమును ఈ దృష్టితో పరిశీలింపవలసి యున్నది. సంగీతము కూడ నాద తనువైన శివుని ఆరాధనము. వీటన్నింటి సమాహారకళయైన రూపకము కూడ ఉపాసన అగుటలో విశేషము లేదు. ఇది దివ్యాదివ్యలోకముల నడుమ సేతువు వంటిది. అనుద్విగ్న శాంతమనస్కుడైన నాట్యాచార్యుడు తన సృష్టితో లోకజీవనములోని అనౌచిత్యములను సామాజిక సంక్షోభమును కలిగించు సంక్షోభమును తొలగించుకొనగలిగిన చిత్రప్రసాదనమును కలిగించును.

నాంది ననుసరించి వచ్చెడి ప్రస్తావనము ఒకవిధముగ వర్తమానమునకును, రూపక వస్తు కాలమునకును అనుసంధానము కలిగించెడి అంశము. సూత్రధారుడు తన సంభాషణముఖముగ, సంగీతాది ప్రయోగము వలన సామా

జీకుల చైతన్యములో ఇతివృత్తమును ప్రత్యక్షీకరించుకొనగల మనఃస్థితిని ప్రవేశపెట్టును.

కవి ప్రశస్తి రూపకప్రశంస రూపకము యొక్క తాత్త్విక స్థాయిని శిల్పమహత్త్వమును వ్యక్తము చేయును.

కొన్నిచోట్ల నాందీశ్లోకము రూపకతత్త్వమును తనలో గర్భీకరించుకొని, ఇతివృత్తమును తనలో సర్వతోముఖముగ ప్రకాశింపజేయును. అందువలననే భాసుని నాంది అద్యతన కాలము వరకును నాందీ శ్లోకమును, దాని పరిణామమును అధ్యయనము చేసినగాని ఈ తాత్పర్య మవగతము కాదు.

ప్రస్తావనలో గానము, ఋతువర్ణనము కవి వ్యంగ్యార్థ కల్పనాశక్తికి అద్దము పట్టగలదు. సూత్రధారుడు చేసిన నటుల ప్రస్తావన పాత్ర ప్రకాశ సూచనము రంగస్థలమున కొనసాగెడి 'కనుకట్టు'నకు ఇంద్రజాలమునకును అద్దము పట్టగల అంశము.

సంస్కృత రూపకములలోని నాందీప్రస్తావనలను గూర్చి ఇంత విపులముగా పరిశీలించిన గ్రంథమిదివరలో లేదు. భాసునినుండి అందినంత వరకు అన్ని రచనలలో, నాందీ ప్రస్తావనలలోని వివిధాంగములను వాని విలక్షణమును ఈ గ్రంథము స్పష్టముగ వివరించినది. ఈ విషయమున మా ప్రియ మిత్రమైన ఈ గ్రంథకర్త శ్రీ శ్రీభాష్యం విజయ సారథి గారిని అభినందించవలసి యున్నది.

మాకు చిరకాల మిత్రము కవిశ్రేష్ఠులైన శ్రీ విజయసారథిగారు సరస్వతీ దేవి అనుగ్రహమును పొందినవారు. ఆ అనుగ్రహము ఆయనలో ఛందోమయ వాక్ప్రవాహముగా ప్రవహించుట అస్మదాదుల నిత్యానుభవము. ఆయనకు సాహిత్య విద్య శబ్ద బ్రహ్మోపాసనమే. సంగీత సాహిత్యముగల ఆయన రీతి మాధుర్య ఝరి.

ముప్పదికి పైగా కావ్యములను, అనేకములైన విమర్శనములను, వ్యాఖ్యానములను రచించిన శ్రీ విజయసారథిగారి సాహిత్య తపస్సు ఆయనను ఆర్షేయమైన మార్గమునకు తరలించినది. సర్వవైదిక సంస్థానమును నిర్వహించుటతో జ్యోతిష వాస్తు మంత్ర శాస్త్రములు ఆయనకు వశంవదములైనవి.

ఆర్ష మార్గమున సాగిపోవుచున్న శ్రీ విజయసారథిగారి సాహిత్య తపస్సు అవిచ్ఛిన్నముగ కొనసాగవలెనని కోరుచున్నాను.

కోవెల సుప్రసన్నాచార్య
ఆచార్యుడు, తెలుగుశాఖ,
కాకతీయ విశ్వవిద్యాలయము
వరంగల్.

వరంగల్
28-9-1993

# సంస్కృత రూపకములలో నాందీ ప్రస్తావనలు

"రమ్యాం కాంతిం సమీక్ష్య ప్రభురపిమనసోయోగినాం చక్రవర్తీ
భ్రాంతస్సన్ యాం స ఈశో వ్యపహృత నిజధీః క్లాన్త ఏవాన్వధావత్
తస్యా ఏవోజ్జ్వలాయా రసమయ వపుషో విశ్వసమ్మోహకర్త్ర్యా
మోహిన్యాః కాపి శక్తిః పరిలసతు మమ స్వాంత పద్మే సుఖాయ"

వాస్తవ జగత్తు నందంతరాంతరములలో దాగియున్న పరమాదర్శ రూపమును ప్రదర్శించుట ఉత్తమ శిల్పమునకు ప్రయోజనము. శిల్ప నిర్మాణము నిత్య సత్యమైనపుడు వాస్తవమై, యదార్థ రూపము తీర్చిదిద్దికొనినపుడు ఆదర్శమునై యున్నది. వాస్తవ జగత్తులో స్థూల దృష్టికి గోచరింపని సత్యమును భావనా బలముచే గోచరించినంతమేర రసవంతముగా ప్రదర్శించుటయే శిల్పవిధి. కాని ఉన్నది ఉన్నట్లుగా నిర్మించుట కాదు. కళ సాక్షాత్తు జగత్తునకు పరిష్కారము గొల్పు ఉత్తమ సృష్టి. కాని దానికి కేవల ప్రతికృతి మాత్రము గాదు. అవసరమగుచో కళ మూలమును గూడ పరిష్కరించును. సుఖదుఃఖ సంభిన్నమైన యీ ప్రపంచమును సర్వాంగ సుందరముగా, కల్యాణాత్మకముగా సృష్టించి సత్య సుందర శివతా పరిస్ఫూర్తిని ప్రసాదించుటయే కళా ప్రయోజనము. దీనిని ప్రదర్శించుటకు లేక విశ్లేషించుటకు శిల్పినైకాలంకారిక సాధనముల నుపయోగించును. లోక ధర్మమును తలపింపజేయుట కళా ధర్మము కావచ్చును. కాని లోక ధర్మమే కళా ధర్మమనుట పొసగదు. అందువలన కళ స్వాభావికముగా నుండవలెననుట అవిచారిత రమణీయము.

కవిత్వము, పాత్ర సృష్టి మున్నగు అంశములు జాగతిక స్వభావము నను రోధించినను జాగతిక స్వభావము కన్న విలక్షణమనక తప్పదు. నాట్యము లలిత కళలలో నొకటియైనను, అది సర్వ కళల సమామ్నాయము. శాస్త్రమునకు కళా

ధర్మ మాపాదింపబడుట నాట్యముననే సాధ్యమగును. ఒక వస్తువునందలి భిన్న భిన్న అంశములను విశ్లేషించి చూపునది శాస్త్రము. భిన్న భిన్నాంశములుగల భిన్న భిన్న పదార్థములను ఒకచో చేర్చి సారస్య సామంజస్యముల నాపాదించి ఏకాత్మతను కలిగించునది కళ. కవిత్వము, సంగీతము, రీతి నీతులు, వృత్తి ప్రవృత్తులు - ఇత్యాద్యంశములొకే స్రోతస్సునుండి వచ్చిన అంతర్వాహికలుగ యీ నాట్యమున సమన్వితమగుచుండును.

సంగీతములేని అభినయము మనోహరముగా నుండనట్లే కవిత్వము లేని నాట్యము స్పష్టముగా నుండదు. శాస్త్రీయదృష్టితో జూచిన ప్రతి కళలో ఏదో యొక కొరత మన కగుపడుచుండును. మన భాష కందని భావము లెన్నియో గలవు. అందిన భావములలో స్థూల, సూక్ష్మతర, విషయ, సమాంశములు కానుపించును. వీనికన్నింటికిని సంకేతములు కల్పించుట అసాధ్యము. కవిత్వ మన్ని భావములను వెల్లడింపలేదు. వస్తువును (హృదయంగమము గాను) హృదయమునకు హత్తుకొనునట్లుగాను చెప్పదలచినపుడు చెప్పలేక వేరొక వస్తువును ఎరవుదెచ్చుకొని దానివలె యిది యున్నదని ఒకానొక ఔపమ్యము శరణు జొత్తుము. భావములోని తీవ్రతను, వైషమ్యమును, స్పందనను మన భాష సంపూర్ణముగా అభివ్యక్తము చేయజాలదు. అందుకొరకె సంగీతము నాశ్రయింతును. అనంత భావములను వెల్లడించుటకనంత రాగములు కలవు. ఒక రాగము భావములోని తీవ్రతను వెల్లడించినంత భాష వెల్లడింపలేదు. కాని సంగీతమున స్పష్టత తక్కువ. ఈ పదమున కీయర్థమని భాషలో సంకేతమున్నట్లు సంగీతములో నన్నింటికి సంకేతము చెప్పలేము. పిదప స్పష్టతకొరకు అనుకరణ ఏర్పడినది.

ప్రాణియైన ప్రతి వ్యక్తి అనుకరణ జీవి యనక తప్పదు. ఈ అనుకరణ మెన్నియో విధముల మానవ జీవితమును సఫలము చేయుచున్నది. జీవన సాఫల్యమే పరమ ప్రయోజనమగుచుండ ననుకరణము నాట్యరూపమున అవతరిల్లినదనవచ్చును. అనుకరణమనగా అభినయము. ఇవి యన్నియు సమన్వితమై సర్వలోక జీవనాదర్శముగా నాట్యరూపమున వెలుగుచున్నవి. ఇట్లు సంగీత, కవిత్వాభినయములకు అవలంబమై మనోజ్ఞ వస్తు వర్ణనా సంవలితమై చతుర సంవాదములతో రసవంతమై ప్రస్ఫుట పాత్ర చిత్రణలతో హృదయావర్జకమై

నిబిరీస కథా సంవిధానముచే ఉత్కంఠాపాదకమై ఉన్నప్పుడే నాట్యము ప్రదర్శన యోగ్యత నందుకొనును. అందువలననే "కావ్యేషు నాటకం రమ్యమ్" అనబడినది. మానవుని జీవితరహస్యతత్త్వము బోధించెడి కవిత్వము పాత్రల ముఖమున అభివ్యక్తమై ప్రేక్షకుని మనోనేత్రమున సాక్షాత్కరించి ఆతనిని పరమోన్నత స్థానమునకు గొంపోవునుగాన "నాటకాంతంహి సాహిత్యమ్" అనియు సూక్తి ఆవిర్భవిల్లినది. ఇంతేకాదు, నాట్యము చాక్షుషమగు ఒక కమనీయ క్రతువు. వైదిక క్రతువు శుష్కము. బహు ప్రయాస సాధ్యము దాని ఫలము ఎవనికో ఒకనికి, ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడనో ఒకచోట సంభవించును. కాన అది సర్వథా అదృష్టఫలమైనది. వైదిక క్రతువునందు సర్వుల కధికారము లేదు. ఒకానొక విలక్షణ సంస్కారము కలవారికి మాత్రమే యం దధికార మొసగ బడినది. అందువలన అది కమనీయతను గోల్పోయినది. కాని నాట్యరూపమగు ఈ చాక్షుష క్రతువునందు ఆబాలగోపాలము, ఆపండిత పామరము అందరు; అందును స్త్రీ, పురుష వివక్ష లేక అధికృతు లగుదురు. ఇందు ప్రీతి ప్రధాన ప్రయోజనము. ఉపదేశాదులు ప్రీతితో పాటు సంసృష్టము లగును. సామాజికులు అన్యుల భావానుభూతిని ఈ నాట్యయోగముననే బడయుదురు.

"స్వాత్మభావం పరిత్యజ్యభావమన్యమధిశ్రితాః
తదీయాన్ అఖిలాన్ భోగాన్ విదగ్ధా భుంజతే స్వకాన్."

నాట్యయోగమున ప్రావీణ్యము గడించినవారు యోగులవోలె పరిమితమగు ప్రమాతృప్రమేయాది వివిధ భేద భావనా కశ్మలతను విసర్జించి రూపకములోని తత్తద్రసాశ్రయులగు వర్ణనీయ రామాదులతో తాదాత్మ్యము నొంది తదనుభూతిని చూరగొందురని శ్లోకభావము. దృశ్య, శ్రవ్య రూపమగు కావ్యమునకు బహు ప్రయోజనము లున్నను అందు నిబద్ధులగు అనుకార్యులకు శాశ్వత కీర్తి ప్రధాన ఫలమగును. కవికి కీర్తి ప్రధాన ప్రయోజనము. అర్థప్రాప్తి, అనర్థ నివృత్తి యనునవి యానుషంగిక ఫలములు. ఈ విషయమే-

"ఉపేయుషా మపి దివం సన్నిబంధ విధాయినామ్
ఆస్త ఏవ నిరాతంకం కావ్యం కాంతి మయం వపుః
కావ్యం నామ కవీంద్రాణాం మహతాంచ మహీ భుజామ్

ఏ కా కీర్తి మయీ మూర్తి రే ధతే భువనత్రయే
మూర్తయః పాంచ భౌతిక్యః న ద్విత్రక్షణ సౌహృదాః
మూర్తయః కీర్తి మయ్యో హి తిష్ఠంత్యా భూతసంప్లవ్"

"కావ్య బంధేన సంబంధాః కాంక్షణీయా యశస్వినామ్
న కదా చన నశ్యంతి కృత్స్న నా శేపి కీర్తయః
వాల్మీకి యేన కావ్యేన వర్ధతే రామ కీర్తనమ్
బాణస్య కావ్య బంధేన శ్రీహర్షః ఖ్యాప్యతేధునా
న రూపేణ న శౌర్యేణ నాచారేణ న విద్యయా
ప్రతిష్ఠాం భజతే కీర్తిః కావ్యేనైవ యశస్వినామ్
కల్పాంతర స్థిరం కావ్యం స్యాత్ నచేదవలంబనమ్
కీర్తి వల్లీ స్వర్గ ఫలా కిమవష్టభ్య వర్ధతామ్"

ఇత్యాది శ్లోక రూపమున వెల్లడింపబడినది. నటునకు కీర్తితోపాటు అర్థ ప్రాప్తి, అనర్థ నివృత్తులు చేకూరును. ముక్తియైన పట్టుబడును గాని సకల లోక రంజనైక ప్రయోజనకమగు నాటక విద్య తేలికగా పట్టుపడదు. ముక్తి యొకనికే ప్రీతి గూర్చును. నాటక విద్య (నటన) సర్వ ప్రజలకు మనోరంజన కల్పించి అనిర్వచనీయానందాపాదన ద్వారా ఆత్మకు విశ్రాంతి నొనగూర్చు చున్నది ఈ శ్లోకమున ఈ విషయము పరామృష్టమైనది:

"అపిలభ్యేత విద్వద్భిః ముక్తిరభ్యాస కౌశలాత్
నతు నాటక విద్యేయం సర్వలోకాను రంజనీ".

ఈ విషయమే భంగ్యంతరమున శక్తిభద్రుడు తెలిపినాడు:

"అభిరంజనీం జనానాం సహాయ సంఖ్యాం గురూపదేశేన
గ్రసవ మూద్యహామి గుర్వీంనృప ఇవ భరతాదిభి ర్వ్యూఢామ్"
—ఆశ్చర్యచూడామణి.

ఈ శ్లోకము కూడ పూర్వోక్త విషయమునే బలపరచుచున్నది:
"కైశోరాత్ ప్రభృతి ప్రసాదిత మహాతీర్థస్య శిక్షాబలాత్
అభ్యాసాచ్ఛ జితశ్రమేణ విదుషా యేనప్రయోగ శ్రియా
విద్యాయాం నిజయా స్వతోగుణవతామాధుర్య మాధీయతే
గాంభీర్యంచ పరం స ఏవ విదుషాం సమ్యక్ప్రసూతే రసాన్."

సామాజికు (పాఠక, ప్రేక్షక రూపు)నకు వ్యవహార పరిజ్ఞానము, సద్యః పర నిర్వృతి యోగము, ఉపదేశ లాభమను త్రివిధ ప్రయోజనములు కలుగును. వేదేతిహాసాదులకు లేని వైశిష్ట్యము, కాంతా సమ్మిత త్త్వమునుబట్టి కావ్యమునకు కలదని, ప్రత్యవాయాది తర్జన లేకయే కావ్యము సరసోపదేశమున పాఠకునకు హితాహిత ప్రవృత్తి నివృత్తి రూప బోధను కలిగించునని ఈ శ్లోకము తెలుపు చున్నది:

"వేదేతిహాస కావ్యానాం కార్యాకార్యవినిర్ణయే
ఉపదేశః ప్రభు సుహృత్కాంతా నామివ దృశ్యతే
ఆస్వాదయేరన్ రసికా రసాహ్యత్ర ప్రతిష్ఠితాః
ఇత్థం విధిః స్వరోవాత్ర శ్రూయతే న శ్రుతావివ
రామాదివత్ వర్తితవ్యమ్ నత్వయా రావణాదివత్
ఇత్యాద్యర్థోఽపదేశోపి న పురాణేతిహాసవత్
ధ్వని ప్రధానం కావ్యంతు కాంతాసమ్మిత మిష్యతే
శబ్దార్థ గుణతాం నీత్వా వ్యంజన ప్రవణం యతః
తస్మాత్ కావ్య నిబంధానాం రస సమ్మిత లక్ష్మణామ్
ప్రతీయమాన ప్రాధాన్యం ప్రాక్తనైః ప్రతిపాదితమ్."

సహృదయులెంత రసాస్వాదనలోనున్నను పూర్తిగా తమ వ్యక్తిత్వము గోల్పోనందువలననే కావ్యగత వివిధ పాత్రవృత్తి ప్రవృత్తుల నరయ జాలుదురు. దాని మూలమున అసత్ప్రవృత్తుల విడనాడి సత్ప్రవృత్తుల వైపు మ్రొగ్గుదురు.

"రసానా స్వాదయం తోపి భావితార్థాస్సచేతసః
అస ద్వృత్తం సము త్సృజ్య వృత్తం సంచిన్వతే సతామ్
తస్మాదస్మాభిరప్య త్ర త్యక్త్వాదుర్వృత్తమీదృశమ్
భవితవ్యం సాధువృత్తై రితి వ్యాస విమర్శినః."

ఇట్టి భావనకు కారణము కాంతాసమ్మిత సరసోపదేశము కాక మరి యొకటి కాదు.

"తత్కాంతయేవ కావ్యేన సారస్యహృతచేతసామ్
హితాహితోపదేశోఽపి సుధియాం ప్రతిపాద్యతే."

ఎంతటి కటు విషయమునైనను సామాజికుల హృదయమునకు హత్తు కొనునట్లు, వారు స్వీకరించునట్లును చేసెడి వైలక్షణ్యము కావ్యమునకే కలదు. అందువలననే-

"స్వాదు కావ్య రసోన్మిశ్రం శాస్త్రమప్యుపయుంజతే
ప్రథమాలీఢమధవః పిబన్తి కటు భేషజమ్"

అను అభియుక్తోక్తి ఏర్పడినది.

కావ్యమొక విలక్షణ యోగము. యమ నియమాదు లభ్యసింపకున్నను సామాజికుడు అభీష్టసాక్షాత్కార సిద్ధిని పొంద జాలును. బాహ్య జగత్తును మరపింపజేసి ఆంతర జగత్తులో లయమును పొందుటకు యోగము తోడ్పడును.

మనన శీలుడగు వానిలో రెండు జగత్తులు గలవు. ఒకటి భేద జగత్తు. ఇది బాహ్యమైనది గావున స్థూలము. రెండవది అభేద జగత్తు. ఇది ఆంతర మగుటచే సూక్ష్మమగుచున్నది. భేదాభేద జగత్తులకు మూలము వృత్తి వైష మ్యము. వృత్తు లనేక విధములు. ఆలంకారికులు తొమ్మిదనగా, మనో వైజ్ఞా నికులు పదునాలు గనినారు. సంఖ్యా భేదమున దప్ప తదాశ్రయముపట్ల యిరు వురకు విసంవాదం లేదు. వృత్తి వైషమ్య నిర్మూలన ఉపాసనా బలమున చేకూరును. ఉపాసన యనునది పరిణామములో ధ్యేయ తాదాత్మ్యమును చెందు టయే. దీనినే నాట్య పరిభాషలో సాధారణీకరణ మందురు. ఈ సాధారణీ కరణము ఒకానొక స్పందన వలన మొదట కలుగును. హృదయము నందనేక స్పందము లున్నవి. వాస్తవముగా స్పంద మొకటియే. మానవత యొకటియేయైనను భాషా, ప్రాంత, మత, ప్రవృత్తి, విహార, వ్యవహారాచారాదుల వలన అనేక భేదములు మానవ సంఘమున కలిగినట్లే మననశీలుడగు మానవునకు అనేక భేద రూపములైన పరిధులు సృష్టించుకొనబడినవి. ఇట్లు కాల్పనికములైన భేద ధర్మము లన్నియు 'విశేష స్పంద' నామముచే వ్యవహరింపబడును. పార మార్థికమగు అభేదమనునది సామాన్య స్పందమని స్పందవాదులు పేర్కొందురు. "విశేష స్పందాః అనాత్మ భూతేషు దేహాదిషు ఆత్మాభిమాన ముద్భావ యంతః పరస్పర భిన్న మాత్మీయ ప్రమాతృ విషయాః సుఖితోఽహం దుఃఖితోఽహ మిత్యాదయో గుణ మయాః ప్రత్యయ ప్రవాహాః సంసార హేతవః." ఈ పర

మార్థమగు తత్త్వ భావనచే తాను కల్పించుకొనిన పరిధులు తొలిగిపోయి స్వ స్వరూపానందము చేకూరునని ఈ క్రింది సూక్తి తెలుపుచున్నది:

"పరమ కారణ భూతస్య సత్యస్య ఆత్మ స్వరూపస్య అయమహమస్మి, అతస్సర్వం ప్రభవతి, అత్రై9వచ ప్రలీయతే ఇతి ప్రత్యవమర్మాత్మకో నిజోధర్మః సామాన్య స్పందః."

ఈ భావనా మహిమచే అంతఃకరణము నందు అంతర్వాహినిగా నున్న ద్రుతి దీప్తి సంకోచ వికాసము లుబికి అంతఃకరణములను దివ్యచేతనామయముగా నొనరించును. లౌకిక క్రీడలు మూల వృత్తులలోని కాలుష్యమును మాత్రమే తొలగింపజాలును. వానికి దివ్యచేతనా స్పందన కలిగించు శక్తి లేదు. అందువలన, దేవతలు దేవతాజ్యేష్ఠుని "క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యం చ యద్భవేత్" అని ప్రార్థించినారు. హృద్యమైనది కావున దృశ్యము. వ్యుత్పత్తిని కల్గించుటచే శ్రవ్యము. మనస్సు నాకర్షించినది కావున క్రీడనీయము. లోకుల మనస్సు నాకర్షించి గ్రామ్య ధర్మ ప్రవృత్తి నుండి మరల్చి స్వధర్మాత్మస్థాన పరులుగా నొనరించుచు ప్రీతి, వ్యుత్పత్తుల నొసగునని దీని తాత్పర్యము. విషమముగా పెంచుకొనిన వివిధ పరిధులలో పెరిగి దాని మూలమున పరితప్త మగు అంతఃకరణమున కుజ్జీవన కల్గించి దాని వృత్తుల మాలిన్యమును, దోషమును తొలగించి సమున్నయన మేర్పరచి ఆనందమయము, అనంతము, అపరిచ్ఛిన్నము, విశిష్టము, విలక్షణమునగు సూక్ష్మ జగత్తులో ప్రవేశ పెట్టి స్వస్వరూనందమును ఆత్మకు (సామాజికునకు) చేకూర్చెడి లక్షణము ఈ కావ్యమునకే కలదు. ప్రతి అంశమును కనుల ఎదుట చూపి ప్రయోగ - అంతరీక్షణాది మూలమున ప్రేక్షకునకు సద సత్ప్రవృత్తి, నివృత్తులను సరసముగా నేర్పరచి స్వకర్తవ్య ముతోపాటు స్వస్వరూపానందము నాపాదించుట శ్రవ్య కావ్యము కంటె దృశ్య కావ్యములోనే యధికముగా నున్నది. అందువలన నాట్యము క్రీడనీయకము. దివ్య యోగము. చాక్షుషక్రతువు కూఢ నగుచున్నది.

కాళిదాసు 'మాళవికాగ్నిమిత్రము' నందు—

"దేవానా మిద మామనన్తి మునయః కాంతం క్రతుం చాక్షుషం
రుద్రేణేద ముమాకృతవ్యతికరే స్వాంగే విభక్తం ద్విధా
త్రైగుణ్యోద్భవ మత్రలోకచరితం నానారసం దృశ్యతే
నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధా ప్యేకం సమారాధనమ్"

అను శ్లోకములో విస్పష్టపరచినాడు. భరతుడు నాట్య ప్రయోగము యజ్ఞ తుల్యమనినాడు. సామాన్య కార్యమునకే ఎన్నియో విఘ్నములు కల్గుచుండును. లోకైక సమారాధనమగు నాట్యము యొక్క ప్రయోగమున విఘ్నములను గూర్చి చెప్పబనిలేదు. భరతుడు నాట్యోత్పత్తి, తత్ప్రయోగ విఘ్నములను గూర్చి నాట్య శాస్త్రమునందు ప్రథమాధ్యాయమున ఇట్లు సంస్తవించినాడు. ప్రతిమన్వంతరమందు కృతయుగమవసితమై త్రేతాయుగము ప్రారంభమగు సమయములో ప్రజలు కామ, క్రోధ, లోభేర్ష్యాదులకు వశంవదులై గ్రామ్య ప్రవృత్తి నవలంబించి సుఖ, దుఃఖ జీవితముల గడుపుచుందురు. ఇది కృతత్రేతా సంధి దశలో సంభవించును. పూర్వము త్రేతాయుగ ప్రారంభకాలమున పై విషమస్థితియే కలిగెను. అపుడు దేవతలు, గంధర్వాదులు యక్షసాధ్యులు ఆక్రమించియుండ లోకపాలురు ధర్మ ప్రతిష్ఠాపన గావింపనెంచిరి. మహేంద్రాది దేవత లీ ప్రయాసను దిలకించి యొకనాడు పితామహుని దరిజేరి "స్వధర్మబోధకము, వినోదకరము, ఆనంద ప్రదమునగు నొక క్రీడనీయకము నపేక్షించుచున్నాము" అని నుడువ బ్రహ్మ వారి ప్రార్థన నంగీకరించి నాల్గు వేదముల నుండి సారమును గైకొని నాట్యవేదమును నిర్మించినాడు. చతుర్విధ పురుషార్థ సాధకము, యశస్కరము, సన్మార్గప్రదము, సర్వస్థావర జంగమాత్మక లోకానుకరణరూపముగా నాట్యవేద మేర్పడినది. ఇంద్ర సమ్మతిని పరమేష్ఠి యా నాట్యమును ప్రయోగించి లోకమున కుపకారము చేయుమని భరతున కొసంగినాడు. భరతుడు తన శాండిల్యాది పుత్రశతముతో మంజుకేశ్యాది అప్సరోగణముతో నా నాట్యమును సాధన చేయించి, బ్రహ్మకు విన్నవించి నాట్య ప్రయోగమున కనుమతి నొసగుమని యడిగినాడు. బ్రహ్మ భరతునితో నిట్లనినాడు: "దానవులు నిహతులైనందున దేవతలెల్లరు మహేంద్ర విజయ సూచకముగా ధ్వజోత్సవమును జరుపుకొనుచున్నారు. ఆ యుత్సవమున దీనిని ప్రదర్శింపు"మని నుడువ భరతుడు అష్టాంగ పదయగు నాందిని మొట్ట

మొదట ప్రయోగించి, అటు పిదప దేవతా విజయము ననుకరించెడి నాట్యమును ప్రదర్శించినాడు. అపుడు దైత్యులు స్వజాతి నాశనము నిరూపింపబడుటచే సంక్షుబ్ధులై విరూపాక్షాదుల నాయకత్వమున ఆ నాట్య ప్రయోగమునకు విఘ్నము చేకూర్చినారు. వారు మాయా తిరోహితులై నటుల వాక్కును, చేష్టలను, స్మృతిని స్తంభింపజేసినారు. నాందీ ప్రయోగమునందే సపరివారముగా సూత్రధారుడట్లు భంగపడుట జూచి, దివ్యదృష్టితో తిలకించి భరతుడు, విఘ్నకరులగు విరూపాక్షాదులను తన ఉత్తమ ధ్వజముతో జర్జరీ కృతాంగుల గావించినాడు.

దాన ఆ ధ్వజమునకు 'జర్జర' మను నామ మేర్పడినది. తాత్కాలికముగా ప్రయోగమీడేరినను విఘ్నకరుల బాధ స్థిరముగా తొలగనందున భరతుడు పరమేష్ఠిని 'విఘ్నకరుల బాధ తొలగించు' మని వేడినాడు. బ్రహ్మ విశ్వకర్మను రావించి నాట్యశాలను నిర్మించుమని ఆదేశించినాడు. రాక్షసులును బ్రహ్మదరి జేరి "పరమేష్ఠీ! దేవతలను సృజించినట్లే మమ్మును సృష్టించినావు మాకు దేవతల వలనను, మీరు సృజించిన నాట్యము వలనను అడుగడుగున నవమానము జరుగుచున్నది. మేము దీనిని సహింపలే"మని నుడువ, పరమేష్ఠి "ఈ నాట్యము కేవలము మీ చరిత్రను కాని, దేవతా చరిత్రను కాని ప్రదర్శింప నవతరింపలేదు. ఇది త్రిలోక భావాను కీర్తనము. ఇందు పలు ప్రవృత్తులుగల వివిధ ప్రాణుల వ్యవహారము లనుకరింపబడినవి. ఈ నాట్యమున కన్పట్టని జ్ఞానముగాని, శిల్పముగాని, విద్యగాని, కళగాని, యోగముగాని లేనేలేదు. సర్వశాస్త్రములు, సర్వకళలు, సర్వకర్మలు ఈ నాట్యమున గలవు. సప్తద్వీపానుకరణమీ నాట్యము. మీ రమరులపై గోపింప తగదు. ఇది అందరకు సంబంధించినది. దీనిపై దేవతలకెంత యధికారమున్నదో, మీకు నంతియే యధికారము గలదు" అని సాంత్వన పరుచ రాక్షసులు ప్రసన్నులైనారు. పిదప విశ్వకర్మ నిర్మితమగు నాట్యశాలను రక్షించుటకు దేవతలు, రాక్షసులేగాక యక్ష, కిన్నెర, కింపురుష, పన్నగాదులును పాల్గొనిరి. నాట్య ప్రయోగము జరుపుటకు ముందు భక్ష్య భోజ్యాది బలులు, హోమములెన్నియో జరిగినవి. అటు పిదప నాట్య ప్రయోగము నిర్విఘ్నముగా కొనసాగినది. నాట్య ప్రయోగమునకు పూర్వము విధిగా రంగపూజ చేయవలయును. రంగదేవతా పూజ చేయనివాడు నాట్య ప్రయోగమున సిద్ధిని పొందలేడు. నాట్యమున సిద్ధిని బడయువారు ఛక్కగా యజ్ఞము నాచరించెడివారు పొందెడి ఫలమునే పొందుదురని భరతుడు

పలుచోట్ల నుడివినాడు. ఈ విధముగా విఘ్న నివారణార్థము దేవతాపూజ ఏర్పడినది. రంగదేవతా పూజయనగా నాట్యశాలయందు అయా స్థానముల యందు నిలిచి విఘ్నములను కలిగింపక కవి, నట, సామాజికులకు స్వాభీష్ట సిద్ధికై తోడ్పడెడి యక్ష, రాక్షస, కిన్నెర, కింపురుష, నాగ, రుద్రేంద్ర, సరస్వత్యాది దేవతలకు చేయు పూజయని అర్థము.

"ఇత్యయం యో విధి ర్దృష్టోరంగ దైవత పూజనే
నవే నాట్య గృహే కార్యం ప్రేక్షాయాంచ ప్రయోక్తృభిః."

ఈ రంగపూజ విధానము కేవల నూతన్న నాట్యశాలయందే కాదు. ప్రతి నాట్య ప్రయోగము నందును పాటింపవలయునని పై శ్లోకము తెలుపుచున్నది. ఈ రంగ పూజా నిమిత్తమే పూర్వరంగ మవతరిల్లినది.

# పూర్వరంగము

నాట్య ప్రయోగమునం దేర్పడెడి వివిధ విఘ్నములను తొలగించుటకై నటు లొనరించెడి శుభకర్మ పూర్వరంగమనబడును. "ప్రథమం పూర్వరంగశ్చ తతః ప్రస్తావనేతిచ, ఆరంభే సర్వనాట్యానామేతత్ సామాన్య మిష్యతే." నాట్య ప్రయోగమునకు పూర్వము; అనగా మొదలు పూర్వరంగము, పిదప ప్రస్తావన' అటుపిదప నాటక ప్రదర్శన యనునది సర్వనాట్యములందవలంబించెడి పరిపాటి.

"యన్నాట్యవస్తునః పూర్వం రంగ విఘ్నోపశాంతయే
కుశీలవాః ప్రకుర్వన్తి పూర్వరంగః స ఉచ్యతే."

రంగ విఘ్నోప శాంతికై నటు లొనరించెడి మాంగళిక కర్మ 'పూర్వ రంగ' మనబడునని విశ్వనాథుడు తెలిపినాడు. మొదలు పూర్వరంగము, అటు పిదప సభాపూజ, తదుపరి కవి నాటక నిర్దేశ ప్రశంసలు, ఆముఖము — అనునవి నాట్య ప్రయోగమునకు పూర్వము చేసెడి కార్య కలాపము.

"తత్ర పూర్వం పూర్వరంగః సభాపూజా తతః పరమ్
కథనం కవి సంజ్ఞాదేః నాటక స్యాప్యథాముఖమ్."

అనియు పేర్కొనినాడు.

అనర్ఘ రాఘవ వ్యాఖ్యాత ఆచార్య శ్రీరామచంద్ర మిశ్రుడు

"పూర్వరంగః సభా పూజా కవేర్గోత్రాది కీర్తనమ్
నాటకాదేస్తథా సంజ్ఞా సూత్రధారోప్యథాముఖమ్"

అను ప్రాచీన శ్లోకము నుద్ధరించి, ఆ పూర్వరంగమున

"గీతి క్రియాచ వాద్యంచ వర్ణికాగ్రహణం తథా
ధ్రువతి ర్జవనికా యాశ్చ పూర్వరంగశ్చతుర్విధః"

పూర్వరంగమందు సంగీతము, వాద్యము, వేషధారణ, యవనికాధారణ మను నాలుగు కర్మలుండునని తెలపినాడు.

భావ ప్రకాశికాకారుడు శారదాతనయుడు

"నటో గీతేన వాద్యేన నృత్తే నాభినయేనచ
రంగే రామాద్యవస్థాభి రను కార్యాభి రంజసా
రామాది తాదాత్మ్య ప త్తేః ప్రేక్షకా_ రసయిష్యతి
సభాపతి సభాసభ్యగాయకా వాదకా అపి
నటీ నటాశ్చ మోద న్తే యత్రాన్యో న్యానురంజనాత్
అతో రంగ ఇతి జ్ఞేయః పూర్వం యత్ప్రకల్ప్యతే
తస్మాదయం పూర్వరంగ ఇతి విద్వద్భిరుచ్యతే
కళాపాతాః పాదభాగాః పరివర్తాశ్చ సూరిభిః
పూర్వం క్రియంతే యద్రంగే పూర్వరంగో భవేదతః"
"తస్యద్వావింశదంగాని ప్రత్యాహార ముఖానిచ"

నటుడు గీత, వాద్య నృత్తాభినయములచే రామాద్యవస్థా విశేషముల ననుకరించుచు, ప్రేక్షకులకు రామాది తాదాత్మ్య బుద్ధి నాపాదించి రసాస్వాద సమర్థుల నొనరించును. సభాపతి, సభ్యులు, గాయక, వాదకులు, నటీనటులను వారెల్లరు అన్యోన్యానురంజనమున ఆనందము నొందుటవలన ఇది రంగ మగు చున్నది. రంజన నాపాదించుటచే రంగమైనది. ఇట్టి రంగమున కళాపాతాదులు పూర్వ మొనరింపబడుటచే ఆ కళాపాతాది కార్యకలపమునకు పూర్వ రంగ నామము వచ్చినది. ఇట్టి పూర్వ రంగమునకు ఇరువదిరెం డంగము లుండునని విశ్వనాథుడు తెలిపినాడు.

"ప్రత్యాహారాధి కాన్యంగాని త్వస్య భూయాంసి యద్యపి
తథాప్యవశ్యం క ర్తవ్యా నాందీ వి ఘ్నోపశాంతయే."

ప్రత్యాహారాది అంగము లనేకము లున్నను విఘ్న నివారణార్థము తప్పక నాంది నొనరింపవలయునని పూర్వరంగాంగములలో నాంది నొక్క దానినే పరిగ్రహించినాడు. ఇట్లుతే, మిగిలిన ఆలంకారికులును పేర్కొనినారు.

నాట్య శాస్త్రమున పూర్వ రంగాంగములు స్పష్టముగా నిరూపింపబడినవి. అభినవ మతానుసారము భావ ప్రకాశికా కారుడు పూర్వరంగములను నిరూపించినాడు. రూపక ప్రయోగమునకు ముందే ప్రయుక్తమగును గాన ఇది పూర్వరంగమగునని భరతుడు నుడివినాడు. గీత, తాళ, వాద్య, నృత్తములు విడివిడిగా గాని సము దితముగా గాని ప్రయుక్తమగునది, నాట్యాంగ భూతమగునది పూర్వరంగమని అభినవుడు తెలిపినాడు. తౌర్యత్రికము పూర్వమే యొనరింపబడుట వలన పూర్వ రంగ నామము వచ్చినదని శ్రీహర్షుడనినాడు. రంగ సంరక్షణార్థము చేసెడి కర్మ కలాపము పూర్వరంగమగునని విప్రదాసుడు తన సంగీత చంద్రమున తెలిపి నాడు. "పూర్వరంగస్సభాపూజా" అని శుభంకరుడు నుడివినాడు.

"యతో రసాత్మకస్యాస్య ప్రయోగే ప్రయుయుక్షితే
రజ్యంతే వై సహృదయైః పూర్వరంగ స్తతః స్మృతః
సపాద భాగస్సకలః పరివర్తై స్సమన్వితః
ప్రయోగోఽయం యతోరంగే పూర్వమేవ ప్రయుజ్యతే
తేనోక్తా భరతాచార్య ప్రముఖైః పూర్వరంగతా
రంగ శబ్దేన తత్కర్మోచ్యతే తౌర్యత్రి కాశ్రితమ్
తత్పూర్వభాగో విద్వద్భిః పూర్వరంగ ఉదీరితః
సోపోహనా స్త ద్వినావా ధ్రువా ఉత్థాపనీముఖాః
సూత్రధార ప్రవేశార్థా యతోస్మిన్ పూర్వమేవహి
ప్రయుజ్యంతే తతః పూర్వరంగ తాచాస్య సమ్మతా
చతురశ్రత్ర్యశ్ర భేదాత్ ద్వివిధః సపునర్ద్విధా
శుద్ధచిత్ర విభేదేన పృథగేవంచతుర్విధః
కరణాంగహార రాహిత్యాత్ శుద్ధతా, చిత్రతాపునః
తత్సద్భావో, ధచిత్రాద్యైః మార్గైర్భిన్న ధ్రువాయుతః
చతురశ్ర స్తథాత్ర్యశ్రః షడ్విధః కైశ్చిదిష్యతే
కేషాంచనమతే మిశ్రోద్వయో స్సమ్మిశ్రణాన్మథః" కుంభుడు

"పద భాగాః కలాశ్చైవ పరివర్త స్తథైవచ
యస్మిన్ రంగే ప్రయుజ్యంతే పూర్వరంగస్స ఉచ్యతే"

అని భరత కల్పలత.

"నటేన నటనీయార్థతాదాత్మ్య పటునాస్ఫుటం
వక్ష్యతేభినయ స్సోర్థోయత్ర తన్నాట్యముచ్యతే
సత్యా రసాత్మక స్సాస్య ప్రయోగః ప్రచురేక్షితే
రక్షంతి యేన తత్కర్మ రంగం తౌర్యత్రికాశ్రితమ్
పూర్వోస్య భాగో విద్వద్భిః పూర్వరంగోనిగద్యతే
సూత్రధార ప్రవేశార్థా స్త ధౌత్వత్యాధికాధ్రువాః
ఉపోహనేన రహితాః క్రియాస్తే నాను రంజితాః
పూర్వరంగే ప్రయుజ్యంతే పూర్వరంగ విచారగీః
చతురశ్రత్ర్య శ్రోమిశ్ర స్వ్యాదయం భిద్యతే త్రిధా
శుద్ధశ్చిత్ర ఇతి ద్వేధా ద్విభేదోయ మిష్యతే
కరణై రంగ హారైశ్చరహిత శ్శుద్ధ ఉచ్యతే
మిళితసైశ్చిత్ర హేతుః చిత్ర ఇత్యుచ్యతేబుధైః."

-విప్రదాసు

# పూర్వరంగ ప్రయోజనము

భరతుడు ఇంద్రధ్వజోత్సవమున నాట్య ప్రయోగమునకు పూర్వము నాందిని మాత్రమే ప్రయోగించినాడు. దీనివలన పూర్వరంగాంగములలో ప్రధాన మైనది నాంది కావున దాని యుపయోగము చాలునని కొందరనినారు. అభినవుడు దాని నభ్యుపగమింపక, తన గురువగు భట్టతౌతుని అభిప్రాయము నీ విధముగ పొందుపరచినాడు: విఘ్నములు రాకుండ నాట్యప్రయోగ రక్షణార్థము ఆయా మండప భాగములందధిష్ఠించిన దేవతల పరితుష్టికై పూర్వరంగ మేర్పడినదని తెలిపితిమి. కావున సర్వాంగ పూర్ణమగు పూర్వరంగమునకు దేవతా పరితుష్టియే ఫలమని తేలినది. ప్రయోగమును చూచుటకు ప్రేక్షకు లెల్లరు నిర్దిష్ట సమయమున ఒకేసారి వచ్చుట సంభవింపదు. వివిధ వ్యావృత్తులవారు నెమ్మది నెమ్మదిగా నాటకమును చూడవత్తురు. అందు ముందే వచ్చి కూర్చొనువారికి ఏదో కొంత వినోదము చేకూర్చవలసి యున్నది. ఈ వివిధ పూర్వ రంగాంగము లీకొరత తీర్చగలవు. కావుననే 'వాద్యం స్త్రీ బాల మూర్ఖాది కుతూహలాది జననమ్ ప్రయోజ్యమ్' అని అభినవగుప్తుడు తెలిపినాడు. ఇప్పటికిని ఈ విశాల పూర్వరంగ విధానము వీథీ భాగవతములయందు కానవచ్చును. నాట్యశాస్త్రమును బట్టి ప్రరోచనాంతముదాక నుండు పూర్వరంగ విధు లేమియు రూపకమునకు సంబంధించినవి కావు. ఇంతేగాక, పూర్వరంగమందు జెప్పబడిన ధ్రువలు గాని, గీతములు గాని, రూపకకర్త వ్రాసినవి కావు. సూత్రధారాదులే తత్కాలోచిత ముగా వానిని సేకరించికాని, వ్రాసికొని కాని సందర్భానుసారముగ నుపయో గించెడివారు. పూర్వరంగమందు భరతు డనేకాంగములను పేర్కొన్నను సంస్కృత రూపకములలో నగుపడకుండుటకు కారణము వీని విషయమున కవి యుదాసీనుడగుటయే. నవీనాలంకారికులీ యంగములను వివరించుటయే మాని వేసినారు. ఒక్క శారదా తనయుడే వీనినెల్లను పేర్కొని నిర్వచించినాడు.

దశరూపక కర్త నాందినిగాని, పూర్వరంగాంగములను కాని కనీసము స్పృశింపనైన లేదు. విశ్వనాథుడు నాట్యప్రయోగమునకుముందు రంగ విఘ్నోప శాంతికై ఒనరించెడి కర్మ పూర్వరంగమని, దీనికి ప్రత్యాహారాద్యంగము లనేకము లున్నవని ఆ యంగములలో ముఖ్యముగా విఘ్నోప శాంతికై నాంది నవశ్యము గావింపవలయునని తెలుపుచు ఒక్కనాందినే నిరూపించినాడు. ఈ విధముగా సంక్షిప్తమై పూర్వరంగము చివరకు నాందీమాత్రావశిష్టమైనదని మనకు తెలియుచున్నది. ఇంక భరత, శారదాతనయులు పేర్కొనిన పూర్వరంగాంగములను గురించి తెలిసికొనవలసియున్నది.

# పూర్వరంగాంగములు

"ప్రత్యాహారోవతరణం ఆరంభా స్రావణే అపి
వక్త్రపాణి స్తతఃతత్ర భవేచ్చ పరఘట్టనా
సంఘట్టనాతతోమార్గాసారితంచతతోభవేత్
శుష్కాపకృష్టకమ్ తత్రత్రిగతాసారితే అపి
గీతంధ్రువా త్రిసామస్యాత్ రంగద్వార మతఃపరమ్
సవర్ధమానకం చారి ర్మహాచారి స్తతఃపరమ్
ఏతాన్యంగాని కత్థ్యంతే పూర్వరంగస్య సూరిభిః"

భావప్రకాశిక (ఏడవ అధ్యాయము

"ప్రయోక్తవ్యశ్చ సాంగోయం తదంగాన్యభిదధ్మహే
ప్రత్యాహారోవతరణం తతశ్చా శ్రావణాయుతా
ఆరంభః స్యాత్ వక్త్రపాణి స్తతశ్చపరిఘట్టనా
తతోమార్గాసారితా సారితే
తథాఉత్థాపనాపరివర్తోనాందీ శుష్కాప కృష్టకా,
రంగద్వారం తతశ్చారీమహాచారీతితంతతః
ప్రస్తావనేతి భరతః క్రమాదుదదిశన్మునిః"

విప్రదాసు

అధాభిధాస్యతే సమ్యక్ పూర్వరంగాంగ సంగ్రహమ్
ప్రత్యాహారోవతరణమాశ్రావణారంభవక్త్రపాణీచ
పరిఘట్టనాథసంఘోటనాథ మార్గాసారింతంచ ఆసారి
తోత్థాపిన్యౌ నాందీ శుష్కావకృష్టాహ్వౌ రంగద్వారం చారీ
సైవ మహత్పూర్వికా త్రిగతం ప్రస్తావనేతి కథితాన్యేతా
న్యంగానిభారతీపూర్వైః అంగై రేభిరిహాంగీ నిష్పన్నః
పూర్వరంగోఽయమ్ —కుంభః.

"ప్రత్యాహారము, అవతరణము, ఆరంభము, ఆశ్రావణము, వక్త్రపాణి, పరిఘట్టన, సంఘట్టన, మార్గాసారితము, శుష్కావకృష్టము, ఉత్థాపనము, పరివర్తనము, నాంది, ప్రరోచనము, త్రిగతము, ఆసారితము, గీతము, ధ్రువము, త్రిసామము, రంగద్వారము, వర్ధమానకము, చారి, మహాచారి" అను ఇరువది రెండును పూర్వాంగములు. ప్రత్యాహార, అవతరణ, ఆరంభ, ఆశ్రావణ, వక్త్రపాణి, సంఘట్టన, సంఘోటన, మార్గాసారిత, ఆసారితములనునవి తొమ్మిది అంతర్యవని కాంగములు. వీనికి బహిర్గీతములనియు నామము గలదు. ఉత్థాపన, పరివర్తన, నాంది, శుష్కావకృష్ట, రంగద్వార, చారి, మహాచారి, త్రిగతము ప్రరోచనయనునవి బహిర్యవనికాంగములు. తెరతొలిగిన పిదప వాద్య సహితముగా నివి నిర్వర్తింపబడును. బహిర్గీతమును నిర్గీతమనియు నందురు.

## బహిర్గీత విధి : వీని లక్షణములు

"కుతపస్యతు విన్యాసః ప్రత్యాహార ఉదాహృతః
కుతపోమురజాదీనాం భాండాదీనాంచ యఃస్మృతః
యదా ప్రియంతే భాండాద్యాః ప్రత్యాహార స్తతోభవేత్."

కుతప విన్యాసము ప్రత్యాహార మనబడును. తంత్రీభాండాది వాద్యములను రంగస్థలమున వాయించుట కనుకూలమగుచోట నేర్పరచుట 'కుతప' మనబడును. మృదంగము వాయించు నతడు తూర్పు మొగమున, పణవవాదకు లాతని ఎడమ ప్రక్కన, రంగ పీఠమునకు దక్షిణమున గాయకు డుత్తరాభిముఖుడగుట, ఆతని ఎదుట దక్షిణాభిముఖముగ పాటకత్తెలు కూర్చుండుట, వీటం్ఆదకు లెడమవైపు, వేరొకవైపు వేణు వాదకులు కూర్చొనియుండుట కుతప సన్నివేశము. ఇట్టిదానినే ప్రత్యాహార మందురు. దీనివలన యాతుధానులు, పన్నగులు సంతసింతురు.

పై విషయమిట్లు నాట్యశాస్త్రమున పేర్కొనబడినది:

ప్రత్యాహారే యాతుధానాః ప్రీయంతే సహ పన్నగైః
తుష్యంత్యప్సరసస్తత్ర కృతేఽవతరణే ద్విజాః! వ్యాఖ్యాయామ్.

తుంష్యంత్యపిచ గంధర్వా ఆరంభే సంప్రయోజితే........
ఆశ్రావణాయాం యుక్తాయాం దైత్యా స్తుష్టంతి నిత్యశః
వక్త్రిపాణౌ కృతే చైవ నిత్యం తుష్యంతి దానవాః
పరిఘటనాయాంతుష్టా యుక్తాయాం రాక్షసా గణాః
సంఘోటన క్రియాయాంచ తుష్యంత్యపిచగుహ్యకాః
మార్గాసారిత మాసాద్య తుష్టాయక్షా భవంతిహి
గీతకేషు ప్రయుక్తేషు దేవాస్తుష్యంతి 'నిత్యశః
వర్ధమానే ప్రయుక్తేతు రుద్రస్తుష్యతి సానుగః
తథా చోత్థాపనేయుక్తే బ్రహ్మా తుష్టో భవే దిహ
తుష్యం తిలోకపాలాశ్చ ప్రయుక్తే పరివర్తనే
నాందీ ప్రయోగేథ కృతే ప్రీతో భవతి చంద్రమాః
యుక్తాయా మవకృష్టాయాం ప్రీతా నాగా భవంతిహి
తథా శుష్కావకృష్టాయాం ప్రీతః పితృగణో భవేత్
రంగద్వారే ప్రయుక్తేతు విష్ణుః ప్రీతో భవే దిహ
జర్జరస్య ప్రయోగేతు తుష్టా విఘ్న వినాయకాః
తథా చార్యాం ప్రయుక్తా యా ముమా తుష్టా భవేదిహ
మహా చార్యాం ప్రయుక్తాయాం తుష్టో భూత గణో భవేత్
ఆశ్రావణాది చార్యంత మేతద్దైవత పూజనమ్
సర్వ దైవత పూజార్హం సర్వ దైవత పూజనమ్
ధన్యం యశస్య మాయుష్యం పూర్వ రంగ ప్రవర్తనమ్

అని పంచమాధ్యాయమున రంగ దైవత తుష్టి వివరింపబడినది.

ప్రథమాధ్యాయమున రంగపూజాఫలము తెలుపబడినది:

అపూజయిత్వా రంగంతు నైవ ప్రేక్షాం ప్రవర్తయేత్
అపూజయిత్వా రంగంతు యః ప్రేక్షాం కల్పయిష్యతి
నిష్ఫలం తజ్ జ్ఞానం తిర్యగ్యోనిం చ యాస్యతి
యజ్ఞేన సమ్మితం హ్యేతత్ రంగదైవత పూజనమ్
తస్మా త్సర్వప్రయత్నేన కర్తవ్యం నాట్య యోక్తృభిః
నర్త కోర్థపతిర్వాపి యః పూజాం న కరిష్యతి

న కారయిష్యత్యన్యైర్వా ప్రాప్నోత్యపచయంతుసః
యధా విధి యధా దృష్టం యస్తు పూజాం కరిష్యతి
స లప్స్యతే శుభా నర్థాన్ స్వర్గలోకంచ యాస్యతి.
రజ్యతే ఽనేనేతిరంగః నాట్యం తదా ధారత్వాత్ మండపః
తదధిష్ఠాతృత్వాచ్చ దేవతా అపి" అని అభినవుడు.

తృతీయాధ్యాయమునను రంగపూజావశ్యకత భంగ్యంతరమున వెల్లడింపబడినది.

పూజితాః పూజయంత్యేతే మానితా మానయంతి చ
తస్మా త్సర్వప్రయత్నేన కర్తవ్యం రంగపూజనమ్
నతథా ప్రదహత్యగ్నిః ప్రభంజనసమీరితః
యధా హ్యపప్రయోగస్తు ప్రయుక్తో దహతి క్షణాత్
శాస్త్రజ్ఞేన వినీతేన శుచినా దీక్షితేనచ
నాట్యాచార్యేణ శాంతేన కర్తవ్యం రంగపూజనమ్.

నాట్యసిద్ధి మాతృకలు ప్రసన్నమగును (ఇది యొనరించువాని కని) అని ఇట్లు అష్టమాతృకలు తెలుపబడినవి:

సరస్వతీ ధృతిర్మేధా హ్రీ శ్రీర్లక్ష్మీ స్స్మృతి ర్మతిః
పాంతువో మాతర స్సౌమ్యా స్సిద్ధిదాశ్చ భవంతు వః.

2. "అత్రావరణం తత్స్యాత్ గాయాకానాం నివేశనమ్."

రంగమున గాయకులు ప్రవేశించి నిర్దిష్ట స్థానములందు కూర్చొనుట 'అవతరణ' మనబడును. దీనివలన అప్సరసలు సంతుష్టులగుదురు. రంజక వర్గమున గీత మవశ్యముండవలయుననుట నాట్యాచార్యులు నిర్దేశించిరి. పురుషుడు లక్షణోపేతముగ గాన మొనరించినను స్త్రీ విరహితమైన ప్రయోగము మనో వినోద కరము గాదు. కాన ఇట గాయక పదమునకు గాయనీ గాయకులని అర్థము గ్రహించుట యుత్తమము.

3. "బహు కార్య సమారంభః ఆరంభ ఇతికథ్యతే."

పాటపాడుటకుముందు గాత్రమును సరిజేసికొనుటకు ఆలాపము చేయుట 'ఆరంభ' మనబడును. దీనివలన గంధర్వు లానందింతురు.

4. "వాద్యానాం మురజాదీనాం ప్రస్తుతిః కార్యముచ్యతే
ఆస్రావణం నామ భవేద్యస్మిన్ ఆతోద్యరంజనమ్."

ఆతోద్యరంజన మాస్రావణము. అనగా ఆయా వాద్యముల శ్రుతులను ఏకోన్ముఖమగునట్లుగ సరిజేసుకొనుట. సర్వాతోద్యములు సముచిత శ్రుతి సంధానము కలిగినపుడే యుపరంజనము సిద్ధించును. దీనివలన దైత్యు లానందింతురు.

5. "తంత్ర్యాదేః దండహస్తాద్యైః దీప్తిరాతోద్యరంజనం
విభాగో వాద్య వృత్తీనాం వక్త్ర పాణిరిహోచ్యతే
సమోప పరిపూర్వాశ్చ పాణయః త్రివిధాస్మృతాః."

వాద్యవృత్తి విభాగము వక్త్రపాణియనబడును. వాద్య వక్త్రమున పాణి యుండుట వక్త్రపాణి. దక్షిణ వృత్తి, వామవృత్తి మొదలగు వృత్తుల ననుసరించి వాద్యమును సరిజేసికొనుట వక్త్రపాణి. వాద్య వక్త్రమున హస్తాంగుళి వ్యాపారము వక్త్రపాణి యని తాత్పర్యము. సమపాణి, ఉపపాణి, పరిపాణి యని పాణి విధానములు మూడు గలవు. దీనివలన దానవులు సంతుష్టులగుదురు.

6. "తంత్ర్యోజస్కరణార్థం యత్సాప్రోక్తా పరిఘట్టనా"

వీణాదులపై అర్థరహితములైన ధ్వనులను పలికించుట 'పరిఘట్టన.' దీనివలన రాక్షసులు ప్రముదితులగుదురు.

7. "అత్రపాణి విభాగోయోమతః సంఘట్టనా బుధైః
సంఘట్టనా విధిర్వీణాగత ఇత్యేవ కేచన."

లయానుగుణముగా మురజాది వాద్యములను సంవాది ధ్వనులను సరి జూచుకొను నిమిత్తము వాయించుట 'సంఘట్టన.' కొందరు వీణాగతమగు స్వర మును సరిజూసుకొనుటకు చేసెడి వాదనయే సంఘట్టన యందురు. భరతుడు దీనిని "సంఘోటన" యని అనినాడు. దీనివలన గుహ్యాకు లానందింతురు.

8. "యోగోత్రతతంత్రీ భాండానాం మార్గాసారిత ముచ్యతే.
కళాపాత విభాగోత్ర భవేదాసారిత క్రియా."

తంత్రీ వాద్యములను, మురజాది భాండవాద్యములను సమ్మేళనపరచి పలికించుట 'మార్గాసారితము.' ఇందు కళాపాత విభాగ మాసారిత క్రియ యగును. దీనివలన యక్షులు సంతృప్తులగుదురు.

9. "అనర్థ వర్ణాపా కృష్టిర్భవేత్ శుష్కాప కృష్టకమ్
శుష్కాప కృష్టకమ్ తేన ఇత్యుచ్చారణం భవేత్."

అర్థము లేని ఝం, ఝం; టం, టం పదములతో నిండియుండు ధ్రువాపదము శుష్కాపకృష్టకము. ఇది జర్జర స్తుతి పూర్వకమై యుండును. దీనివలన పితృగణములు, నాగులు, విఘ్నవినాయకులు ప్రసన్నులగుదురు.

10. "యస్మాదు త్థాపయం త్యాదౌ ప్రయోగం నాంది పాఠకాః
తస్మా దుత్థాపనం జ్ఞేయం వాగంగ వ్యక్తి కారకమ్."

నాందీ పాఠకులు రంగమునందు ప్రప్రథమముగా ప్రయోగమున కుపక్రమింతురు కాన 'ఉత్థాపకము.' ఇది వాగంగ వ్యక్తి కారకము. దీనివలన బ్రహ్మ సంతుష్టు డగును. ప్రత్యాహారాదులన్నియు దీనిచే నుత్థాపితములగుటచే ఈ నాందీ పాఠ ప్రయోగోపక్రమమునకు 'ఉత్థాపక' మను నామము వచ్చినది.

11. "యస్మాత్తులోక పాలేభ్యః పరివృత్య చతుర్దిశమ్."

నలుదిక్కులకు తిరిగి రంగ విఘ్నశాంతి నొనరింపనై లోకపాలురకు నమస్కరించుట 'పరివర్తనము.' దీనివలన లోకపాలురు ప్రీతులగుదురు.

12. "ప్రరోచనా సా యత్రైవ ప్రఖ్యాతోదాత్త వస్తునః
ప్రశంశయా ప్రేక్షకాణామ్ ఉన్ముఖీ కరణంతుయత్."

రూపకమున వర్ణ్యమానము, ఉదాత్తము నగు వస్తువును ప్రశంసించుట ద్వారా ప్రేక్షకులకు నాట్య ప్రయోగమునం దాభిముఖ్య ముదయించునట్లు చేయుట 'ప్రరోచనము.'

13. "సూత్రధారో నటశ్చైవ తథా వైపారి పార్శ్వకః
కుర్వంతి యత్ర సల్లాపం తదేతత్ త్రిగతమ్ స్మృతమ్".

సూత్రధారుడు నటునితోగాని, పారిపార్శ్వకునితోగాని ముచ్చటించుచు నాటకీయార్థమును సూచించుట 'త్రిగతము.'

విదూషకు డాకస్మికముగ రంగమందు ప్రవేశించి అసంబద్ధ కథాలాపముతో సూత్రధారుని నవ్వించును. మరియు ఆ సంభాషణములో ఆరోపణయుక్తమగు వైతండిక వాదము లేవనెత్తుచు రూపక కథకు సంబంధించినట్లుగా - ఎవరు? ఎక్కడ? ఎవరు చేయించినారు? - అనుచు ప్రశ్నలు వేయుచుండును. పారిపార్శ్వకుడు వాదించుచుండును. దానిని విదూషకుడు ఖండించును. సూత్రధారుడు నిర్ణయము చేయును. దీనినే త్రిగత మని భరతుడు పేర్కొన్నాడు. ఇది బుఱ్ఱకథలకు మూలము కావచ్చును. కాని, వ్యక్తిత్రయము లేకున్నను అనే కార్థ యోజనను బట్టి అనేక విధముల భాసించుటయు త్రిగతమగునని తరువాతివారు ఇంచుక లక్షణమును సవరించినారు.

14. "ఆసారితం బహిర్గీత విధిరిత్యుచ్యతే బుధైః."

బహిర్గీత విధిని 'ఆసారిత' మందురు. ఇది తాళగత విధికి సంబంధించియుండునది. దీనివలన యక్షులు సంతుష్టులగుదురు.

15. "అత్ర గీతవిధిః పూర్వైః బహుశోభరతాదిభిః
వ్యాఖ్యాతస్తత్ర వైపుల్యాత్ నాస్మాభిరభి ధీయతే."

దేవతలను కీర్తించుట కొరకు నిర్దిష్టమైనది గీతవిధి. గీతవిధిని గురించి భరతాదులు విపులముగా వివరించినారు కాన మేము వివరించుట లేదని శారదాతనయు డనినాడు. దీనివలన దేవతలు ప్రీతులగుదురు.

16. అధికాచాప కృష్టాచ ప్రావేశిక్యావసానికీ
అంతరాచేతి పంచైతాః ధ్రువా నాటక సంశ్రితాః."

నాటకాశ్రితములైన ధ్రువారీతులైదుగలవు. అధిక, అపకృష్ట, ప్రావేశిక, ఆవసానికి, ఆంతర - అనునవి ధ్రువాభేదములు. వస్తువు, ప్రకృతి, ఋతువు, వయస్సు, దేశము, కాలము, రసభావాదులు, వివిధావస్థలు అనువానిలో ఈ ధ్రువాగీతములుపయోగింపబడును.

17. "త్రిసామస్యాత్ త్రినృత్తంచ త్రిలయంచ త్రిపాణియత్
వాగంగ సత్త్వాభినయైః త్రి నృత్తమభి ధీయతే."

వాగంగ సత్వాభినయములచే నివర్తింపబడునది 'త్రినృత్తము'. త్రిసామము దేవతావాహన విసర్జనముల కుపయోగపడును. అందు మొదటి సామముచే చరాచర ప్రపంచ సృష్టి, స్థితి, సంహారకారణుడగు బ్రహ్మను, చంద్రుని, పన్నగులను సంతుష్టి పరచవలయును. రెండవదగు రథంతర సామముచే మునులను, మూడవదగు బృహత్సామముచే దైవతములను ప్రీతులను జేయవలయును. మూడు సామములు గలది యగుటచే త్రి సామ మనబడును. ఇది త్రిమూర్తులకు ప్రీతికరము. నాల్గు వేదములకు మొదట నోంకారము వోలె సర్వగీతములందు త్రిసామ గానము చేయవలెను. ఇది త్రి ప్రచారములు, త్రి లయలు, అడ్డిత మార్గమును కలిగినదై షట్కలముగా గాని, త్రి కలముగా గాని ప్రయోగింపబడును.

18. యస్మాదభినయో యత్ర ప్రథమం త్వవతార్యతే
రంగద్వారమతో జ్ఞేయం వాగంగాభినయాత్మకమ్"

వాగంగా భినయాత్మకమైన అభినయము రంగస్థలమున అవతరింపబడుట వలన 'రంగద్వార' మనబడును. దీనివలన విష్ణువు సంప్రీతుడగును. ఏ దేవుని మహోత్సవమున ప్రస్తుతము నాట్యము ప్రదర్శింపడునో ఆ దేవుని గూర్చి గంభీర స్వరయుతముగా నొక శ్లోకమును పఠింపవలయును. పిదప రాజునకు ఏ దేవుని యందు భక్తి కలదో ఆ దేవునిగూర్చి గాని, అచటి బ్రాహ్మణాదులగు పెద్దలను గూర్చిగాని మరియొక శ్లోకమును పఠింపవలయును. ఈ రంగద్వార మంతమున జర్జర గౌరవార్థము మరియొక శ్లోకమును సాభినయముగా పఠింపవలయును. సామాన్యముగా సంస్కృత రూపకములు పరిశీలింతుమేని ఏదో ఒక దేవతోత్సవమున ప్రదర్శింపబడినట్లు కావచ్చును. ప్రతి దేవాలయమున నాట్య ప్రదర్శన కనువగు రంగశాలలుండెడివేమో!

19. "ఆసారితాది వాగ్గీతం నృత్తం వాద్య మథాపివా
వర్ధతేఽభినయోవా స్యాత్ స భవే ద్వర్ధమానకః."

ఆసారి తాదికము గాని, గీతము గాని, నృత్తము గాని, వాద్యము గాని, అభినయము గాని రంగస్థలమున అభివృద్ధి పొందుచుండునేని 'వర్ధమానక' మగును.

20. శృంగారాభినయము 'చారి' యనబడును.

21. రౌద్రాభినయము 'మహాచారి' యనబడును. శారదా తనయుడు 'ఏకవాద్య ప్రచారోయః సచారిత్యభిధీయతే, మండలాది ప్రచారోయః సమహాచారిరిష్యతే" అని ఏకవాద్య ప్రచారము గలది చారియని, మండలాది ప్రచారము కలది మహాచారి యనియు రెంటికి భేదము తెలిపినాడు.

22. 'నాంది' యనునది ఇరువది రెండవ అంగము. నాందీ స్వరూపము తదుపరి వివరింపబడును.

నాందికి పూర్వమనగా అంతర్యవనికాంగములు ప్రత్యాహారావతరణ ఆరంభ, ఆశ్రావణ, వక్త్రపాణి, పరిఘట్టన, సంఘట్టన, మార్గాసారిత, ఆసారితము లనునవి తొమ్మిది గలవు. వాస్తవముగా ప్రత్యాహారావతరణారంభములను మూడింటికి ప్రత్యేక స్థితి లేదు. ఇది ఆశ్రావణముననే అంతర్భవించునవి. మిగిలినవి రంగద్వారాదులు.

**బహిర్గీత విధులు :** వీనిలో ప్రరోచన, త్రిగతము, నాంది అనునవి మనకు రంగస్థలమున స్పష్టముగా గోచరించుచున్నవి. కొందరు త్రిగత, ప్రరోచనములను పూర్వరంగాంగములు, ప్రస్తావనాంశమగు ప్రరోచన, వీథ్యంగమగు త్రిగతము, భారత్యంగమగు నాంది వేర్వేరని తలతురు. అవియే భారత్యంగములుగా పరిణమించినవని విచక్షణు లందురు. విశ్వనాథుడు రూపకములలో నుండెడి నాందీ శ్లోకమును నాందిగా స్వీకరింపలేదు. అది అతని మతమున రంగద్వారమే. పూర్వరంగాంగమగు నాంది నొనరించువారు సూత్రధారాదులని, నాటకము నిర్విఘ్నముగా కొనసాగవలయునను తలంపున నొనరించెడి యిష్ట దేవతా నమస్కారాత్మమగు మంగళ శ్లోకము కవి యొనరించునదని నుడువుచు 'కాళిదాసాది మహాకవుల రూపకములలోని "వేదాంతేషు యమాహురేక పురుషమ్" ఇత్యాది పద్యములలో నాందీ లక్షణము కానరాదు. ఇది సూత్రధార కల్పితము గాదు. కవికృతమే. నాంది యనునది సూత్రధార కల్పితము కావున 'నాంద్యంతే' అనిన పిదపనే పూర్వోక్తమంగళ శ్లోకము కానవచ్చుచున్నద'ని నుడివినాడు.

నాట్యదర్పణమున "నాందీచ పూర్వరంగాంగానాం ద్వాదశ మంగమ్ సకలపూర్వరంగాంగోప లక్షికా, తేన నాంద్యంతే సూత్రధార ఇత్యస్య సకల పూర్వరంగాంగాని తు కేషాంచిత్ లోక ప్రసిద్ధత్వాత్ కేషాంచిత్ నిష్ఫలత్వాత్ కేషాంచిత్ అనవశ్యంభావిత్వాత్ చ నలక్ష్యంతే. నాందీతు అవశ్యం భావిత్వాత్ మంగళాభిధాన పూర్వకత్వాచ్చ శుభకృత్యారంభ స్యేతి లక్షితా. అతఏవ కవయో రూపకారంభే నాంద్యంతే సూత్రధార ఇతి పఠన్తి. యత్రతు కవికృతా నాందీ నదృశ్యతే తత్ర రంగసూత్రణా కర్తృకృతా ద్రష్టవ్యా. నాందీ పాఠకాశ్చ సూత్రధార, స్థాపక, పారి పార్శ్వికాః ఇతి నాట్యదర్పణమ్, చతుర్థ వివేకమ్.'

నాంది పూర్వరంగాంగములలో పన్నెండవ అంగము. వాస్తవముగ పూర్వరంగాంగము లన్నియు నుపకరించునవికావు. వానిలో కొన్ని నిష్ఫలములు, కొన్ని అనావశ్యకములు. శుభ కార్యారంభమున మంగళాశంస చేయునది నాంది యగుటచే అదియే ప్రధానముగా స్వీకరింపబడినది. వాస్తవముగ నాంది (నాట్య ప్రయోగ) నాట్య ప్రదర్శన సాఫల్యమునకు సూత్రధారుడు పఠించెడి స్తుతి. అందువలననే 'నాంద్యంతమున సూత్రధారుడు' అను మాటను ప్రతి కవి రూపకారంభమున పేర్కొనుచున్నాడని విశ్వనాథుని అభిప్రాయమునే పోషించి నాడు. కాని రూపకమును వ్రాసినవాడు కవి. ఆ రూపకము వ్రాయుటకు పూర్వము నిర్విఘ్న పరిసమాప్తి నాశించి ఆ కవియే మంగళ శ్లోకము వ్రాయును. ఆతడు వ్రాసిన మంగళ శ్లోకమునే నాట్య ప్రయోగమునకు పూర్వము సూత్ర ధారుడు పఠించును. "సూత్రధారః పఠేదేనాం మధ్యమం స్వరమాశ్రితః" అనియు భరతుడు పేర్కొనినాడు. శాకుంతల వ్యాఖ్యాత శ్రీనివాసాచార్యులు విశ్వనాథుడు లేవదీసిన ఆ శంకను దృష్టిలో నిడుకొనియే సమాధాన మిట్లొసగినాడు:

"నాందీ ద్వివిధా క్రియా రూపా వాగ్రూపాచ" అని భరతుడు పేర్కొని నట్లు నాంది క్రియారూప నాంది, వాగ్రూప నాంది యని రెండు విధములు. "పూర్వరంగేంగ హారేచ సాక్షాత్ సన్నిహితః శివః" అని శాండిల్యు డనినట్లు పూర్వరంగాధిష్ఠానదేవత రుద్రుడు గావున అందాతడు సన్నిహితుడగుచు ఆ

నంది వాహనారూఢుని పుష్పాది రూపమున అర్చించుట క్రియా రూప నాంది యగును. "నందీ వృషః కోపి మహేశ్వరస్య, రంగత్వమాదౌకిల ఖే జగామ; తద్రంగ ముద్దిశ్య కృతాం తు పూజాం, నాందీతితాం నాట్య విదో వదన్తి॥" అని భరతుడు తెలిపినాడు. ఈ క్రియా రూప నాంది నేపథ్యగతు లగునటు లొనరింతురు. రంగము నందియే గావున ఆ నందిని పుష్పాదులతో పూజింతురు. ఇది తెర లోపల జరిగెడి క్రియా కలాపము.

ఇక రెండవది వాగ్రూపనాంది. క్రియారూపనాంది నొనరించెడివా డొకడు, వాగ్రూపనాందిని పఠించెడివాడు వేరొకడు. వాగ్రూపనాంది నమస్కార, వస్తు నిర్దేశాది సమన్వితమై బహు విధముల నుండును. దీనిని స్థాపక నామముగల సూత్రధారుడు నటీ పారి పార్శ్వికాదులలో నొకరిని తోడు జేసికొని రంగస్థలమున కావ్యార్థమును ప్రస్తావించును. ఆతడు మొట్ట మొదట వేదిక నెక్కి కావ్యార్థ సూచన గల శ్లోకమును మధ్యమ స్వరము ననుసరించి పఠించును. మొదటి సూత్రధారుడే స్థాపక నామమున వచ్చునని పలువు రాలంకారికు లందురు. ఆతడే వచ్చినను మరి యొకడు వచ్చినను చేసెడి కార్యకలాపము భిన్నమైనందున మొదటివాడు నాందీ పాఠకుడని, రెండవవాడు ప్రస్తావన నడుపువాడగుటచే స్థాపకుడని పిలువబడుచున్నాడు. ఇట్లు ఇది నాందియా? రంగద్వారమా? - ఇత్యాది ఆశంకలకు శ్రీనివాసాచార్యులు చక్కని సమన్వయము కూర్చినాడు. కావున రూపకాదులలో నగుపడెడి మంగళ శ్లోకము నాంది యనియే గ్రహించుట యుత్తమము. భాసుడు తన రూపకముల యందు స్థాపకునిచే రూపకమును పరిచయము చేయించలేదు. పూర్వరంగ విధుల నాతడు పోషించినట్లగుపడదు. సూత్రధారుడే రూపకమును గూడ ఆరంభించి నిష్క్రమించును. భరతు డింద్ర ధ్వజోత్సవ సందర్భమున నాట్య ప్రయోగమునకు పూర్వము అష్ట పదాంగ నాందిని ప్రయోగించినట్లు "పూర్వం కృతామయానాందీ ఆశీర్వచన సంయుతా, అష్టాంగా పద సంయుక్తా ప్రశస్తావేద సమ్మతా" అని ప్రథమాధ్యాయ శ్లోకము తెలుపుచున్నది. పరమేశ్వరుని సన్నిధి ప్రదర్శించినపుడు పరమేశ్వరుడు మెచ్చి సభారంజనకు తాండవ మెంతయో ఉపకరించునని తెలిపి ఆతనికి తాండవ

మొసగినట్లు నాట్య శాస్త్రము తెలుపుచున్నది. తాండవ మంగముగా స్వీకరింప బడుటవలన ఆ పూర్వరంగము చిత్ర పూర్వరంగ' మను నామమున వ్యవహరింప బడినదని అభినవ గుప్తుడు తెలిపినాడు. భాసుడు నాందిని గ్రహించి కొద్దిపాటిగా ప్రదర్శింప బోయెడి నాటకము నందు మొదలు వచ్చెడి పాత్ర సూచనను కవి కావ్య ప్రశంసాదులు ప్రస్తావనలో ప్రవేశ పెట్టబడినట్లు ఆయా రూపకముల పరిశీలన వలన తెలియును. భాసుని నాటకములలో నాంది తెరలోనే జరుగును. తరువాతి నాటకములు నాందితోనే ప్రారంభమగుచున్నవి. భాసుని రూపకములు సూత్రధార ప్రవేశముతో ప్రారంభము కాగా తరువాతి రూపకములు నాంది పిదప సూత్రధార ప్రవేశముతో ప్రారంభమగుచున్నవి. కావున ప్రస్తావన, లేక పూర్వరంగము భాస నాటకములలో నంకురించి, కాళిదాసాది రూపకములలో చిగిర్చి, మురారి ప్రభృతి నాటకములలో పూచినదని గ్రహించుట యుత్తమము.

# నాంది

"నందయతి ఆనందయతి సభ్యానితి నాందీ" అనికాని, "నందంతి అనయా ఇతి నాందీ" అనికాని వ్యుత్పత్తి చెప్పవచ్చును, దేని పఠన, శ్రవణాదుల వలన కవి, నట, పాఠక, ప్రేక్షక లోకమానందమొందునో అది నాందియని అర్థము. కావ్యప్రదీపకర్త ఈ అర్థమునే ఈ క్రింది శ్లోకమున వెల్లడించినాడు:

"నందంతి కావ్యాని కవీంద్ర వర్గాః
కుశీలవాః పారిషదాశ్చ సంతః
యస్మాదలం సజ్జన సింధు హంసీ
తస్మాదియం సా కథితేహ నాందీ."

భరతుడు ప్రథమాధ్యాయమున ఎనిమిది పదములుగల ఆశీర్వాద వాక్కు- "పూర్వంకృతా మయా నాందీ ఆశీర్వచన సంయుతా, అష్టాంగ పదసంయుక్తా ప్రశస్తావేద సమ్మతా" అని నుడివినాడు. అతడే తిరిగి ఐదవ అధ్యాయమున సూత్రధారుడు మధ్యమ స్వరము నాశ్రయించి ఆ నాందిని పఠింపవలయును. అది దేవ, ద్విజ, నృపాదుల ఆశీర్వాదము కలిగి యుండవలయును. ఇందు పంద్రెండు కాని, ఎనిమిది కాని పదములుండవలయును. రంగస్థలాధిష్ఠాన దేవతలు దేని వలన సంతసింతురో, దానికి 'నాంది' యను నామము వచ్చినది.

"సూత్రధారః పఠేన్నాందీం మధ్యమం స్వర మాశ్రితః
నాందీ పదైః ద్వాదశభిః అష్టభిర్వా ప్యలంకృతా
దేవద్విజ నృపాదీనాం ఆశీర్వాద పరాయణా
నందంతి దేవతా యస్మాత్ సా నాందీతి సంజ్ఞితా"

అని తెలిపినాడు. కోహలుడు :-

"ఆశీర్నమస్క్రియా రూప శ్లోకః కావ్యముఖోదితః
నాందీతి కథ్యతే. తస్యాం పదాది నియమోపివా,
మాంగల్యశంఖ చక్రాబ్జ కోక కైరవ శంసినీ,
యత్రాష్ట భిర్ద్వాదశభిరష్టాదశభి రేవవా
ద్వావింశత్యా పదైర్వాపి సా నాందీ పరికీర్తితా."

భరతుడు ఆశీర్వాద రూపమున నుండునది నాందియనగా, ఇతడు ఆశీర్న మస్క్రియా రూపమున నుండెడి శ్లోకము కావ్యారంభమున కూర్చబడునది నాంది యనినాడు. భరతుడు నాంది గద్యమా, పద్యమా అనునది తెలుపలేదు. మరియు కోహలుడు శంఖ, చక్ర, కోక, కైరవ, అబ్జ నామాంకితమై నాంది యుండవలయునని, ఇట్టి నాందిలో ఎనిమిది కాని, పండ్రెండు కాని, పదునెనిమిది కాని, ఇరువది రెండు గాని పదములుండవచ్చునని నుడివినాడు. 'నంది' కలది కనుక 'నాంది' యని కొందరు నుడివినారు. "నాందీ నందీశ్వర ప్రియా" నందికి ఈశ్వరునకును, లేదా నందీశ్వరునకును ప్రీతి పాత్రమైనది నాందియని మరికొంద రనినారు. భావ ప్రకాశికాకర్త "నాందీ నందీశ్వర ప్రియా" అను విషయమును చక్కగా వివరించినాడు.

"నందీవృషో వృషాంకస్య జగదాదౌ జగత్పతేః నృత్యతః కల్పనా యోగాత్ జగామ కిలరంగతామ్ తస్యతద్రూప సంబంధాత్ పూజానాందీతికథ్యతే, దేవతాది నమస్కార మంగళారంభ పాఠకైః యాక్రియా నంద్యతే నాట్యారంభే నాందీతి సాస్మృతా. యాపూర్వ రంగ సంబంధాత్ ద్వావింశ త్యంగ వర్తినీ, సభ్యాన్నందయతీ త్యేవంసాపి నాందీతి కీర్త్యతే యద్యంప్యంగాని భూయాంసి పూర్వ రంగస్య నాటకే, తథాప్యవశ్యం కర్తవ్యా నాందీ విఘ్నోప శాంతయే. నాందీ శ్లోకే యథా యత్నః కర్తవ్యః కవిభిః సదా చంద్రా యత్తతయా నాట్యే ప్రవృత్తే రస సంపదాం. ఏతదుత్థాపనాద్యంగ చతుష్కం నాంది పాఠకైః, విధేయ మస్మాత్ ప్రీయంతే బ్రహ్మాద్యా స్సర్వ దేవతాః సూత్రధారః పఠేత్తత్ర మధ్యమం స్వరమాశ్రితః. నాందీపదైః ద్వాదశభిః అష్టభిర్వా ప్యలంకృతాం తత్సంఖ్యాతై ర్భవేర్నాం దీ వాక్యైః క్వాపి వివక్షయా, సమ పాదా భవా నాందీ భవేదితిచ కేచన."

జగదారంభమున జగత్పతి యగు శివుడు నర్తన మొనరించుచు తన కల్పనాబలమున తన వాహన మగు నందిని రంగముగా నేర్పరచుకొనినాడు. కావున నందియే రంగస్థలమైనది. అందువలన నాట్యము ప్రదర్శించెడి రంగ స్థలము నందియగుట వలన దానికి పూజ ఏర్పడినది. ఈ పూజ మొదలు క్రియా రూపమున జరిగి పిదప వాగ్రూపమున నేర్పడినది. నందికి రంగరూప సంబంధ ముండుట వలన దానికొనరించెడి పూజ నాంది యైనదని మొదటి నిర్వచనము.

నాట్యారంభమునందలి ఈ క్రియ దేవతాది నమస్కార రూప మంగళము నారంభించు పాఠకులు అభినందించుటవలన నాంది యేర్పడినదని రెండవ నిదర్శనము. పూర్వ రంగమునకు చెందిన ఇరువది రెండంగములకుపస్కారమై-నట, గాయక, వాదక, కవి, ప్రేక్షకులను సభ్యులను ఆనందపరచుటచే నాందియను నిర్వచనము వచ్చినదని మూడవ నిర్వచనము. పూర్వ రంగమున నెన్ని యంగము లున్నను విఘ్నోపశాంతి కోరువాడు నాంది నవశ్య మాచరింపవలయును. నాందీ శ్లోకమును చంద్రనామాంకితముగా కూర్పవలయును. చంద్ర సంబంధము వాచ్యము గాను లేక ఆక్షిప్తముగాను అగునట్లు నాందీ శ్లోకమున కవులు యత్న మొనరింప వలయును. నాట్యమున నుండు రస సంపదల ప్రవృత్తి చంద్రాధీనము. అనగా చంద్రుని వలననే రసము పరిపుష్టమగును. కావున నాంది నామాంకితము కావలసి యున్నది. నాందీ పాఠకులు ఉత్థాపనాదులనెడు నాల్గంగములను కూర్చుకొనవలయును. ఉత్థాపన, పరివర్తన. ప్రరోచన, త్రిగతములనునవి ఉత్థాపనాదులు. దీని వివరణ పూర్వ మొసగబడినది. ఉత్థాపనాదులను కూర్చుటవలన బ్రహ్మాది సర్వ దేవతలకును ప్రీతి చేకూరును.

సూత్రధారుడు మధ్యమ స్వరము ననుసరించి పఠింపవలయును. ఇది గీతాంగము కాదు, పాఠ్యాంగమని మరువరాదు. ఈ నాందిలో పన్నెండుగాని, ఎనిమిది గాని పదము లుండవచ్చును. పదము వాక్యమా! శ్లోకపాదమా! సుప్తిజంతమా! అనునది వివక్షాధీనము. నాంది సమపాదముగా నుండవలయునని కొందరు పేర్కొనినారు. మాలతీమాధవ వ్యాఖ్యానమున భావదీపికాకర్త "చంద్ర నామాంకితా కార్యా సా రసానాం యతో నిధిః, ప్రీతే చంద్రమసి స్ఫీతా రసశ్రీరితి వాసుకిః" - చంద్రుడు ప్రీతి పాత్రుడైనపుడే రస సంపద పరిపుష్టమగును. కాన నాంది చంద్ర నామాంకితముగా నొనరింపవలయును - ఇది వాసుకి తెలిపినాడని ఈ శ్లోకము నుట్టంకించినాడు విశ్వనాధుడు:

"ఆశీర్వచన సంయుక్తా స్తుతిర్యస్మాత్ ప్రయుజ్యతే
దేవద్విజ నృపాదీనాం తస్మాన్నాందీతి సంజ్ఞితా"
"మంగల్యశంఖ చక్రాబ్జకోక కైరవశంసినీ
పదై ర్యుక్తా ద్వాదశభిరష్టాభిర్వాపదై ర్యుతా."

అని భరత, కోహల మతానుసారము నుడివినాడు. శాకుంతల వ్యాఖ్యాత రాఘవ భట్టు "ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యార్థ సూచకః నాందీ తి కథ్యతే" అని భరతుడు పేర్కొనినట్లు తెలిపినాడు. విక్రమోర్వశీయ వ్యాఖ్యాత సురేంద్ర నాథశాస్త్రి "దేవద్విజ నృపాదీనాం ఆశీర్వచన పూర్వికా, నాందీ కార్యా బుధైర్య త్నాత్ నమస్కారేణ సంయుతా" అను శ్లోకము నుదాహరించినాడు. రాఘవభట్టు సంగీత కల్పతరువులోని—

"హరోత్తమాంగ స్థితవస్తు వర్ణనైః
వాక్యార్థ భూమ్నార్థ పదైః త్రి సంఖ్యైః
షడ్భిః చతుర్భిః నృప విప్రసంసత్
సమాశిషా సంప్రవదంతి నాందీమ్"

శివమౌళి స్థిత వస్తు వర్ణనాపరమై, నృప విప్రాది ఆశీరూపమై యుండు నది నాందియని తెలిపినాడు. ఇట "త్రి సంఖ్యైః షడ్భిః, చతుర్భిః' అనుచోట కొందరు మూడు విధముల సమన్వయము చేసినారు. త్రి సంఖ్యైః షడ్భిః $3 \times 6 = 18$; షడ్భిః చతుర్భిః $6 + 4 = 10$; త్రి సంఖ్యైః చతుర్భిః $3 \times 4 = 12$ అనగా అష్టాదశ పదగా గాని, దశ పదగా గాని, ద్వాదశ పదగాగాని నాంది యుండవచ్చునని తెలుపుదురు. అభినవగుప్తుడు "నాందీ పదై ర్ద్వాదశభిః" అను భరత శ్లోకమునకు త్ర్యస్ర్య తాళానుగతముగా చతుష్పద అష్టపదగాను ఉండ వచ్చునని వివరణ చేసినాడు. సంగీత సర్వస్వమున "ప్రశస్త పదవిన్యాసా చంద్ర సంకీర్తనాన్వితా ఆశీర్వాదపరా నాందీ యోజ్యేయం మంగళాన్వితా" అని నాందీ లక్షణ మొసగబడినది. శబ్దకల్పద్రుమకారుడు "గంగా నాగపతిః సోమసుధా నందజయాశివః, ఏభిర్నామ పదైః కార్యా నాందీ ధారాభిరంకితా" నాందీశ్లోకమును గంగా నాగేంద్ర సోమ సుధా శివాది నామములు వచ్చునట్లు కూర్పవలయునని నుడివినాడు. మందార మరందమున "అష్టభిర్దశభిః శ్రేష్ఠా, తథా దశభిః పదైః; అష్టాదశపదైర్వాపి, ద్వావింశత్యా పదైః యుతా"-ఎనిమిది, పది, పన్రెండ్రు పదునెనిమిది, ఇరువదిరెండు పదములు నాందిలో నుండవచ్చునని, ఇవి శ్రేష్ఠమని పద నియమము చెప్పబడినది.

రసార్ణవ సుధాకర కర్త సింగభూపాలుడు "ప్రస్తావనాయాస్తు ముఖే నాందీ కార్యాశుభావహా, ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశాన్యతమాస్మృతా, చంద్రనామాంకితా ప్రాయో మంగళార్థ పదోజ్జ్వలా, అష్టభిః దశభిః శ్రేష్ఠా సేయం ద్వాదశభిః పద్రైః, సమైర్వావిషమైర్వాపి ప్రయోజ్యే త్యపరే జగుః" - ప్రస్తావనకు పూర్వము మొట్టమొదట నాంది ననుష్ఠింప వలయును. ఈ నాంది మంగళార్థక పదములతో నుండవలయును. చంద్రనామాంకితము కావలయును. ఆశీర్వాదము, నమస్కారము, వస్తునిర్దేశము అను త్రివిధ మంగళములలో ఏదేని యొకటి పాటింపవలయును. ఇందు ఎనిమిది, పది, పండ్రెండు పదముల నియమ ముండుట శ్రేష్ఠము. కొందరు సమపదగా గాని, విషమపదగా గాని నాంది యుండవచ్చునని తెలిపినారు. అనర్ఘ రాఘవ వ్యాఖ్యానమున రుచిపత్యుపాధ్యాయుడు కోహలుని శ్లోకములుగా వీనిని పొందుపరచినాడు:

"దేవతాదే ర్నమస్కారః గురూణామపిచ స్తుతిః
గోబ్రాహ్మణ నృపాదీనాం ఆశీర్నాందీతి కోహలః
పంచవింశ పదా నాందీ నిత్యమేవ శుభావహా
స్యాన్నాయకస్యచ కవేర్యది శంభు విభూషితా"
"నాందీం పద్రైః ద్వాదశభిః అష్టాభిర్వా ప్యలంకృతాం
తాం షోడశ పదామేకే కేచిదాహుః చతుష్పాదాం"

దేవతాదుల నమస్కారమును పెద్దవారి స్తుతి (గురుస్తుతి) గో బ్రాహ్మణ నృపాదుల కాశీస్సు గలది నాంది. ఈ నాంది ఇరువదియైదు పదములు కలిగి శంభువిభూషిత యగునేని కవికి, నాయకునకు శుభములు చేకూర్చును. నాందిలో పండ్రెండు గాని, ఎనిమిది గాని పదము లుండవచ్చునని తెలిపిరని పై శ్లోకముల నుద్ధరించినాడు. సంకల్ప సూర్యోదయ వ్యాఖ్యాత అహోబలాచార్యుడు అభినవ గుప్తోక్తములని ఈ శ్లోకముల నుదహరించినాడు.

"నాందీ పద్రైర్ ద్వాదశభి రష్టాభి ర్వా ప్యలంకృతా
షడ్భిః షోడశభిర్వాపి చతుర్భి స్త్రిభిరేవవా
అష్టాదశ పద్రైర్వాపి ద్వా వింశతి పద్రై స్తథా
శంఖ చక్రాబ్జ చంద్రేంద్ర కోకకైరవశంసినీ
త్ర్యశ్రావా చతురశ్రావా తాలమార్గానుసారిణీ"

అని యుద్ధరించినాడు. ఆరు గాని, మూడు కాని పదము లుండవచ్చునని ఎక్కువ తెలుపబడినవి.

"యన్నాట్య వస్తునః పూర్వం రంగ విఘ్నోప శాంతయే
కుశీలవాః ప్రకుర్వంతి పూర్వరంగస్స కీర్తితః
యద్యంప్యం గాని భూయాంసి పూర్వరంగస్య నాటకే
తేషా మవశ్యం కర్తవ్యా నాందీ నందీశ్వర ప్రియా"

అని సరస్వతీ విలాసమున చెప్పబడినది.

విప్రదాసు నాందిలో పంౘ్రెండు కాని, ఎనిమిది కాని, పదములుండ వచ్చునని, పదమనగా వాక్యము కాని, సుప్తిఙన్త పదముకాని కావచ్చునని, సూత్రధారు డిట నాందిని మధ్యమ స్వరమున పఠించునపుడు అతని కిరుప్రక్కల నుండు పారిపార్శ్వికులు అర్థప్రపంచన పరముగా పంౘ్రెండు వాక్యముల నుపయోగింపవలయునని ఈ క్రింది రీతి నుదహరించినాడు:

"ధ్రువాయాం గీయమానాయా మస్యాం నాందీం పఠేత్తతః
మధ్యమ స్వర మాశ్రిత్య సూత్రధార స్సలక్షణామ్.
స్యా ద్ద్వాదశ పదా నాందీ యద్వా దశపదా భవేత్
అథవాష్టపదా వాక్యం పదశబ్దేన భణ్యతే
అథవా సువిభక్త్యంతం పద మత్రోక్త లక్షణమ్।
ఏతాం నాందీం ప్రయుంజేత తదు దాహరణం యథా.
అర్థ ప్రపంచ సహితం కుర్యాతాం పారిపార్శ్వికౌ,
అర్థప్రపంచ వాక్యాని క్రమేణ ద్వాదశ స్వపి,
వాక్యేషూ భౌ యోజయతః తాని వక్ష్యామ్యను క్రమాత్,
సూత్రధారేణ వాక్యేస్మిన్ ప్రయుక్తే పారిపార్శ్వికాన్"

"శేషమహిహశయాయ నమో దివ్య కిరీట ధరాయ నమః,
చక్రోదారధరాయ నమస్సాగర శయనాయ నమః
యైరిదమాద్యై రంగ శరీరం భూషితమా ర్యైస్తే విజయంతాం
కవికులగీతం గుణపరివీతం హరిసమలీలం భజతన్నృపాలం॥

మాధవకితవ మమామికయా పీనకుచ ద్వయ పీడనయా,
ఇత్యుపహసితో రాధికయా వారిజలోచన పాలయగాః॥
జితమురజరనై రభి నవజల దైర్లసతి వసుమతీ,
శిఖరి వరవతీ నవజల లలిత స్వేదా పరితః
ప్రత్యగ్ర సస్యరోమాంచా, కలకృత మయూర శబ్దా
నృపవర హర్షాయ కల్పతామచలా॥

"శ్రీనాథశ్శ్రియ మాతనోతు జగతా, మృద్ధిం లభన్తాం బుధాః,
పృథ్వీశః పృథివీం ప్రశాస్తు సకలాం, గావోభవం త్వక్షయాః,
కాలేవర్షతు వారివాహ నివహో. భూరస్తు సస్యోత్తరా,
భూయాత్ క్షేమ సుభిక్షవాన్ జనపదో, రంగస్సదా వర్ధతామ్॥
యాయా త్పాపమతిఃక్షయం, విలసతాద్ధర్మస్య రక్షాకరో
భక్తిశ్శూలిని శాశ్వతీ ప్రసరతాత్ ప్రేక్షాకరోనందతాత్"
ఇది పన్రెండు పదముల నాంది. ఇట పదము వాక్యరూపము.

**సాగరుడు :**

"ప్రధానమంగం పూర్వరంగే సూత్రధార ప్రయోజ్యా, దేవస్తుతి సమాశ్రయా ఆశీర్వచనాత్మికా నాందీ - సాద్వాదశపదా అష్టపదావా. పద మపి ద్వయమత్ర సమ్మతం శ్లోకస్య పాదఏవ పదం తేషాం మతేన శ్లోకద్వయం, శ్లోకత్రయం వా విధాతవ్యం యేతు సుప్తిఙా సంజ్ఞాశబ్ద మిచ్ఛంతి తేషాం సుబన్త తిఙన్త పదైః ద్వాదశభిరష్టాభిర్వా ఏకఏవశ్లోకః కర్తవ్యః."

శ్లోకపాదము పదముగా భావించినవారు, రెండు కాని మూడు కాని శ్లోకములను సుబన్త తిఙన్తములను పదములుగా భావించువారు ఒక శ్లోకమును నాందిగ కూర్చవచ్చునని తెల్పినాడు.

**శుభంకరుడు :**

"గంగా గణపతి స్సోమః సుధానందో జయాశిషః
ఏతై ర్నామ పదైః భవైః నాందీ కార్యావిచక్షణైః
శివానంద కరీ నాందీ నాందీ విఘ్నోపశాంతయే
సూత్రధారః పఠేన్నాందీం మధ్యమం స్వరమాస్థితః"

అని నుడివినాడు. ఇట సోమ పదమునకు "చంద్రుడు, శివుడు" అని అర్థము. ముద్రారాక్షస వ్యాఖ్యాత ఢుంఠి రాజవ్యాసుడు :

"అర్థతశ్శబ్దతతోవాపి మనాక్కావ్యార్థ సూచనం
యత్రాష్టభిర్ద్వాదశభిరష్టాదశభిరేవవా
ద్వావింశత్యాపదైర్వాపి సా నాందీ పరికీర్తితా"

అను శ్లోకముల నుద్ధరించినాడు.

నందీశ్వర ప్రియావహముగా చేయబడునది గావున నాంది; సామాజికుల నానందపరచునది గావున నాంది; దేవతలను ప్రసన్నపరచునది గావున నాంది అని వివిధ వ్యుత్పత్తులను తత్తద్వ్యాఖ్యాత లొనరించినారు. ఎనిమిది, పండ్రెండ్రు, పదునెనిమిది, ఇరువదిరెండు పదములుండవలయునని విద్యానాథుడు నుడివినాడు. కొందరి మతమున పదునారు, మరికొందరి మతమున నాలుగు నుండవచ్చును. కోహలమతానుసారము నాంది యందిరువదియైదు పదములు కూడ నుండవచ్చునని ఋతుపత్యుపాధ్యాయుడు తెలిపినాడు. ఇక నాంది చంద్రనామాంకితము గావలయునని శారదాతనయుడు, శంఖచక్రాబ్జకోకకైరవాది మంగళ పదాంకితగా నాంది యుండవలయునని కోహలాదులు తెలిపిరి. ఇంతేగాక, నాందిలో ఆశీర్వచనముకాని, నమస్కారముకాని, వస్తునిర్దేశముకాని కూర్పవలయునని, నాంది వినుటకు సొంపుగా నుండవలయునని గ్రహింపవలయును. సూత్రధారుడే నాందిని మధ్యమ స్వరముతో పఠింపవలయునని పై వివిధ శ్లోకముల సారము.

## నాందీ విషయమున పద నియమము

నాందీ విషయమున పద వ్యవస్థ పద్య బాహుళ్యమును నివారించుటకై యేర్పడినదను అంశము సామాన్యమైనది. మనవారు పద నియమ మెందులకొనరించినారో పరిశీలింపవలసియున్నది. నాందీ విషయమున రెండు వాదములున్నవి. ఒకటి సూత్రధారుడే కల్పించుకొని నాందిని నిర్వహించుట. రెండవది కవి సూత్రధార సౌలభ్యమునకై నాందీ సహిత ప్రస్తావనలను నిర్వహించుట. మొదటి వాద ప్రకారము నాంది ననుష్ఠించువాడు సూత్రధారుడు. ఇతడు స్థాపకునికంటె భిన్నుడు. తెరలో జరుగవలసినది నాందీకార్యము. నాటకము ప్రారంభించుటకు పూర్వము జనము నాకర్షించుకొనుట కిప్పటి నేపథ్య సంగీతమువంటిదే అయినను

విఘ్నోపశాంతి దాని ప్రధాన ప్రయోజనము. కొంత జనామోదము అందు లేక పోలేదు. ఎంత అవసరమో అంతే నాంది కూర్చబడును. ఈ వాదప్రకారము నాందిలో పదవ్యవస్థా ప్రయోజనము కానరాదు. తత్తద్దేశకాల స్థిత్యనుగుణముగా సూత్రధారుడే నాంది కూర్చుకొనును. కావున నాంది సూత్రధార కల్పితమే యనువారి వాదానుసారము పద వ్యవస్థకు ప్రయోజనము లేదు.

ఇక రెండవ పక్షము చూచెదము :- కావ్యార్థ సూచన నాందీ పద్యమున ఉండవలసినదే. కావ్యార్థ సూచకముగా నాందిని కూర్చువాడు రూపక కర్త కాని సూత్రధారుడు కాదు. కవి విఘ్నోపశాంతికి కావ్యార్థ సూచనకును తగినన్ని పదములనే గ్రహించి నాంది నల్లును. అతడొనరింపవలసినది ప్రధానముగా నాంది గాని ప్రస్తావన గాని కాదు. రూపక నిర్మాణము ప్రధానమైనది. అట్టులేని నాందిని బహు పద్యములలో (నాలుగైదు కన్న మిన్నగా) నిర్మింపడు. కావున నాందీ పద్య బాహుళ్య నివారణ నిమిత్తము పద వ్యవస్థ జరుగలేదనవచ్చును. ఈ పద నియమమేదో ఒకదానికి ప్రతీకగా భావింపవలసి వచ్చుచున్నది. ఆ ప్రతీక యేదో అది నాటక స్ఫూర్తికి సరిపో వలయును. నాటకమున సంగీత, సాహిత్యములే కాదు, సర్వ కళలు అంతస్రో తస్సులుగా పరిస్పందించును. రూపకము సర్వ కళా సమన్వయముగా నొనరించిన వాడు బ్రహ్మ. బ్రహ్మకు స్ఫూర్తి నొసగినది పరమేశ్వరుని తాండవము. కావున ఈశ్వరారాధనతో అతి ప్రాచీన రూపములు ఆరంభింపబడినవి. కోహలాది మతానుసారము శంభు విలాసములను గురించి, శంభూత్తమాంగస్థములగు గంగా, చంద్రకళాదులను గురించి చేయబడునదియే నాంది. కావున నాందికి శంభువే ప్రతీక యని భావింపవలసి వచ్చుచున్నది.

అష్టాంగ పద సంయుత (ఎనిమిది అంగములుగా గల) నాందిని నిర్వ హించినానని భరతుడు ప్రథమాధ్యాయమున చెప్పినాడు. ఐదవ అధ్యాయమున నాంది అష్టపదకాదు. షోడశ పద; అష్టపద నాందిని పేర్కొనుటవలన "పూర్వ రంగేంగ హారేచ సాక్షాత్సన్నిహితశ్శివః." శివుడు నాట్యాధి దేవత. ఆతని వాహనమగు నందియే రంగస్థలమైనది. ఆ రంగస్థలమున శివుడు సన్నిహితుడై యుండును. "నాందీ నంది ప్రియావహా" అని చెప్పబడినది. నందికి ప్రీతి పరమేశ్వరుని స్తుతి వలన కాని లేక ఆ పరమేశ్వరమూర్తి స్మరణ వలన కాని

చేకూరును. పరమేశ్వరు డష్టమూర్తి: జలము, హుతభుక్కు, వాయువు, ఆకాశము, పృథ్వి, యజమానుడు, సూర్యుడు, చంద్రుడు- అను ఎనిమిది అతని మూర్తులు. ఆ మూర్తి స్ఫూర్తి కొరకే అష్టపద నిర్దేశము చేయబడినది. కాళిదాసు "యాసృష్టిః స్రష్టురాద్యా" అను పద్యమున ఈ అర్థము ననుసంధించియే అష్టపద నాందిని నిర్వహించినాడు.

సకల భూత సమారాధన భగవత్సమారాధన యగును. ఆ ప్రతీకగా నాందిలో ఎనిమిది పదము లుండవలయునని మొదలు అనుశాసించి పిదప ద్వాదశ పదములు కూడ నుండవచ్చునని భరతుడు ఐదవ అధ్యాయమున సూచించినాడు. అష్టమూర్తికి ప్రతీకగా అష్టపద నాంది రాగా, ద్వాదశ మూర్తికి ప్రతీకగా ద్వాదశపద నాంది వచ్చినది. ద్వాదశమూర్తి యనగా ద్వాదశాత్ముడు సూర్యనారాయణుడు.

తరువాతి వారు పది పదములు కూడ నుండవచ్చునని, యట్లుండుట శ్రేష్ఠమని నుడివినారు. ఇది దశమూర్తికి (దశావతారములకు) ప్రతీకగా నేర్పడినది. దశరూపక కర్త ధనంజయుడు దశరూపముల వోలె దశరూపముల దాల్చిన దాశార్హునకు నమస్కార మనినాడు. అటు పిదప పదునెనిమిది పదముల నాంది అంగీకరింపబడినది. ఇది అష్టమూర్తి, దశమూర్తు సమష్టి ఉపాసనకు ప్రతీక. పిదప ఇరువది పదముల నాంది వచ్చినది. ఇది అష్టమూర్తి, ద్వాదశ మూర్తుల ఉపాసనకు ప్రతీక. తరువాత ఇరువది రెండు పదముల నాంది యవతరిల్లినది. దశమూర్తి, ద్వాదశమూర్తుల ఉపాసన కిది సంకేతము. అట్లు కాక మరియొక రీతి సమన్వయము చేసికొనవచ్చును. ఈ సమన్వయము స్పంద వాదుల - అనగా సాహిత్యవాదుల ముప్పదియారు తత్త్వములలోని పూర్వ పూర్వ భాగములను బట్టి చేసికొనవలయునని తాత్పర్యము. సాహిత్య మనగా అన్యూనాతిరిక్త భావమున వైచిత్ర్యాధాయకముగా వాగర్థముల అనువృత్తి లేదా అనుగమము. ఏ తదనుగమ రూప సాహిత్యమునే స్పంద మందురు. శివుడు, శక్తి, సదాశివు, డీశ్వరుడు; శుద్ధ విద్య, మాయ, కళ, విద్య లను ఎనిమిదింటికి ప్రతీక అష్టపద నాంది. శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధ, విద్యలను ఐదు శుద్ధ తత్త్వములు; మాయ, కళ, విద్య, రాగ, కాల, నియతి, పురుషులను శుద్ధా శుద్ధ తత్త్వము భేదును కలసి పండ్రెండగును. వీనికి ప్రతీక ద్వాదశపద నాంది. ఇక మూడవ

విభాగము - పై పం|్రెండును, |ప్రకృతి, బుద్ధి, అహంకారము, మనస్సు - అను నాల్గింటితో కలసినచో పదునారగును. ఇది షోడశపద నాందికి |ప్రతీక యగును. నాల్గవ విభాగము - పంచభూతములు, పంచ శబ్దాది విషయములు, దశేం|్రదియములు కలసి ఇరుపది యగును ఏనికి |ప్రతీకగా వింశతిపద నాంది వచ్చినది. కొందరి మతమున ఇరువది యైదు పదముల నాంది కూడ కలదు. ఇది పంచ వింశతి తత్త్వములకు |ప్రతీక. మరి కొందరి మతమున ముప్పదియైదు పదముల నాంది శివ|ప్రీతి పా|్రతముగ భావింపబడినది. శివ తత్త్వమే మిగిలిన ముప్పదియైదు తత్త్వములుగా స్పందించుటచే ఆ ముప్పది యైదు తత్త్వములకు |ప్రతీకగా పంచ |త్రింశత్పద వచ్చినది.

నాట్య మొక దివ్య యోగమని మనము పూర్వము |గ్రహించితిమి. తత్పక్షానుసారము గూడ సమన్వయము చేసికొనవచ్చును. అష్టపద నాందికి |ప్రతీక అష్టపురులు. 1. జ్ఞానేం|్రదియ పంచకము 2. కర్మేం|్రదియ పంచకము 3. అంతఃకరణ చతుష్టయము 4. |ప్రాణపంచకము 5. భూతపంచకము 6. కామము 7. కర్మ 8. తమము - అనునవి అష్టపురులు. లేదా అష్టాంగ యోగము. దశపదనాందికి |భ్రూమధ్య వీధియందలి హృదయాకాశమున గోచరించు దశవిధాకాశములు కాని, లేక దశవిధ ఓంకారములు కాని |ప్రతీకయగును. "ధూ|్రమ, అర్చిస్సు, ఉష్ణ, జ్వాలిని, జ్వాలిని, విస్ఫులింగిని, సు|శ్రీస్వరూప, కపిల, కవ్య వహ, హవ్యవహ" - అనునవి పది అగ్నికళలు. ద్వాదశ పద నాందికి సూర్యకళలు |ప్రతీక, "తపిని, తాపిని, ధూ|్రమ, మరీచి, జ్వాలిని, శుచి, సుషుమ్న, భోగద, విశ్వ, బోధకి, ధారణి, క్షమ" - అనునవి సూర్య కళలు. షోడశపద నాందికి చం|్రదకళలు |ప్రతీక. "అమృత, మానవ, పూష, తుష్టి, పుష్టి, రతి, ధృత, శశిని, చం|్రదిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, |ప్రీతి, అంగద, పూర్ణ, పూర్ణామృత" - అనునవి పదనారు చం|్రదకళలు. సూర్య, అగ్నికళలలో ధూ|్రమ, తాపిని - అనునవి ఇరువురి యందుండుటచే ఆరెండింటి కిని ఇంచుమించు ఒకే |ప్రయోజనమగుట వలనను, ఆ రెంటిని తొలగించినచో ఇరువదియగును. ఇది వింశతిపద నాందికి సంకేతము. రవి, చం|్రదకళలలోని రుచి, కాంతులను కళలు ఇరుపక్షములం దేకార్థకములగుటవలన ఆ రెంటి కంత భేదము కానరానందున చం|్రదకళల నుండి 'రుచి, కాంతి'ని తగ్గించినచో అగ్ని కళలు పది, సూర్యకళలు పది, చం|్రదకళలు పదిహేను కలసి ముప్పది

యైదగును. ఇవి చిత్కళలు. ఇది పంచత్రింశత్పదనాందికి ప్రతీక. నాలుగు పురుషార్థములుకాని, నాలుగు శుశ్రూషలు కాని లేక చతుర్విధమండలములుకాని చతుష్పదనాందికి ప్రతీక. 1. స్థానశుశ్రూష 2. అంగశుశ్రూష 3. భావశుశ్రూష, ఆత్మశుశ్రూష అనునవి చతుర్విధ శుశ్రూషలు. 1. సూర్యమండలము 2. చంద్ర మండలము 3. అగ్నిమండలము 4. హిరణ్మయ మండలము- ఇవి చతుర్విధ మండలములు.

షోడశపద నాందికి మరియొక రీతి సమన్వయము చేయవచ్చును. 1. ఇడ 2. పింగళ 3. సుషుమ్న 4. గాంధారి 5. హస్తిజిహ్వ 6. పూష 7. అలంపూష 8. శుక్ల 9. విశ్వోదరి 10. పయస్విని 11. రక్తాహ్వాయ 12. సినీవాలి 13. కుహూ 14. శంఖిని 15. దామని 16. బ్రహ్మనాడి—ఇవి శరీరమున ప్రధాన కార్యములను నిర్వహించు పదునారు కర్మజ్ఞాన వాహికలు.

## అభినయపరముగా సమన్వయము

**1. షట్పదకు :-** "జంఘే బాహూ శిరోమధ్యం షడంగమిద ముచ్యతే" అన్నట్లు షడంగములు కాని వేదాంగములారు కాని, సంధి విగ్రహాది షడ్గుణములు కాని "ధన్వదుర్గం, మహీదుర్గం, గిరిదుర్గం తథైవచ, మనుష్యదుర్గం, మృద్దుర్గం, వనదుర్గ మితిక్రమాత్" అనినట్లు షడ్దుర్గములును ప్రతీకలు కావచ్చును. షడ్స్థానములు, షట్పదార్థములును సంకేతములు.

**2. అష్టపదకు :-** సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్ప, సమ్యగ్వాక్, సమ్యక్కర్మ, సమ్యగాజీవ, సమ్యగ్వ్యాయామ, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధులనునవి సంకేతములు. లేదా "ఆదానేచ విసర్గేచ తథాప్రైష నిషేధయోః పంచమేచార్థ వచనే వ్యవహారస్యచేక్షణే, దండశుద్ధ్యోస్సదారక్త స్తేనాష్టగతికోన్నృపః" అనినట్లు నాయకాష్టగతులు లేదా సర్వభూతదయా, క్షాంతి, అనసూయ, శౌచ, అనాయాస, మంగళ, అకార్పణ్య అనిస్పృహలనునవి. లేదా రాజరాష్ట్రాదులను అష్ట ప్రకృతులు లేదా సమదృష్టి, ఆలోకితదృష్టి, సాచీదృష్టి, ప్రలోకితదృష్టి, మీలిత దృష్టి, అనువృత్తదృష్టి, ఉల్లోకిత దృష్టు లనునవి (అభినయ దర్పణము) లేదా "కాంతా భయానకా చైవ హాస్యాచ కరుణా తథా, అద్భుతాచ తథా రౌద్రీ వీరా భీభత్సయా సహ, ఏతే రసాశ్రయాశ్చాష్టౌ దృష్టయః పరికీర్తితా" అన్నట్లు ఎని

మిది రసదృష్టులు, లేదా "స్నిగ్ధా హృష్టాచ దీనాచ కృద్ధా దృప్తా భయాన్వితా, జుగుప్సితా విస్మితాచ స్థాయీ భావాశ్రయా ఇమాః (సోమేశ్వరుడు)" అను స్థాయీ భావ దృష్టులు ఎనిమిది. లేదా స్తంభాది స్వాత్త్విక భావము లెనిమిది. లేదా "ఆదౌతు చలనం ప్రోక్తం పశ్చాచ్చంక్రమణం తథా, సరణం వేగినీ చైవ కుట్టనంచ తతఃపరం, పఠితం లోలితం చైవ తతో విషయ సంచరః, చారీ భేదా అమీ ప్రోక్తా అష్టౌ భరతవేదిభిః" (అభినయ దర్పణే) అన్నట్లు అష్టచారులు లేదా "భూపాలో భైరవశ్చైవ శ్రీరాగం ఫల పంజరః, వసంతో మాలవశ్చైవ బంగాలో నాటక స్తథా, అష్టౌరాగా ఇమే ధీరైః పురుషా ఇతి సమ్మతాః" అన్నట్లు అష్టపురుష రాగములు లేదా "రూప యౌవన లావణ్య మాధుర్యాణి చ సౌష్ఠవం ముఖ ప్రసాదః ప్రాగల్భ్యం విశాలాయత నేత్రతా, కృశావలగ్న శోభిత్వం తథైవ తను గాత్రతా, ఏతే పాత్రగుణాః ప్రోక్తాః దోషస్యాత్ తద్విపర్యయాత్" అను అష్ట పాత్ర గుణములు వేమభూపాలోక్తములు.

**3. దశపదకు :—** దశపదకు, యోగపరముగా దశనాడులు. ఇడా పింగళా సుషుమ్నా గాంధారీ హస్తిజిహ్వా సుపూషా ఆలంబుషా యశస్వినీ శంఖినీ కుహుః అనునవి. దశవాయువులు దశాగ్నులు దశనాదకళలు. "సౌష్ఠవం రూప సంపత్తి శ్చారు విస్తీర్ణకర్ణతా, విసారి నేత్రతా బింబాధర పాకాంతదంతతా, సుకంబు కంఠతా వేల్లల్లతా సరళ వామతా, తన్మధ్యేన తత్ స్థూలా నితంబకర భోరుతా, అత్యుచ్చపీనస్తనతా గౌరతా, శ్యామతా వేతి తజ్జ్ఞైః పాత్రగుణాస్మృతాః" అన్నట్లు, దశపాత్ర గుణములు. పది కామావస్థలు. పది నాటక ప్రకరణాది రూపకములు. మత్స్యాది దశావతార హస్తములు. "స్థానం చాయతా లీఢే ప్రేంఖిణ ప్రేరితానిచ, ప్రత్యాలీఢం స్వస్తికంచ మోటితం సమసూచికా పార్శ్వసూచీతి చ దశ మండలా నీరితానిచ" అను దశ మండలములు (అభినయ దర్పణము) హంసీ, మయూరీచ మృగీ గజలీలా తురంగిణీ, సింహీ భుజంగీ మండూకీ గతిర్వీరాచ మానవీ దశైతా గతయో జ్ఞేయా నాట్యశాస్త్ర విశారదైః" (అభినయదర్పణము) అను నాట్యగతులు పది. "జవత్వం స్థిరతా రేఖా భ్రమరో దృష్టి రశ్రమః, ప్రీతిర్మేధా వచోగీతిః పాత్ర ప్రాణాదశస్మృతాః" అనుమోక్ష దేవోక్తదశ పాత్ర ప్రాణములు.

4. ద్వాదశపదకు :- "ఉపాంగంతు స్కంద ఏవజ గుర్బుధాః ధృష్టి భ్రూపుటతారాశ్చకపోలో నాసికాహనూ అధరో దశనాజిహ్వాచుబుకం వదనం తథా, ఉపాంగాని ద్వాదశైవ శిరస్యంగాంతరేషుచ" (అభినయదర్పణము) అను ద్వాదశోపాంగములు. "నృత్తాని ద్వాదశప్రోక్తా డోంబికా భాణికాతథా, భాణకః ప్రస్థానకశ్చ లాసికా రాసికా తథా, దుర్మల్లికా విదగ్ధశ్చ శిల్పినీ హస్తినీ తథా, భిన్నకీ తుంబికీ చైవ ద్వాదశోక్తాని సూరిభిః'' అను పండ్రెండు నృత్తములు (సంగీతనారాయణం) "అథోచ్యతే వాచికస్య మార్గాద్వాదశతే పునః, ఆలాపశ్చ ప్రలాపశ్చ విలాపశ్చానులాపకః, సల్లాపశ్చాపలాపశ్చ సందేశోవ్యపదేశకః ఉపదేశశ్చాపదేశో నిర్దేశశ్చాతిదేశకః'' అను భరతోక్త దశవాచికమార్గములు.

5. షోడశపదకు :- "గౌరీపద్మాశచీమేధా సావిత్రీ విజయా జయా, దేవసేనా స్వధాస్వాహాశాంతిః పుష్టి ర్ధృతిః, తుష్టిర్మాతా ఆత్మదేవతా'' అను షోడశమాతృకలు. షోడశోపచారములు. "దత్తిలాదిభిరుక్తాని దేశీరూపాణిషోడశ, సట్టకం త్రోటకం గోష్ఠి బృందకంచ తతః పరం శిల్పకం ప్రేక్షణం చాప్యుల్లావకం చేత్సతః పరం. హల్లీసరాసకే ఉల్లోప్యకం శ్రీగదితం తథా, నాట్యరాసక దుర్మల్లీ ప్రస్థానం కావ్యలాసికా'' అను షోడశ దేశీరూపకములు. దేవ, బ్రహ్మ, ఈశ్వర, విష్ణు, సరస్వతీ, పార్వతీ, లక్ష్మి, వినాయక, షణ్ముఖ, మన్మథ, ఇంద్ర, అగ్ని, యమ, నిఋుతి, వరుణ, వాయు, కుబేర అభినయ హస్తములు పదునారు. పదునారు పురుషకళలు ముండకోపనిషదుక్తములు. 16 స్వరశక్తులు పూర్ణోదర్యాదులు, 16 కరాళ్యాది శక్తులు కూడ షోడశపదలో సమన్వయించుకొనవచ్చును.

6. అష్టాదశపదకు :- అష్టాదశ జాతుల హస్తములు.

7. వింశతిపదకు :- "మార్గం నాట్యం తతః ప్రాహుః తచ్చ వింశతిధోచ్యతే, నాటకం సప్రకరణం భాణః ప్రహసనం డిమః వ్యాయోగసమవాకారౌ వీథ్యంకేహామృగా ఇహ రూపకాని దశైతాని శంకరేణ బభాషిరే. నాటికా, ప్రకరణికా భాణికా హాసికాతతః వ్యాయోగినీచ డిమికా కలోత్సాహవతీపునః చిత్రా జుగుప్సితాచైవ విచిత్రాచేతి దుర్గయా ఏవంమార్గం నాట్యముక్తం శివాభ్యాం బ్రహ్మణాపురా'' అన్నట్లు కోహలోక్త వింశతి రూపములు. లేదా-

"శూన్యాచ మలినా శ్రాన్తా సృజ్జాగ్లాని సంయుతా, శంకితాచ విషణ్ణాచ ముకులా కుంచితాపిచ, అభితప్తాచ జిహ్వాచ లలితాన్యా వితర్కితా, తదార్థముకులా భ్రాన్తా విలుప్తాకేక రాపిచ, వికోశాత్రాస సంయుక్తా మదిరాచేతి దృష్టయః" అను భావదృష్టులు ఇరువదికాని ప్రతీకయగును.

## నాట్యపరముగా సమన్వయము

అష్టపదకు ఎనిమిది స్థాయి భావములుకాని, ఎనిమిది రసములు కాని, అష్ట భాషలు కాని లేదా ప్రరోచన,వీథీ,ప్రహసన,కథోద్ఘాత,ఉద్ఘాత్యక,ప్రయోగాతిశయ, ప్రవర్తక, అవలగితములగు ఎనిమిది భారత్యంగములు కావచ్చును. లేదా సభాపతి, సభ, పరిషత్సభ్యులు, గాయకులు, వాదకులు, నటి, నటుడు, కవి-అనువా రెనమండుగురు. చతుష్పదకు నాల్గభినయములు లేదా నాల్గు కైశిక్యాది వృత్తులు దశపదకు దశరూపకములు లేదా ఐదర్థావస్థలు, ఐదు అర్థ ప్రకృతులు లేదా ప్రరోచన మొదలు మహాచారి వరకు నుండు పది బహిర్యవనికాంగములు లేదా పది లాస్యాంగములు. ద్వాదశపదకు ప్రత్యాహారమునుండి నాంది వరకు గల పంద్రెండ్రు అంతర్యవనికాంగములు లేదా కోహలాదిమత ప్రకారము పంద్రెండు లాస్యాంగములు (చిత్రము, భావికము అను రెంటిని కలిపి కోహలాదులు పన్నెండు లాస్యాంగములనినారు.)

షోడశపదకు :- ఎనిమిది స్థాయీ భావములు, ఎనిమిది రసములు కలిసి పదునారు. లేదా షోడశనాయికలు, షోడశనాయకులు.

అష్టాదశపదకు :- పదునెనిమిది ఉపరూపకములు.

వింశతిపదకు :- పంచావస్థలు, పంచ ప్రకృతులు, పంచసంధులు, పంచార్థోపక్షేపకములు కలిసి ఇరువది యగును. లేదా పదునారంగములు, నాలుగు వృత్తులు కలిసి ఇరువది. లేదా శారదా తనయుని మతానుసారము ఇరువది నృత్యరూపములు.

ద్వావింశతిపదకు :- పూర్వరంగాంగము లిరువదిరెండు. లేదా స్వరాభివ్యక్తికి సంబంధించిన ఇరువదిరెండు నాడులు.

పంచత్రింశత్పదకు :- గండము, ముద్ర అను రెండలంకారములును కోహలాదులు చేర్చినందున ఆశీరాది నాట్యాలంకారములు ముప్పది యైదగును.

## సంగీతపరముగా సమన్వయము

చతుష్పదకు :- వాది, సంవాది, అనువాది, వివాది స్వరములు.

అష్టపదకు :- గీతమునకు సంబంధించిన అతలము, తరలము, ఉల్లోలము, అలగము, ఉగ్లానము,లిప్సితము,ఘట్టితము, విఘఘట్టితము అనునవి లేదా ఛందోష్టకము.

ద్వావింశతి పదకు ; ఇరువదిరెండు శ్రుతులు లేదా మానపంచకము ఆయామ చతుష్టయము, ఛందోష్టకము కలిసి ఇరువది రెండగును.

దశపదకు :- మానపంచక, రీతిపంచకములు.

పంచత్రింశత్పదకు :- ఐదు జాతులకు ఏడేసి తాళములుండుట వలన తాళములు ముప్పది యైదు ప్రతీకమగును. ఈ విధముగా పదవ్యవస్థ నాట్యములో సమన్వితమైన సంగీత సాహిత్య యోగాదుల స్ఫూర్తిదాయకముగా నొనరింపబడినవని భావింపవలసి యున్నది.

## కావ్యపరముగా (దృశ్య శ్రవ్యకావ్య)

చతుష్పదకు :- చతుర్విధ వృత్తులు చతుర్విధాభినయములు, ద్రుతిదీప్తి సంకోచ వికాసములను 4 హృదయ ధర్మములు చతుర్విధ నాయకులు ప్రతీకలు.

అష్టపదకు :- అష్టవిధ స్థాయి భావములు అష్టవిధ శృంగార నాయికలు అష్టవిధ సాత్త్విక భావములు శబ్దం అర్థం వృత్తి, గుణం అలంకారం వస్తువు నేతరసం అన్నవి ప్రతీకలు. రచనాకవి శబ్ద కవి అర్థ కవి అలంకార కవి ఉక్తి కవి రసకవి మార్గకవి శాస్త్రార్థ కవులు ప్రతీకలు. స్వాస్థ్యం ప్రతిభ అభ్యాసం భక్తి విద్వత్సాంగత్యం బహు శ్రుతత్వం దృఢ స్మృతి అనిర్వేదం అనే కావ్యాష్ట మాతలు సమన్వితమగును. శుశ్రూష శ్రవణం గ్రహణం ధారణ పరిజ్ఞానం ఊహ అపోహ తత్త్వాభినివేశ అనే బుద్ధి గుణా లెనిమిది సంభావితమగును.

దశపదకు—స్నాతక కవి హృదయకవి అన్యాపదేశి సేవిత ఘటమాన మహాకవి కవిరాజ ఆవేశిక అవిచ్ఛేది సంక్రామయితలను దశవిధ కవిదశావస్థలు ప్రతీకలు.

దండిమతానుసారం—శ్లేష ప్రసాద సమతా మాధుర్య సౌకుమార్య అర్థ వ్యక్తి ఔదార్య ఓజః కాంతి సమాధులను దశగుణములు ప్రతీకలు.

చతుర్వింశతిపదకు భోజమతానుసారం—

శ్లేష ప్రసాద సమతా మాధుర్య సౌకుమార్య అర్థవ్యక్తి కాంతి ఔదార్య ఉదాత్తతా ఓజ ఔర్జిత్య ప్రేయ సౌశబ్ద్య సమాధి సౌక్ష్మ్య గాంభీర్య విస్తర సంక్షేప సమ్మితత్వ భావికత్వ గతిరీతి ఉక్తి ప్రౌఢులను శబ్ద గుణములు 24 ప్రతీకలు. అతని మతానుసారము జాతి గతిరీతి వృత్తిచ్ఛాయా ముద్రా ఉక్తియుక్తి భణితి గుంఫన శయ్యా పఠితి యమక శ్లేష అనుప్రాస చిత్ర వాకోవాక్య ప్రహేళికా గూఢ ప్రశ్నోత్తర ఆధ్యేయ శ్రవ్యప్రేక్ష్య అభినీతులను 24 శబ్దాలంకార జాతులు ప్రతీకలు. ఇట్లే ఆయా నాందీ భేదములకు సాహిత్య దర్శనపరముగా సమన్వయించు కొనవచ్చును. క్లిష్ట కల్పనయని పరిహసింపక పరిహరింపక ఈ విషయమున పరిశోధన కావింపవలసి యున్నది. విజ్ఞులు ఇతోధికముగా భావించి ఆంజస్యా నాంజస్యములను నిరూపింతురని ఆశింతును.

# నాందీ భేదములు

కావ్యేందు ప్రకాశలో నాంది - నీలీ, శుద్ధా భేదమున రెండు విధములని- "నీలీ శుద్ధేతి భేదేన సా నాందీ ద్వివిధా భవేత్, ఉపాదానం వర్ణనం వా భవేత్, యత్రేందు సూర్యయోః సా నీలీ స్యాత్, తదన్యాతు శుద్ధేతి పరిగీయతే-" అందు సూర్యచంద్రుల నామము నిర్దేశించినను లేక తద్వర్ణనయున్నను 'నీలీనాందీ' యని; ఇది లేనిది 'శుద్ధనాంది'యని నుడివినాడు. కావ్యదర్పణకర్త 'పత్రావళి' యను మరియొక నాందీ భేదమును తెలిపినాడు. "యస్యాం బీజస్యవిన్యాసః అభిధేయస్యవస్తునః శ్లేషేణవా సమాసోక్త్యా నాందీ పత్రావళీతు సా."కావ్యబీజమును కాని లేక వర్ణనీయ వస్తువునుకాని శ్లేష ముఖముననో సమాసోక్తి రూపముననో వెల్లడించు నాందిని 'పత్రావళీ నాంది' యందురు. అనర్ఘ రాఘవ వ్యాఖ్యాత నాంది చతుర్విధయని ప్రాచీన శ్లోకముల నుద్ధరించినాడు.

"నమస్కృతిర్మాంగళికీ ఆశీం పత్రావళీ తథా
నాందీచతుర్ధానిర్దిష్టా నాడకాదిషు ధీమతా."

నమస్కృతినాంది, మాంగళికనాంది, ఆశీరూపనాంది, పత్రావళీనాంది- యని నాంది నాలుగు విధములు.

"నమః ప్రధానవాక్యేన కోమలేన పదేనచ
కల్పితా శంభునాయుక్తా నమస్కృతిరి తీరితా."

ఏ శ్లోకమున నమస్కార సుకుమార పదములు, శంభువాచక నామ ముండునో అది నమస్కృతినాంది.

"దేవస్యార్ధేందుచూడస్య విలాసే నోపవర్ణితా
మంగళానుగతంవాక్యం యత్రమాంగళికీతిసా"

శివ విలాసముల వర్ణన కలిగి మంగళార్థపదోజ్వలమగు నాంది మాంగళికీ నాంది.

"దేవ ద్విజ నృపాదీనాం ఆశీర్వాద విభూషితా
నాందీ మంగళ సంయుక్తా స్యాదాశీరితి తద్విదః"

దేవతాద్విజాదుల ఆశీస్సులతో కూడుకొని మంగళార్థ పదోజ్వల యగు నాంది ఆశీరూపనాంది.

"వాచ్యార్థ బీజరచితా శృంగారాది సమన్వితా
సంయుక్తా చంద్ర పద్మాభ్యాం పత్రావళ్యభిదీయతే"

కావ్యార్థమును సూచించు పదములు కలిగి చంద్ర, పద్మ నామాంకితమగు నాంది పత్రావళీ నాంది.

దీనివలన నాంది 1. నీలీ నాంది 2. శుద్ధా నాంది 3. అశీరూప నాంది 4. నమస్కారాత్మక నాంది 5. వస్తునిర్దేశరూప నాంది 6. పత్రావళీ నాంది 7. మాంగళిక నాంది - అను ఏడు విధముల నుండునని తేలినది. పద నియమమును బట్టి పరికింతుమేని భరతాదిమతానుసారము 1. అష్టపద 2. ద్వాదశ పద 3. అష్టాదశపద 4. ద్వావింశతి పద - ఇతర మతానుసారము 5. దశ పద 6. షోడశపద 7. వింశతి పద 8. చతుష్పద 9. పంచవింశతి పద 10. పంచ త్రింశత్పద 11. షట్పద 12. త్రిపద - అను భేదమున పండ్రెండు విధములగును.

ఇట పదనియనుము గూర్చి విచారింపవలసి యున్నది, దేనిని పదముగా స్వీకరింపవలయునన్న శంకకు నాట్యదర్పణకర్త "శ్లోకపాదః పదం కేచిత్ సుప్తిఙ్గంత మథాపరే, పరే వాంతర వాక్యైక స్వరూపం పద మూచిరే" కొందరు శ్లోకపాదమును పదమని, మరికొందరు సుప్తిఙంత పదమును పదముగను, ఇంకొందరు "పద్యతే జ్ఞాయతే అనేన పదార్థ సంసర్గః" అను వ్యుత్పత్తిని జూపి (ఆకాంక్షా యోగ్యతా సన్నిధులుగల పదకదంబ రూపమగు) వాక్యమును పదముగా స్వీకరించినారని తెలిపినాడు. అభినవ గుప్తుడు కూడ పద విషయమున ఈ మూడభిప్రాయములు కలవని అవాంతర వాక్యరూపమగు పదమే భరతముని సమ్మతమని తన అబినవ భారతిలో తెలిపినాడు. దీనివలన 1. శ్లోకపాదము పదము 2. సుప్తిఙంతము పదము 3. అవాంతర వాక్యము పదము అను త్రివిధోదాహరణములు లభించుచున్నవి. పైన పేర్కొనబడిన నాందీ భేదముల

కన్నింటికి ఉదాహరణములను క్రమముగా చూపుదును. భరతముని నాట్యశాస్త్రము ప్రథమాధ్యాయమున నాందిని నిరూపించి, ఈ క్రింది యుదాహరణ మొసగినాడు:

"నమోస్తు సర్వ దేవేభ్యో ద్విజాతిభ్యస్తతో నమః
జితంసోమేన వై రాజ్ఞా శివం గోబ్రాహ్మణాయచ
బ్రహ్మోత్తరం తథైవాస్తు హతాబ్రహ్మద్విష స్తథా
ప్రశాస్త్విమాం మహారాజః పృథివీంచ ససాగరామ్
రాష్ట్రం ప్రవర్ధతాం చైవ రంగస్యాశా సమృధ్యతు
ప్రేక్షాకర్తుర్మహా ధర్మోభవతు బ్రహ్మభాషితః
కావ్య కర్తు ర్యశశ్చాపి ధర్మశ్చాపి ప్రవర్ధతాం
ఇజ్యయాచానయా నిత్యం ప్రీయంతాం దేవతాఇతి"

"దేవతల కెల్లరకు నమస్కారము. ద్విజులకు శుభములు కలుగుగాక! రాజైన సోముడు జయించుగాక! గోబ్రాహ్మణులకు మంగళమగుత! బ్రాహ్మణుల కభ్యుదయము చేకూరుత! వారి శత్రువులు నశింతురు గాత! మహారాజు సాగరపర్యంతము పరిపాలించుగాత! రాష్ట్ర మభివృద్ధి చెందుగాత! రంగము (నట, ప్రేక్షకులు) యొక్క ఆశలు సఫలమగుత! కావ్యకర్తకు యశస్సు కలుగుగాత! లోకమున ధర్మము వర్ధిల్లుగాక! ఇట్టి పూర్వరంగ పూజచే దేవతలు సంతోషింతురుగాక!" యని దీని యర్థము. శ్లోక పాదమును పదముగా తీసికొన్నచో ఇది షోడశపద నాంది యగును. కాని అభినవుడు దీనిని అంగీకరింపలేదు. శ్లోకావయవ భూతములగు తిఙంత, సుబన్తములే (వాక్యములే) పదమని అత దభిప్రాయపడినాడు. సుప్తిఙ్గంత పదము పదముగా స్వీకరించినచో ఇది ద్వాదశ పద యగును. "ద్వాదశభిరష్టాభిర్వా" అను భరతుని నాందీ లక్షణము నీ యుదాహరణమున రెండు విధముల సమన్వయము వ్యాఖ్యాతలు చేసిరి. అభినవుడు ద్వాదశపదగా, తదితరులు అష్టపదగా గ్రహించిరని తాత్పర్యము.

భరతుని తర్వాత మనకు లభించెడి రూపకములు భాస రూపకములు. వీనిలో నాందీ లక్షణము స్పష్టముగా లేదు. భాసుడే వీనిని నాందిగా స్వీకరింపలేదు. అయినను వ్యాఖ్యాతలు అతని మంగళ శ్లోకములను నాందిగా పరిగణించుట వలన నేనిట యుదాహరించుచున్నాను. భాసరూపకములలోని నాందిని ఆరు విధములుగ విభజింపవచ్చును.

## A. పద నియమము లేనిది :

ఉదా :-

1. **దూత వాక్యము :**

"పాదః పాయా దుపేంద్రస్య సర్వ లోకోత్సవః సవః
వ్యావిద్ధో నముచి ర్యేన తను తామ్రనఖే నభే."

తన అరుణ నఖాగ్రముచే 'నముచి' దానవుని ఎగజిమ్మి సకల లోకముల కానందము గూర్చిన పరమాత్ముని పాదము మిమ్ము రక్షించు గాత! (ఆశీరూప నాంది.)

2. **మధ్యమ వ్యాయోగము :**

"పాయాత్ సవో సుర వధూ హృదయావసాదః
పాదోహరేః కువలయామల ఖడ్గనీలః
యః ప్రోద్యతస్త్రి భువన క్రమణే రరాజ
వైదూర్య సంక్రమ ఇవాంబర సాగరస్య."

కువలయ శ్యామలము, కరవాలాభీలము, అసుర రమణీ విషాదా పాదకము, త్రిలోకాక్రామకము, గగన జలధి నిబద్ధ వైదూర్య సేతువునైన త్రివిక్రమ స్వామి పాదము మిమ్ము రక్షించుగావుత! (ఆశీరూప నాంది.)

3. **ఊరు భంగము :**

"భీష్మ ద్రోణ తటాం జయద్రథ జలాం గాంధార రాజ హ్రదాం
కర్ణ ద్రౌణి కృపోర్మినక్రమకరాం దుర్యోధన స్రోతసమ్
తీర్ణ శ్శత్రు నదీం శరాసి సికతాం యేన ప్లవే నార్జునః
శత్రూణాం తరణేషు వస్స భగవాన్ అస్తుప్లవః కేశవః."

భీష్మ ద్రోణులు తటములు, జయద్రథుడు జలము, శకుని సుళ్ళ గుండము, కర్ణాశ్వత్థామ కృపాదు లూర్ములు నక్ర మకరములు, దుర్యోధనుడు ప్రవాహమును బాణ ఖడ్గాది ప్రహరణము లిసుము కాగా ఉప్పొంగి పరవళ్ళు ద్రొక్కెడి శత్రుసేనా నదిని ఏ కృష్ణ రూపమౌ పడవతో అర్జునుడు దాటినాడో ఆ కృష్ణుడు మీకు శత్రు విజయమును చేకూర్చుగాత! (ఆశీరూప నాంది.)

4. కర్ణభారము :

"నరమృగపతి వర్ష్మాలోకన భ్రాంతనారీ
నరదనుజ సుపర్వవ్రాత పాతాళలోకః
కరజ కులిశ పాళీ భిన్న దైత్యేంద్ర వక్షాః
సుర రిపుబలహన్తా శ్రీధరోస్తు శ్రియే వః."

నర సుర దివిజాది జనమునకు విభ్రాంతి కలిగించు నరసింహ రూపాటోపమున హిరణ్యా కశిపుని జీల్చి రాక్షసుల గండు నడగించిన శ్రీధరుడు మీకు శ్రేయస్సు గూర్చుత! (ఇదియు ఆశీరూప నాందియే)

5. దూత ఘటోత్కచము :

"నారాయణ స్త్రి భువనైక పరాయణో వః
పాయాదుపాయ శతయుక్త కరస్సురాణామ్
లోక త్రయావిరత నాటక తంత్రవస్తు
ప్రస్తావనా ప్రతి సమాపన సూత్రధారః."

త్రిభువనైక శరణుడు బహూపాయములచే దేవతా క్షేమము గూర్చువాడు. విశ్వనాటక వస్తు ప్రస్తావనా ప్రతి సమాపనము లందు సూత్రధారత్వము నిర్వహించువాడునైన నారాయణుడు మీకు శుభముల నొసగుగాత!

6. స్వప్న వాసవదత్త :

"ఉదయన వేందు సవర్ణా వాసవదత్తా బలౌ బలస్యత్వామ్
పద్మావతీర్ణ పూర్ణా వసంత కమ్రౌ భుజౌ పాతామ్."

అపుడే యుదయించు చంద్రుని బురడించుచు మద్యపానాతిశయమున మంధరత్వమును పొందియు కమలాభములై వసంత శోభా పరిపూర్ణములునైన బలరాముని బాహువులు మిమ్ము రక్షింతుగాత! ఉదయన, వాసవదత్త, పద్మావతీ, వసంతకులనెడు నాటకీయ పాత్రలు సూచింపబడినారు. ఇది అష్టాపద నాంది. ఇందు పద్మోపాదానము వలని నీలి. ఆశీరూప.

7. చారుదత్తమున నాందియే కూర్చబడలేదు.

## B. పద నియమము కలవి:

1 **అవిమారకము** : అష్టాదశపదనాంది.

"ఉక్షిప్తాం సాను కంపం సలిల నిధి జలాదేక దంష్ట్రాగ్ర రూఢా
మాక్రాంతా మాజి మద్యే నిహత దితిసుతామేక పాదావధూతామ్
సంభుక్తాం ప్రీతి పూర్వం స్వభుజవశగతామేకచక్రాభిగుప్తాం
శ్రీమన్నారాయణస్తే ప్రదిశతువసుధా ముచ్ఛ్రితైకాతపత్రామ్."

పరమానుగ్రహమున భూదేవిని జలధినుండి స్వదంష్ట్రాగ్రమున నుద్ధరించి, సకల రాక్షస సంహార మొనరించి, చక్రాభిరక్షణ కల్పించుచున్న శ్రీమన్నారాయణుడు భూమండలైకాధిపత్యము నీకు చేకూర్చు గావుత!

ఇందు ప్రధానావతారములతో భగవంతుడు భూ రక్షణ చేసిన విధానము సూచింపబడినది. మత్స్య రూపమున విశ్వోక్షేపము, వరాహరూపమున భూమిని స్వదంష్ట్రాగ్రమున ధరించుట, నృసింహావతారమున హిరణ్యకశిపూరః పాటనము, వామనావతారమున ఏకపాదావలంబనము, రామావతారమున సకల భూ పరిపాలనము అనునవి సూచింపబడినవి.

2. **ప్రతిమానాటకము** :- ద్వాదశపద నాంది.

"సీతాభవః పాతు సుమంత్రతుష్టః, సుగ్రీవరామః సహలక్ష్మణశ్చ
యోరావణార్య ప్రతిమశ్చ దేవ్యా, విభీషణాత్మా భరతోను సర్గమ్."

సీత కామోదము కలిగించువాడు, చక్రని మంత్ర శక్తిచే తుష్టి నొందువాడు, లక్ష్మణ సహితుడు, రావణ సంహర్త, విభీషణ వరప్రదాత, సుగ్రీవ మిత్రుడునగు రాముడు దుఃఖ భారమునుండి ప్రతిభావమున రక్షించుత!

ఇందు సీతా సుమంత్ర సుగ్రీవ లక్ష్మణ రావణ విభీషణ భరతులను నాటక పాత్రలు నిర్దేశింపబడినవి. ఇంతేగాక 'ప్రతిమశ్చ' అనుటచే నాటక నామము గుర్తు చేయబడినది.

3. **బాలచరితము** :- ద్వావింశతి పదనాంది.

"శంఖక్షీర వపుః పురాకృతయుగే నామ్నాతు నారాయణః
త్రేతాయాం త్రిపదార్పిత త్రిభువనో విష్ణుః సువర్ణప్రభః

దూర్వాశ్యామ నిభః సరావణ వధే రామో యుగే ద్వాపరే
నిత్యం యోఽంజన సన్నిభః కలియుగే వః పాతు దామోదరః."

కృతయుగమున శంఖక్షీర వర్ణుడు నారాయణ నామమున వ్యవహరింప బడినవాడు, త్రేతలో సువర్ణాభుడు త్రివిక్రమ రూపమున భువన భరణ చేసిన వాడు, దూర్వాశ్యాముడై ద్వాపరమున రావణ వధ గావించినవాడు, కలియుగ మున అంజన సన్నిభుడు. లోకత్రాతయునగు దామోదరుడు మిమ్ము రక్షించుత! ఇందు దామోదర పాత్ర సూచింపబడినది.

4. **ప్రతిజ్ఞాయౌగంధరాయణము** :- అష్టపద నాంది.

"పాతు వాసవదత్తాయో, మహాసేనోఽతి వీర్యవాౝ
వత్సరాజ స్తు నామ్నా, స శక్తి ర్యౌగంధరాయణః."

ఇంద్రుని కైశ్వర్య ప్రదాత, శక్తియను ఆయుధము దాల్చువాడును, బాలరాజు (జ్యేష్ఠరాజు గణపతి, ఇతని తమ్ముడు వత్సరాజు) యుగంధర క్షేత్ర ప్రతిష్ఠితుడునౌ కుమారస్వామి మిమ్ము నోముత!

ఇందు వాసవదత్త, మహాసేన, వత్సరాజ, యౌగంధరాయణు లను పాత్రలు సూచింపబడినవి.

పైన జెప్పబడిన నాలుగు నాటక నాందులలో 'తు-చ' యను నిపాతములు పదముగా పరిగణింపబడలేదు.

C. ఆశీరూప నాంది:- పైన పేర్కొనబడిన రెండు వర్గముల నాందులు ఆశీరూపములు.

D. పైన పేర్కొనబడిన రూపకములన్నియు (స్వప్న వాసవదత్త తప్ప) సూర్యచంద్ర నామాంకము లేనందున శుద్ధ నాందులు.

E. స్వప్న వాసవదత్తమున "ఉదయన వేందు" అనుచోట 'ఇందు' పద ముండుటవలన నీలీనాంది.

F. "అర్థతః శబ్దతో వాపి మనాక్కావ్యార్థ సూచనమ్"- కావ్యార్థము నాందిలో శ్లేషముఖేన కాని, ఆక్షేపరూపేణ కాని సూచింపవలయునను అను శాసనము కలదు. కావ్యార్థము వస్తు రూపమున వెల్లడి కావచ్చును. కావ్యేతివృత్త ప్రధాన పాత్ర రూపమునను నిర్దేశింపబడవచ్చును. భాసరూపక చక్రమున స్వప్న వాసవ దత్తము, ప్రతిజ్ఞా యౌగంధరాయణము, బాలచరితము, ఊరు భంగము, ప్రతిమా నాటకము - అను వానిలో ఆ రూపకములలోని పాత్రలు నాందిలో నిర్దేశింపబడినవి.

## మహా నాటకము

భరతుడు కేవలము నాందినే ఉపయోగించి నాట్యమును ఇంద్ర ధ్వజోత్సవ సందర్భమున ప్రదర్శించినట్లు, విఘ్నములు వచ్చుటచే పూర్వరంగము సాంగముగా కూర్చబడినట్లు గ్రహించితిమి. భాసుడు కొద్దిపాటి స్థాపనను సూత్రధారునితో నడిపినాడు. కాని మహానాటక కర్త పూర్వరంగము గాని, ప్రస్తావనను గాని, ఉపయోగింపక నాందిని మాత్రమే ప్రయోగించి సూత్రధార ప్రవేశము లేకయే మహానాటకమును నడిపినాడు. అందు నాంది మాత్రమే యుపయోగింపబడినది. నాంది నామమును కవి నిర్దేశింపలేదు. తద్వ్యాఖ్యాత 'మోహనదాసు' నాందిగ భావించి వివరించినాడు. అందు మొదటి శ్లోకమున ఇరువది రెండు పదములు పాటింపబడినవి. ఇట పదము సుప్తిఙంతరూపము.

"కల్యాణానాం నిధానం కలిమల మథనం పావనం పావనానామ్
పాథేయం యన్ముముక్షోః సపది పరపద ప్రాప్తయే ప్రస్థితస్య
విశ్రామ స్థానమేకం కవివర వచసాం జీవనం సజ్జనానాం
బీజం ధర్మ ద్రుమస్య ప్రభవతు భవతాం భూతయే రామనామ."

సకల శ్రేయస్సులకు నిలయము కలికలుష వినాశనము, పరమపావనము, పరమపదప్రాప్తికై ప్రాకులాడెడి ముముక్షువునకు దారిబత్తెము, మహాకవుల వాక్కులకు ప్రధాన నిగమస్థానము, సకల సత్పురుష కోటికి సంజీవని, ధర్మానోకహమునకు బీజభూతమునగు శ్రీరామనామము మీకు ఐశ్వర్యకరమగుగాక!

2. "పాతు శ్రీ స్తన పత్ర భఙ్గమకరీ ముద్రాంకితోరస్థ్సలో
దేవస్సర్వ జగత్పతిర్మధువధూవక్త్రాబ్జ చంద్రోదయః
క్రీడాక్రోడతనో ర్నవేందువిశదే దంష్ట్రాంకురేయస్య భూ
ర్భాతిస్మ ప్రళయాబ్ధిపల్వలతలో త్థాత్తైక ముస్తాకృతిః."

దివ్యరూపధారి, లక్ష్మీ స్తన పత్రరచనాముద్రాంకితోరః స్థలుడు, మధు రాక్షసుని కాంతావదనారవిందమును ముకుళింపజేయు చంద్రుడునగు శ్రీమన్నారాయణుడు మిమ్ము రక్షించుగాత! వరాహ రూపము దాల్చిన ఏ భగవానుని యొక్క చంద్రరేఖాసుందరమగు దంష్ట్రాంకురమున భూమి సాగరమను చిన్న కొలను నుండి పెరకబడిన తుంగముస్తెగా గోచరించినదో!

3. "యం శైవాః సముపాసతే శివ ఇతిబ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథజైన శాసనరతాః కర్మేతి మీమాంసకాః
సోయంవో విదధాతు వాంఛిత ఫలం త్రైలోక్యనాథోహరిః."

ఏ పరాత్పరుని మాహేశ్వరులు మహేశ్వరుడని, వేదాంతులు పరబ్రహ్మమని, బౌద్ధులు బుద్ధుడని, నైయాయికులు కర్తయని, జైనులు జినుడని, మీమాంసకులు కర్మయని భావింతురో యట్టి త్రిలోకైకేశ్వరుడు అగు శ్రీహరి మీ కోరికల నీడేర్చు గాక!

4. "తం రామం రావణారిం దశరథ తనయం లక్ష్మణాగ్ర్యం గుణాఢ్యం
పూజ్యం ప్రాజ్యం ప్రతాపావలయితజలధిం సర్వసౌభాగ్య సిద్ధిమ్
విద్యా నందైక కందం కలిమల పటల ధ్వంసినం సౌమ్యదేవం
సర్వాత్మానం నమామి త్రిభువన శరణం ప్రత్యహం నిష్కళంకమ్."

దశరథపుత్రుడు, లక్ష్మణాగ్రజుడు, గుణాఢ్యుడు, పూజ్యుడు, మహామహిమశాలి, సర్వసౌభాగ్య సంపన్నుడు, విద్యానందముల కేక కందకము. కలికలుషవినాశి, పరమప్రసన్నుడు, సర్వలోక శరణ్యుడు, నిష్కళంకుడు, సర్వాంతర్యామియునగు ఆ రామపరాత్పరుని నమస్కరింతును.

ఈ శ్లోకమున నమస్కారము, మిగిలిన మూడు శ్లోకములలో ఆశీస్సు ప్రయోగింపబడినది. ఈ నాందీ శ్లోకములలో మూడు పద నియమములు గలవు. మొదటి శ్లోకమున కేవలము సుప్తిఙన్తపదము పదముగా స్వీకరించినచో ఇరువది రెండు పదములుండుట వలన ద్వావింశతిపద. అవాంతరవాక్యమును పదముగా భావింతుమేని మొదటి శ్లోకమున రెండు వాక్యములు, రెండవ శ్లోకమున రెండు వాక్యములు, మూడవ శ్లోకమున ఏడు వాక్యములు, నాల్గవ శ్లోకమున ఒక వాక్యము మొత్తము నాలుగు శ్లోకములలో కలిపి పండ్రెండు వాక్యములగుట వలన ద్వాదశపద. శ్లోకపాదమునే పదముగా భావించెడి పక్షమున నాలుగు శ్లోక పాదములు పదునారగుటచే షోడశపద నాంది యని గ్రహింపవచ్చును. చంద్ర నామాంకితమగుట వలన నీలీనాంది. ఆశీస్సు, నమస్కృతి యుండుట వలన తదుభయనాంది. లోక భారాపనోదనమునకు భగవానుడు దశరథ పుత్రుడుగ నవతరించి రామనామమున వెలసి లక్ష్మణాగ్రజుడై సకల పీడాకరుడగు రావణుని సంహరించినాడను కథయు ఆక్షిప్తమగుచున్నది. కథాగతములగు దశరథ, రామ, లక్ష్మణ పాత్రలు నిర్దిష్టములైనందున మనాక్కావ్యార్థ సూచన అర్థతః శబ్దతః చేయబడినదని గ్రహింపవలయును.

# కాళిదాస రూపకములు

కాళిదాస రూపకములలో నాంది పలువిధములుగా నున్నది. మొదటిదగు మాళవికాగ్నిమిత్రమునందు ఆతడు పద నియమము పాటింపలేదు.

1. ఏకైశ్వర్య స్థితోపి ప్రణత బహుఫలే యస్స్వయంకృత్తివాసాః
కాంతాసమ్మిశ్రదేహోప్యవిషయ మనసాం యఃపరస్తాద్యతీనామ్
అష్టాభిర్యస్యకృత్స్నం జగదపి తనుభి ర్బిభ్రతో నాభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వ స్తామసీం వృత్తిమీశః.

ప్రణతులగు ఆశ్రితులకు బహువాంఛితముల నొనగూర్చెడి పరమైకాధిపత్యము గలిగియు, కేవలము గజచర్మమును తాల్చినవాడు, అర్ధనారీశ్వరుడైనను విజితేంద్రియులగు మహర్షులు కూడ అందుకొనరాని దూరమున నున్నవాడు, తన అష్టమూర్తులే జగత్తును నిర్వహించుచున్నను ఇంచుకేని గర్వాభిమానము లేనివాడునగు ఆ మహేశ్వరుడు సన్మార్గాలోకనమును ప్రతిబంధించెడి మీ తామస ప్రవృత్తిని (అజ్ఞానము) తొలగించుగాక!

ఇది ఆశీరూప నాంది. భరతేతర మతానుసారము ఈ శ్లోకమున నాల్గు వాక్యములుండుటవలన నేమి, నాల్గు పాదములుండుటవలన నేమి చతుష్పద నాందియగును. "అష్టాభిర్య స్సకృత్స్నం జగదపితనుభిః" అనుచోట అష్టమూర్తులలోని సూర్యాచంద్రమసులు ప్రతీతు లగుటవలన నీలీనాంది.

విక్రమోర్వశీయమను త్రోటకమున :

వేదాంతేషు యమాహురేక పురుషం వ్యాప్యస్థితం రోదసీ
యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయ శ్శబ్దో యదార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షు భిర్నియమిత ప్రాణాదిభిర్మృగ్యతే
స స్థాణుః స్థిర భక్తి యోగసులభో నిశ్శ్రేయసాయాస్తువః."

ఏ శివుని వేదాంతములు సర్వవ్యాపియగు ప్రధాన పురుషునిగా స్తుతించు చున్నవో, ఈశ్వర యను పదము అనితరాభిధాయియై ఎవనిపట్ల సార్థకమగు చున్నదో, అంతస్సంయమనముకల ముముక్షువులు నిరంతర సమాధిలో ఎవనిని వెదుకుదురో, స్థాణుపదవాచ్యుడు, అవ్యభిచరిత భక్తియోగ సాధ్యుడునగు ఆ పర మేశ్వరుడు మీకు సర్వశ్రేయస్సుల నొనగూర్చుగాత!

"పంచవింశత్పదా శ్రేష్ఠా సా నాందీ'' అను కొందరి మతానుసారము ఇందు ఇరువదియైదు పదములుండుట వలన పంచవింశపద నాందిగాగాని, లేదా శ్లోకమున నాల్గు వాక్యములుండుటచే గాని, పాద చతుష్టయమును బట్టిగాని చతుష్పదనాందిగా గాని భావింపవచ్చును. చంద్ర సూర్యోపాదానము లేనందున శుద్ధానాంది. మరియు ఈ శ్లోకమున ప్రథమ పాదమును బట్టి ఈ త్రోటకము నందలి నాయకుడు వేదాది ప్రసిద్ధుడు, పురుష శ్రేష్ఠుడని; అట్టులే కీర్తి ప్రతా పముల వలన సర్వవ్యాపకుడని వెల్లడియగుచున్నది. సర్వసమర్థుడగుటచే ఈశ్వరుడనునది; రెండవ పాదము వలన దేవతాదులు రాక్షస బాధనుండి విడి వడబూని ఇతనిని ప్రార్థింతురను విషయము; మూడవపాదము వలన ఊర్వశిపట్ల రాజునకు స్థిరమైన ప్రేమ కలదని, సంగమనీయమణి యోగమున తిరిగి నాయికా నాయకులకు సమాగమము కలుగునను అంశము 'స్థిరభక్తియోగసులభః' అను పదము వలన వెల్లడి చేయబడినవి. శ్లేషచేగాని, సమాసోక్తిచేగాని కావ్యవస్తువు సూచింపబడినచో పత్రావళి నాంది యగును కదా! ఇట సమాసోక్తి ముఖమున కావ్యార్థము సూచింపబడినందున పత్రావళి నాందియని సురేంద్రనాథశాస్త్రి తన వ్యాఖ్యానమున పేర్కొనినాడు

3. "యాసృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యా హవి ర్యాచ హోత్రీ
యేద్వేకాలం విధత్తః శ్రుతివిషయగుణా యా స్థితాఽవ్యాప్య విశ్వమ్
యామాహు స్సర్వభూత ప్రకృతి రితి యయా ప్రాణినః ప్రాణవన్తః
ప్రత్యక్షాభి స్తనుభి రవతు వ స్తాభి రష్టాభి రీశః."

ఆది సృష్టియగు నీరు, హుతవహమగు అగ్ని, యజమానుడు, చంద్ర సూర్యులు, ఆకాశము, సర్వబీజోత్పత్తి స్థానమగు పృథ్వి, సర్వప్రాణులకు జీవనశక్తి కలిగించు వాయువు అను ఎనిమిది ఎవనికి మూర్తులుగా విలసిల్లు

చున్నవో ప్రత్యక్షముగా అట్టి అష్టమూర్తులతో విలసిల్లు ఈశ్వరుడు మిమ్ము రక్షించుగాత!

ఇది ఆశీరూప నాంది. ఈ శ్లోకమున ఎనిమిది వాక్యము లుండుటచే 'అష్టపద నాంది.' పంచత్రింశత్పదా నాందీ అను కోహల మతానుసారము ముప్పదియైదు పదము లుండుటచే పంచత్రింశత్పదానాంది; పాదచతుష్టయ మునుబట్టియు చతుష్పదానాంది.

**కావ్యార్థ సూచన :** 'ఈశ' పదముండుట వలన దుష్యంత ప్రభువు, అష్టమూర్తు లనుట వలన అష్టదిక్పాలకాంశములచే శాసకుడు రూపొందింపబడి నాడని మన్వాది స్మృతులు పేర్కొనుట వలన సకల దిక్పాలకాంశ సంభూతుడే దుష్యంతుడని తెలియనైనది. 'యాసృష్టిః స్రష్టురాద్యా' అనుటచే విశ్వాతిశాయి సౌందర్యవతి ఈ శకుంతల యనునది, 'విధి హుతంహవిః' అనుటచేత గర్భ ధారణ, 'హోత్రి' అనుటవలన కణ్వమహర్షి 'యే ద్వేకాలం విధత్తః' అనుట వలన అనసూయ, ప్రియంవదలను సఖురాండ్రు శాపాంతసమయమును వెల్ల డింతురని. ఇట్టులే శార్గరవ, శారద్వత, గౌతమీ పాత్రలు సర్వబీజ ప్రకృతి యనుట వలన. 'యయా ప్రాణినః' అనుటవలన శకుంతలా, దుష్యంతుల సమాగమము, పుత్రలాభము - అను కావ్యాంశములు సూచింపబడినవి. కాన పత్రావళీనాంది.

శ్రీనివాసాచార్యులు మరియొక రీతి కావ్యార్థమును సూచించినాడు. "ఆద్యాసృష్టి" అనుటచే దుష్యంతుని భరతవంశాదిత్వము "విధిహుతం హవిః" అనుటచే పాలన నిమిత్తమై షడ్భాగ శుల్కమును గ్రహించుట, 'హోత్రి' యనుట వలన మహాదాతృత్వము, యాజకత్వము, 'కాలం విధత్తః' యనుట వలన "రాజా వా కాలకారణమ్" అను స్మృతిని బట్టి సస్యాది సంపన్నకాల నియామకత్వము, 'శ్రుతి విషయ గుణాః' అనుటవలన శాస్త్ర చోదిత కర్మాను ష్ఠానము, లేక సర్వ గేయ గుణశాలిత్వము 'విశ్వం వ్యాప్య' అనుటవలన కీర్తి ప్రతాప అప్రతిహతత్వము, 'ప్రాణినః ప్రాణవన్తః' అనుట వలన సకల ప్రజా మనోరథ పూరణ ముఖమున ప్రజా జీవన దాతృత్వము - అను దుష్యంత పరార్థము సూచింపబడినది. అట్టులే శకుంతలా పరముగా క్రమముగా,

లోకాతిశాయి సౌందర్యవతి, శకుంతల గాంధర్వ వివాహము, గర్భధారణ, యజ్ఞపత్నీత్వము, అనసూయా ప్రియంవదా బోధిత శాపావసానము - అను అంశములు వెల్లడి యగుచున్నవి. కావున పత్రావళీనాంది. 'యేద్వేకాలం విధత్తః' అని సూర్యచంద్ర మునులును నాందిలో నిర్దేశించుట వలన నీలీనాంది యనియు గ్రహింపవలయును.

## భవభూతి రూపకములు

1. **మాలతీ మాధవము :**

"చూడా పీడకపాల సంకులగల న్మందాకినీ వారయో
విద్యుత్ప్రాయ లలాట లోచన శిఖిజ్వాలా విమిశ్రత్విషః
పాంతు త్వామ కఠోర కేతక శిఖా సందిగ్ధ ముగ్ధేందవో
భూతేశస్య భుజంగవల్లి వలయ స్రన్నద్ధ జూటాజటః."

గంగాజల పరిపూతములు, ఫాలానలజ్వాల, వ్యామిశ్రకాంతులు, సర్ప మాలా నిబద్ధమూలములు, అగుచు తమ యందుండు చంద్రునిపట్ల చూచువారికి కేతకీ కుసుమ శిఖయను సందేహము కల్గించుటకు తావలమైన శివజటలు మిమ్ము రక్షించుత!

2. "సానందం నంది హస్తాహత మురజరవాహూత కౌమారబర్హి
త్రాసాన్నాసాగ్ర రంధ్రం విశతి ఫణిపతౌ భోగ సంకోచ భాజి
గండోడ్డీనా నాలి మాలా ముఖరిత కకుభస్తాండవే శూలపాణేః
వైనాయక్య శ్చిరం వోవదన విధుతయః పాంతు చీత్కారవత్యః."

శివుడు తాండవము చేయునపుడు నంది మృదంగము వాయించుచుండ మేఘగర్జిత భ్రాంతిని ఆ ధ్వనికి అరుదెంచిన కుమారుని వాహనమగు నెమలికి వెరచి యజ్ఞోపవీతమగు వాసుకి తన నాసారంధ్రములో చొరగా వినాయకుడు చెక్కిళ్ళపై వ్రాలిన తుమ్మెదలు ఝంకరించుచు దిగంతములకు పయనించునట్లు చీత్కార పురస్సరముగా నొనరించెడి అతని ముఖ కంపనలు మిమ్ము పాలించు గాక!

ఇది ఆశీరూప నాంది. మొదటి శ్లోకమున సుప్తిజంత పదము లెనిమిది కూర్చబడినవి. కాన అష్టపద. రెండు శ్లోకముల పాదములను లెక్కించినను, అష్టపదయే - "ముగ్ధేందవః" అని 'ఇందు' పద నిర్దేశము వలన నీలీనాంది. మొదటి శ్లోకమున జటాజూట వర్ణనను బట్టి జటాకృతి ప్రశాంతతకు ప్రతీక కావున ఇందలి కథానాయకుడు ధీరశాంతుడనునది 'జటాః' అని బహువచన నిర్దేశమువలన నాయికా నాయక బాహుళ్యము 'భూతేశస్య' అని షష్ఠిలో భూతేశ నిర్దేశము వలన కథానాయకునకు స్వప్రయోజన నిర్వాహము పట్ల అన్యపార తంత్ర్యము, నాయక సిద్ధి కామందక్యాది తపస్వినీ జనాధీనము - అను కావ్యార్థ మించుక సూచింపబడినది. ఇది గూఢముగా నున్నది.

## 2. మహావీర చరితము :

"అథ స్వస్థాయ దేవాయ నిత్యాయ హతపాప్మనే
త్యక్త క్రమ విభాగాయ చైతన్య జ్యోతిషే నమః."

ఇతరులకే కాక తనకు కూడ తానే ఆధారమైనవాడు, సనాతనుడు, జన్మ మృత్యుజరాది వివిధ పాపాతీతుడు, భజించు వారి పాపములను తొలగించువాడు, క్రమవిభాగములు లేనివాడు, సకల జ్ఞానములకును జ్ఞాన భూతుడు, స్వయం ప్రకాశుడునగు పరమాత్మకు నా నమస్కారము.

అష్టపదనాంది మరియు, చంద్రసూర్య నామ నిర్దేశము లేనందున శుద్ధా నాంది. 'నమః' పదము వలన నమస్కార రూపనాంది. **కావ్యార్థ సూచన** - 'దేవాయ' అనుటవలన 'రామదేవం నినాయ' ఇత్యాది రూపమున నిర్దేశింపబడెడి రాముడు వర్ణనీయ నాయకుడని, 'హతపాప్మనే' అనుటవలన ఖర, దూషణ, వాలి, రావణాది హననము - దీని వలన నాటకమున వీరము ప్రధాన రసమని మరియు 'దేవాయ' అనుటచే జానకీరామ వన విహారము — ఇత్యాది రూపమున మనాక్కావ్యార్థ సూచన గావింపబడినది.

## 3. ఉత్తర రామచరితము :

"ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే
వందేమహిచ తాం వాచమ్ అమృతామ్ ఆత్మనఃకలామ్."

"పూర్వకవుల కిదిగో నమస్కారము- అని కోరికలు తీర్చ కై మోడ్పు చేసెదను. అమృతయు, ఆత్మానంద సంధాత్రి, పరమాత్మ కళాభూతయగు వాగ్దేవతను నమస్కరింతును."

'చ'కారమును పరిగణించినచో శ్లోకమున పండ్రెండు పదము లగును. కాన ద్వాదశపద నాంది. నమస్కారము నిబద్ధమగుటచే నమస్కారరూపనాంది.

**కావ్యార్థ సూచన :** 'పూర్వేభ్యః' అను బహువచన నిర్దేశము వలన రామలక్ష్మణ శత్రుఘ్ను లను ముగ్గురు, 'ఆత్మనఃకళాం' అనుటవలన సీతా మరణము గంగా భూమాతలచే నివారితమని అర్థము సూచింపబడుచున్నది. 'కవిభ్యః' అనుటవలన వాల్మీకి, వ్యాసాదులకు నమస్కారమను అర్థము ఆక్షిప్త మగుచున్నది. ఆది అతిగూఢము.

## హర్షవర్ధనుని రూపకములు

1. ప్రియదర్శిక :

"ధూమవ్యాకుల దృష్టిరిందుకిరణైరాహ్లాదితాక్షీపునః
పశ్యంతీ వరముత్సుకా నతముఖీ భూయోహ్రియా బ్రహ్మణః
సేర్ష్యాపాదనఖేందు దర్పణ గతే గంగాం దధానే హరే
స్పర్శాదుత్పులకా కరగ్రహవిధౌ గౌరీ శివాయాస్తువః."

వివాహ సమయమున దృష్టి వ్యాకులపడుచుండ వేరొకవైపు చంద్రకిరణ ప్రసారమున కనులలో నానంద ముట్టిపడ, వరుడగు శివునిని పరమోత్కంఠతో చూడబూనియు హ్రీభారమున నతాంగియై పాద నఖేందు దర్పణమున ప్రతిఫలిం చిన హరోత్తమాంగముననుండు గంగను చూచి ఈర్ష్యావతియై హరుని స్పర వలన రోమాంచితాంగియునైన పార్వతి మీకు క్షేమము చేకూర్చుగాత!

"కైలాసాద్రౌ వుదస్తే పరిచలతి గణేషూల్లసత్కౌతుకేషు
క్రోడం మాతుః కుమారం విశతి విషముచిప్రేక్షమాణే సరోషమ్
పాదావష్టంభసీదద్వపుషి దశముఖే యాతి పాతాళమూలం
క్రుద్ధోప్యాశ్లిష్ట మూర్తి ర్భయ ఘన ముమయా పాతు తుష్టశ్శివోవః.

రావణాసురుడు తన ఇరువది చేతులచే కైలాస పర్వతమును కదలింప, ప్రమథ గణములు పరమ కౌతుకమున ఉల్లసిల్ల, కుమారుడు తల్లి ఒడిలో దాగ, వాసుకి బుసకొట్టుచు చూచుచుండ తన పాదాంగుష్ఠముచే పర్వతము నదుముట వలన క్రిందనున్న రావణుడు అధోలోకమును చేరునట్లు కోపమున నొనరించియు, పార్వతీ సమాశ్లేషవలన సంతుష్టి నొందెడి శివుడి మిమ్ము పాలించుత!

ఇది అష్టపద నాంది. చంద్ర నామాంకిత యగుటవలన నీలీ నాంది. ఆశీర్వాద ముండుటచే ఆశీరూప. ఇందు శ్లోక పాదము పదముగా స్వీకరింప బడినది.

## 2. రత్నావళి :

1. "పాదాగ్రస్థితయా ముహుస్స్తన భరేణానీతయా నమ్రతాం
శంభోస్స స్పృహలోచన త్రయపథం యాంత్యా తదారాధనే
హ్రీమత్యా శిరసీహిత స్సపులక స్వేదోద్గమోత్కంపయా
విశ్లిష్యన్ కుసుమాంజలి గ్గిరిజయా క్షిప్తోంతరే పాతువః."

పాదాగ్రమున నిలుచునది, స్తనభారమున ఇంచుక నమ్రతను పొందినది, పరమేశ్వరుని కనులలో కోరికలూరుచుండ డాసినది, ఒకవైపున లజ్జ, వేరొక వైపు స్వేదము, గగుర్పాటు వేపధువు కలుగుచుండ తొణికసలాడు పార్వతి పరమేశ్వరునిపై నిడెడి పుష్పాంజలి మిమ్ము రక్షించుగాత!

2. "ఔత్సుక్యేన కృతత్వరా సహ భువా వ్యావర్తమానాహ్రియా
తైస్తైర్బంధు వధూజనస్య వచనై ర్నీతాభిముఖ్యం పునః
దృష్ట్వాగ్రే వరమాత్త సాధ్వస రసా గౌరీ నవే సంగమే
సంరోహత్పులకా హరేణ హసతాఽఽశ్లిష్టా శివాయాస్తువః."

ఔత్సుక్యమున త్వరితగమనయు, సహజ లజ్జాభరమున వెనుకకు మరలునట్టిది, బంధు స్త్రీల అనునయ వాక్యములచే సమీపమునకు చేర్చబడినది, వరుడగు పరమేశ్వరుని ఎదుట చూచి సాధ్వసము పొందినట్టిది, తొలినాటి సంగమమున తన పరిస్థితిని చూచి హసించుచు రోమాంచము కలుగునట్లు హరునిచే కౌగిలించబడిన గౌరి మిమ్ము రక్షించుత!

3. "సంప్రాప్తం మకర ధ్వజేన మథనం త్వత్తోమదర్థే పురా
తద్వ్యక్తం బహు మార్గగాం మమపురో నిర్లజ్జవోఢు స్తవ
తామే వానునయ స్వభావ కుటిలాంహే కృష్ణ కంఠగ్రహం
ముంచేత్యాహరుషా యమద్రి తనయా లక్ష్మీశ్చపాయాత్సవః."

ఇందు లక్ష్మీ గిరిజా పతుల ఆశీర్వాదము వర్ణింపబడినది.

**పార్వతీ పరము :-** ఓ నీలకంఠ! పూర్వము నా నిమిత్తమే మన్మథుని హింసకు గురియైతివి. కాని బహు మార్గగామిని యగు ఆ గంగమ్మను తలపై నుంచికొనినావు. అయినను సిగ్గుపడుటలేదు. ఇక స్వభావతః కుటిలురాలగు ఆ గంగనే అనునయించుకొమ్ము. నన్ను ముట్టుకొనకు- అని ఎవని పట్ల పార్వతి రుసరుసలాడెనో ఆ శివుడు మిమ్ము రక్షించుత!

**లక్ష్మీపరము :-** ఓ కృష్ణా! అలనాడు నా నిమిత్తమె కదా! క్షీర పారావారము మథింపబడినపుడు కమఠ రూపము దాల్చి మంథర వ్యావర్తనకు హింస నొందితివి. భూనాయికను మరియొక వైపున చేపట్టితివి. ఎంత దుష్టుడవు! ఎంత సిగ్గుమాలినవాడవు! స్వభావతః కుటిలయగు (నిమ్నోన్నతత్వమున) ఆ భూనాయికనే ఉపలాలించుము. నా కంఠగ్రహము విడువుము అని ఎవనిపై లక్ష్మి రుసరుసలాడెనో ఆ విష్ణువు మిమ్ము రక్షించుత!

4. క్రోధేద్ధైః దృష్టిపాతైర్ముహురుప శమితావహ్నయోఽమిత్రయోపి
త్రాసార్తా ఋత్విజోధశ్చపల గణహృతోష్ణీషపట్టాః పతంతి
దక్షః స్తౌత్యస్యపత్నీ విలపతికరుణం విద్రుతం చాపిదేవైః
శంసన్నిత్యట్టహాసో మఖమథన విధౌపాతుదేవ్యై శివోవః."

దక్షాధ్వర ధ్వంసమున క్రోధ ప్రజ్వలితములగు చూపులచేతనే యాగాగ్నులు చల్లారిపోయినవి. ప్రమథ గణములు తమ ఉష్ణీషములను తొలగించి లాగుచుండ ఋత్విక్కులు భీతులై తలయొక వైపున పడిపోయిరి - విఱ్ఱవీగిన దక్షుడు 'కావు, కావు'మని స్తుతింపదొడగినాడు. ఆతని భార్య అతిదీనముగా పరిదేవించినది. యాగాహూతులగు దేవతలు తలొక దిక్కు పారిపోయిరి. అని పెద్దగా నవ్వుచు దక్షాధ్వర ధ్వంస విషయమును పార్వతికి వివరించెడి పరమేశ్వరుడు మిమ్ము రక్షించుగాక!

5. "జితముడుపతినా నమస్సురేభ్యో
ద్విజవృషభా నిరుపద్రవాభవంతు
భవతుచ పృథివీ సమృద్ధసస్యా
ప్రతపతు చంద్రవపుర్నరేంద్ర చంద్రః."

చంద్రునకు విజయము. దేవతలకు నమస్కారము. బ్రాహ్మణోత్తములు నిరుపద్రవులగుదురుగాక! భూమి సకల సస్యసంపన్నయౌత! చంద్రవంశీయుడగు ఈ నరేంద్రచంద్రుడును తేజోవిశిష్టుడై వెలుగుగాత!

ఈ ఐదు శ్లోకపాదములను బట్టి వింశతిపద నాంది కాని, లేక కేవలము మొదటి శ్లోకములోని సుప్తిఙన్త పదములను పరిగణించినను వింశతిపద నాంది గాని యగును. లేక మొదటి శ్లోకమున నొక వాక్యము, రెండవ శ్లోకమున నొకవాక్యము, మూడవ శ్లోకమున ఆరు వాక్యములు, నాల్గవ శ్లోకమున ఆరు వాక్యములు, ఐదవ శ్లోకమున ఐదు వాక్యములు, మూడవ శ్లోకములోని లక్ష్మీ నారాయణ పరమగు నొక అర్థము నొక వాక్యముగా భావించెడి పక్షమున ఇరువది వాక్యములగును. "అష్టభిర్ద్వాదశభిర్వాపి" అను భరతలక్షణములోని 'వా' అను దానిని వికల్పముగా చేసికొనిన పక్షమున నాందిలో ఎనిమిది పదములు కాని, పండ్రెండు పదములు కాని ఉండవచ్చునని లేక 'వా' అను దానిని సముచ్చయార్థకముగా గ్రహించుచో $12+8=20$ అగునని, కావుననే శ్రీహర్ష కృత రత్నావళిలో వింశతిపద నాందియని మురారియు, 'నిష్ప్రత్యూహ' మను శ్లోకమున ద్వాదశపదనాంది నుపయోగించి, పిదప సముచ్చయ పదార్థము ననుసరించియు 'విరమతి మహాకల్ప' అను శ్లోకమును కూర్చినాడనియు శ్రీనివాసాచార్యులు తన శాకుంతల వ్యాఖ్యానమున వివరించినాడు.

**కావ్యార్థ సూచనము** :- మొదటి శ్లోకమున సింహళద్వీపమునుండి అరుదెంచెడి రత్నావళి, వత్సరాజును చేరకయే సాగరమున పడినదని రాజు సాగరికను చూచినప్పటినుండియు ప్రేమగొనియుండుట, సాగరికావత్సరాజుల చేష్టలను పసిగట్టి వాసవదత్త రత్నావళిని కారాగారమున పడవేయుట అను కావ్యార్థము సూచితమైనది.

రెండవ శ్లోకమున పార్వతీ పరమేశ్వరుల నవసంగమ వృత్తాంతము వలన చాకచక్యము వలన అతిరహస్యముగా కలిసికొనిన సాగరికావత్సరాజుల పరస్పరాలింగన రూపకావ్యార్థము సూచితమైనది.

మూడవ శ్లోకమున సాగరికావత్సరాజుల ప్రేమను పసిగట్టి వాసవదత్త యట్లు ప్రవర్తింప నామెకోపము నుపశమింప వత్సరాజొనర్చిన అనునయము నిష్ఫలమైనదను అంశము సూచింపబడినది.

నాల్గవ శ్లోకమున ఐంద్రజాలికుడు కావించిన మాయచే నేర్పడిన అంతఃపుర దాహాదులు కోసలాధిపతి పరాజయాదులును సూచింపబడినవి.

ఐదవ శ్లోకమున చంద్ర వంశీయుడగు వత్సరాజు రత్నావళి యోగమున సార్వభౌముడగునను అంశము సూచితమైనది. చంద్రనామాంకిత మగుటవలన నీలినాంది. మరియు ఆశీరూప, పత్రావళీ నాందులు గలవు.

**నాగానందము :**

ధ్యానవ్యాజ ముపేత్య చిన్తయసి కామున్మీల్య చక్షుః క్షణం
పశ్యానంగ శరాతురం జనమిమం త్రాతాపినో రక్షసి
మిథ్యా కారుణికోఽసి నిర్ఘృణతరస్త్వత్తః కుతోన్యఃపుమాన్
సేర్ష్యం మారవధూ భిరిత్య భిహితో బుద్ధోజనః పాతువః."

ధ్యానమను నెపమున ఏ యువతిని గూర్చి కనులు మూసుకొని చూచుచున్నావు? క్షణకాలమైనను కామపీడితులగు ఈ జనమును చూడవేమి? రక్షకుడవయ్యు రక్షింపకుందువేల? ఎంత మృషాకారుణికుడవు! నీ కన్న దయమాలినవాడు మరియొక డుండునా? అని ఈర్ష్యతో కామాంగనలగు అప్సర స్త్రీలు చీవాట్లు పెట్టుచున్నను, సమాధి మగ్నతను గోల్పోని సర్వజ్ఞుడగు బుద్ధుడు మిమ్ము రక్షించుగాత!

కామేనా కృష్యచాపం హతపటు పటహావల్గిభిర్మార వీరైః
భ్రూ భఙ్గోత్కంప జృంభా స్మితచలి తదృశా దివ్యనారీజనేన
సిద్ధైః ప్రహ్వోత్తమాంగైః పులకిత వపుషావిస్మయాద్వాసవేన
ధ్యాయన్ బోధే రవాప్తా విచలిత ఇతి వఃపాతు దృష్టోమునీంద్రః."

కాముడు తన బాణముల నుపయోగింప చూచుచుండ అతని వీరులును, ఆటోపముగా వివిధ వాద్యముల ప్రయోగించుచుండ, అప్సరస్త్రీలు తమ భ్రూవిలాసాదులుట్టిపడ ఒకవైపు నర్తన మాడుచుండ, వేరొక వైపు సిద్ధులు వినతాననులై భావించుచుండ, ఇంద్రుడును ఆశ్చర్యమునకు గురియై రోమాంచితు డగుచుండ తన సమాధిని గోల్పోవక తత్త్వము ననుసంధానము చేయు ఆ మునీంద్రుడు, ఆ బుద్ధుడు మిమ్ము కాపాడుగాత!

ఇందు శ్లోక పాదములనుబట్టి అష్టపద నాంది. అది ఆశీరూప. ఈ రెండు శ్లోకముల వలన నాటక నాయకు డతి ప్రసన్నుడు, పరోపకారార్థము తన శరీరమును త్యాగము చేసియు ప్రశాంతత గోల్పోనివాడని, గరుత్మంతుని నఖ, చంచు పుటములచే విచ్ఛిన్నాంగుడయ్యు, ఎట్టి వికారమునకు గురికాక నుండునని ఇత్యాది రూపమున కావ్యార్థము సూచితమైనది.

## విశాఖదత్తుడు : ముద్రారాక్షసము

ధన్యా కేయం స్థితాతే శిరసి శశికలా కిన్ను నామైతదస్యాః
నామైవాస్యాస్తదే తత్ పరిచితమపితేవిస్మృతం కస్య హేతోః
నారీం పృచ్ఛామి నేందుం కథయతు విజయా న ప్రమాణం యదీందుః
దేవ్యా నిహ్నోతు మిచ్ఛోరితి సురసరితం శాఠ్యమవ్యాద్విభోర్వః."

ఈ పద్యమున పార్వతీ పరమేశ్వరుల ఉక్తి ప్రత్యుక్తులు నిరూపించబడినవి. శివా, నీ తలపైనున్న ఆ ధన్యురాలెవరు? శశికళ! ఇది ఆమె పేరా? అవును, ఆమె నామమె! పరిచయముండియు విస్మరించుటకు కారణమేమి? నేను ప్రశ్నించునది స్త్రీని గూర్చి, చంద్రుని గూర్చి కాదు. నా తలపై చంద్రరేఖయున్నదీ లేనిదీ నీ అనుంగు చెలికత్తెనే చెప్పుమనుము. (నా మాటపై అవిశ్వాసమున్న యెడల) అని తన జటా జూటమునందలి మందాకినిని వక్రప్రత్యుక్తిచే పార్వతికి కప్పిపుచ్చు పరమేశ్వరుని శఠనాయకత్వము మిమ్ము రక్షించుగాత!

పాదస్యావిర్భవన్తీ మవనతిమవనే రక్షతః స్వైరపాతైః
సంకోచేనైవ దోష్ణాం ముహురభినయతః సర్వలోకాతిగానామ్
దృష్టిం లక్ష్యేషునోగ్రాం జ్వలనకణముచం బధ్నతోదాహభీతేః
[illegible]"

తాండవ సమయమున పాదములు గట్టిగా మోపిన యెడల భూమి క్రుంగి పోవునని మెల్లగా పాదాభినయము చేయువాడు, స్వేచ్ఛగా బాహు ప్రసారము చేసిన యెడల ఆయా దిక్కులనుండెడి లోకములన్నియు నేలకూలునను భయమున సంకోచించుచునే బాహాభినయము చేయువాడు; నేత్రాభినయమైనను స్వేచ్ఛగా చేయుటకు వీలులేదు; ఎందులకన, తన ఫాలలోచనము తెరచినచో లోకములన్నియు బూదిపాలగును- అని తన యుగ్రదృష్టిని ప్రసరింపజేయక ఉపకరణానుగుణముగా నొనరించు నటరాజు దుఃఖ నృత్తము మిమ్ము రక్షించు గాత!

ఈ శ్లోకమున పరమేశ్వరుడు తన శరీరాగ్నిచే త్రిపురదాహ మొనరించి నట్లు చాణుక్యుడు తన క్రోధానలమున నంద వంశమును నాశనము చేసినాడని 'త్రిపురవిజయీ' అను పదము వలన- మలయకేతు నిర్బంధము, రాక్షసగ్రహణ శత్రుసంహారక్షమమగు నీతి ప్రయోగము- అను మూడంశములు సూచితమైనవి. మొదటి పద్యమున మౌర్యచంద్రగుప్తుని సామ్రాజ్యలక్ష్మి దరిజేరినదను అంశము సూచింపబడినది.

ఆశీరూప నాంది 'నారీం పృచ్ఛామినేందుం' అని 'ఇందు' పద నిర్దేశము వలన 'నీలీనాంది.' మొదటి శ్లోకమునందు మొదటి పాదమున మూడు వాక్యములు, రెండవ పాదమున రెండు వాక్యములు, మూడవ పాదమున రెండు వాక్యములు, నాల్గవ పాదమున ఒక వాక్యము కలసి 'ఎనిమిది' వాక్యములుండుట వలన అష్ట పద నాంది. లేక రెండు శ్లోకముల పాదాష్టకమును బట్టియు అష్టపద నాందియే యగును.

## వేణీసంహారము

"నిషిద్ధైరప్యేభిః లులిత మకరందో మధుకరైః
కరైరిందోరంతశ్ఛురిత ఇవసంభిన్నముకులః
విధత్తాం సిద్ధిం నో నయనసుభగామస్యసదసః
ప్రకీర్ణః పుష్పాణాం హరిచరణ యోరంజలిరయమ్."

పార్శ్వదోలినను రసలాలసములై తిరిగి మునిరికొనెడి తుమ్మెదలచే మకరందము వ్యాలోలింపబడునది. చంద్రకిరణములందు ప్రసరించినవా యనునట్లు మొగ్గదనము విడిచినట్టిదియునైన శ్రీహరి చరణములందు విడువబడు పుష్పాంజలి సభవారికి నేత్రోత్సవసిద్ధిని కలుగజేయుగాక!

"కాళింద్యాః పులినేషు కేళి కుపితా మత్సృజ్యరాసేరసం
గచ్ఛంతీమనుగచ్ఛతో౽శ్రు కలుషాం కంసద్విషోరాధికామ్
తత్పాద ప్రతిమానివేశిత పదస్యోద్భూతరోమోద్గతేః
అక్షుణ్ణో౽ను నయః ప్రసన్న దయితాదృష్టస్య పుష్ణాతువః."

యమునా నదీ సైకత స్థలమున రాసక్రీడాభిలాషలో పాల్గొనక వెళ్ళుచున్నట్టి అశ్రుకలుషయగు రాధికను ఆమె అడుగులలో అడుగులిడుచు అనుసరించువాడు, దాని మూలమున రోమాంచితగాత్రుడు తన ననుసరించి వచ్చుటచే రాధికానుగ్రహమునకు పాత్రుడునైన అ కృష్ణుని అవ్యాహతమగు అనునయము మిమ్ము రక్షించుగాత!

దృష్టస్స్ప్రేమ దేవ్యాకి మిదమితి భయాత్సంభ్రమాదా సురీభిః
శాంతాంత స్తత్వ సారైః సకరుణ మృషిభిర్విష్ణునా సస్మితేన
ఆదాయాస్త్రం సగర్వై రుపశమిత వధూ సంభ్రమైః దైత్యవీరై
స్సానందం దేవతాభిర్మయపుర దహనే ధూర్జటిః పాతుయుష్మాన్".

త్రిపురదాహ సమయమున పార్వతిచే ప్రేమగా, ఇదియేమి కానున్నదో నను భయమునను, ఉద్వేగమునను రాక్షస స్త్రీలచే, సమాహితులగు ఋషులచే జాలిగా విష్ణువుచే ఆశ్చర్యముగా తమ స్త్రీల సంభ్రమము నణచి శస్త్రాస్త్రములను చేపట్టిన రాక్షసులచే సాహంకారముగా దేవతలచే ఆనందముగా తిలకింపబడెడి ధూర్జటి యగు పరమేశ్వరుడు మిమ్ము రక్షించుత!

శ్లోక పాదములను బట్టి ద్వాదశపద నాంది లేక మొదటి శ్లోకమునందు ఇరువదియొక్క సుబన్త పదములు, ఒక తిఙన్త పదముండుట వలన ద్వావింశతి

కావ్యార్థ సూచన :- మొదటి శ్లోకమున నిషిద్ధ పదముచే దుర్యోధ నాదులు, బంధుమిత్రాదులెంత నిరోధించినను తమ దర్పముచే యుద్ధ సన్నద్ధులైరనునది "సంభిన్నముకుళ" పదముచే పాండవులు వనవాసాది క్లేశములను బడసి తమ భాగమును గ్రహింప ఉత్సుకులైరనునది సూచింపబడినది. 'కాళింద్యాః' అను శ్లోకమున ప్రథమార్థమునందు ధర్మరాజు శాంతి కాముకత్వము కృష్ణదూత్యవార్తను విని ద్రౌపది కోప విషాదములకు గురియగుననునది, ఉత్తరార్థమున భీమానునయమువలన ఆమె కలకదేరుట యనునది సూచితమైనది. మూడవ శ్లోకమున ద్రౌపది ప్రేమతో దుర్యోధనాది కాంతలు భయోద్వేగములతో నారదాదులు కరుణతో, కృష్ణుడు దరహాసముతో, ఘటోత్కచాదులు గర్వముతో, ఇంద్రాదులానందముతో తిలకించుచుండ భీమ క్రోధేంధన దీప్తమౌ ఉత్సాహాగ్నిగల ధర్మరాజుని కాని, లేక అట్లు చూడబడుచు వేణీసంహార మొనరింపనున్న భీముడని కాని కావ్యార్థము గ్రహింపవలయును. కావున 'పత్రావళినాంది.'

## శూద్రకుడు : మృచ్ఛకటికము

పర్యంక గ్రంథి బంధ ద్విగుణిత భుజగాశ్లేష సంవీత జానోః
అంతః ప్రాణావరోధ వ్యుపరత సకలజ్ఞాన రుద్ధేంద్రియస్య
ఆత్మాన్యాత్మాన మేవ వ్యపగత కరణం పశ్యతస్తత్త్వ దృష్ట్యా
శంభోర్వః పాతు శూన్యేక్షణ ఘటితలయ బ్రహ్మలగ్నః సమాధిః."

వీరాసనములో కూర్చొని మోకాళ్ళకు పామును రెండు పేటలుగా బిగించి ప్రాణాయామముతో ఇంద్రియ బాహ్య జ్ఞానమును నిరోధించి విషయ వ్యాపారములను పరిహరించి తత్త్వదృష్టితో తననుతానే చూచుచు ఏకాగ్రతతో పరబ్రహ్మమున లీనమైన పరమేశ్వరుని నిశ్చల ధ్యానము మిమ్ము రక్షించుగాత!

"పాతువో నీలకంఠస్య కంఠః శ్యామాంబుదోపమః
గౌరీ భుజ లతా యత్ర విద్యుల్లేఖేవ రాజతే."

మెడకు చుట్టిన పార్వతీ బాహులత మెరపుతీగ కాగా నీలమేఘము వలె ప్రకాశించు నీలకంఠుని కంఠము మిమ్ము రక్షించుగాత!

ఇది ఆశీరూప నాంది. చంద్ర సూర్యనామ నిర్దేశము లేనందున శుద్ధా నాంది. మొదటి శ్లోకమున పదమూడు పదములు, రెండవ శ్లోకమున తొమ్మిది పదములు మొత్తము ఇరువది రెండు పదములుండుటచే ద్వావింశతి పదమని కొందరందురు. ఈ విధమగు పదగణన ఆలంకారింక సమ్మతము కాదు. శ్లోక పాదాష్టకమువలన అష్టపద నాంది.

## శక్తిభద్రుడు : ఆశ్చర్య చూడామణి

వీచీస్థానే సహస్రం మరకత పరిఘస్పర్ధి బిభ్రద్భుజానాం
ఉత్ఫేనోహార జాలై రరుణ రుచి రనంతాహిరత్న ప్రభాభిః
బిభ్రాణశ్శంఖ మంతశ్చరమ చరమ నిర్వాపణీయం చ తేజః
పాయాద్వశ్శార్ఙ్గ ధన్వా శయిత ఇవ సముద్రైకదేశే సముద్రః."

గారుత్మత పరిఘ స్పర్ధియౌ తన బాహు సహస్రము కల్లోలమాలవోలె, తన ముక్తా హారాదులును నురుగువోలె, తన తల్ప ఫణి ఫణామణి సాగరాంతర్వర్తి మణి ప్రభవోలె, తన శంఖము శంఖ సహస్రము వోలె, తన ఉదర స్థిత చరాచర ప్రపంచము సాగరాంతర్వర్తి పర్వతరూప స్థావర, జలజంతు రూప జంగమ సంచయమువోలె, తన తేజస్సు బడబాగ్ని వోలె, కన్పట్ట క్షీరపారావారమున నొకచోనుండు నీల సాగరమువోలె శయనించియున్న శార్ఙ్గపాణియగు పరాత్పరుడు మిమ్ము రక్షించుత!

ఈ శ్లోకమున ఇరువది యొక్క సుబన్తములు ఒక తిఙన్తముండుటవలన (చకారమునకు పరిగణన లేదు) ద్వావింశతిపద నాంది. నాటక ప్రధాన నాయకుడు రామరూపమున వచ్చిన నారాయణుడు కాన ఆతడే ఈ పద్యమున వర్ణింపబడినాడు. 'శార్ఙ్గధన్వా' అనుటచే అనుక్షణము జగదపాయ నిరోధమునకై బహు ప్రయాసల ననుభవించినట్లు నటించుచు రావణాది సంహారము చేసి తిరిగి ఆ నారాయణ బృహదాత్మలో రామరూపము అంశాత్మను చేర్చువాడను కావ్యార్థము స్ఫురించుచున్నది. చంద్రసూర్య నామ నిర్దేశము లేనందున ఇవి శుద్ధానాంది.

## జయదేవుడు : ప్రసన్నరాఘవము

"చత్వారః ప్రథయంతు విద్రుమలతారక్తాంగుళి శ్రేణయః
శ్రేయశ్శోణ సరోజ కోరక రుచస్తే శార్ఙిణః పాణయః
ఖాలేష్వజ్జ భువో లిఖంతియుగప ద్యే పుణ్యావర్ణావలీః
కస్తూరీ మకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః."

ప్రవాళములవోలె నెఱ్ఱని అంగుళులు గలవి, రక్తాంబుజ కళికాకాంతులు గలవియునగు శార్ఙపాణి యొక్క నాలుగు చేతులు మీకు శ్రేయస్సును చేకూర్చు గాక! ఏ కరము లొకేసారి నలుమోముల వాని ఫాల భాగములపై శుభాక్షరములు లిఖించునవో, ఏవి లక్ష్మీదేవి వక్షోజద్వయముపైనను, కపోల యుగళి పైనను మకరికా పత్రరచన చేయుచున్నవో—

"ఆకల్పం మురజిన్ముఖేందు మధురోన్మీలన్మరున్మాధురీ
ధీరోదాత్తమనోహరః సుఖయతుత్వాం పాంచజన్యధ్వనిః
లీలాలంఘిత మేఘనాధ విభవోయః కుంభకర్ణవ్యధా
దాయీ దానవ దంతినాం దశముఖం దిక్చక్రమాక్రామతి."

భగవానుని ముఖారవిందమధు మరున్మాధుర్యోదారమౌ పాంచజన్య ధ్వని మీకు నిరంతరము సుఖమును చేకూర్చుత! ఏ పాంచజన్య ధ్వని మేఘ గర్జిత మును తిరస్కరించునది, దానవులకు చెందిన గజముల కుంభ కర్ణములకు వ్యధా పాదకమునై పది దిక్కులను క్రమ్ముకొనుచున్నదో (మేఘనాథుడను నామముగల ఇంద్రజిత్తునకు, కుంభకర్ణునకు వ్యధాపాదకము, దశాస్యుని భంగపరచునదియు నైన శ్రీరామచంద్రుని శంఖధ్వని మీకు సుఖము కలిగించుత! అను అర్థము శ్లేషముఖమున వచ్చుచున్నది.)

"నాభీపద్మ వసచ్చతుర్ముఖ ముఖోద్గీత స్తవా కర్ణన
ప్రోన్మీలత్కమనీయ లోచన కలా ఖేలన్ముఖేందుద్యుతిః
సక్రోధం మధుకైటభౌ స కరుణ స్నేహం సుతామంబుధేః
సోత్ప్రాస ప్రణయం సరోజ వసతిం పశ్యన్ హరిః పాతువః."

తన నాభి కమలమున నివసించు బ్రహ్మ స్వముఖములతో చేసెడి పరమో దార స్తుతి శ్రవణమున వికాసభాసురములౌ నయన కాంతులతో క్రీడించెడి ముఖేందు సుషమ కలవాడు మధుకైటభులపై కోపదృష్టిని సాగరకన్యకపై

స్నేహానుకంపా పూర్ణదృష్టిని నాభీ పద్మజునిపై సహాస ప్రణయ దృష్టిని నిగుడించు శ్రీహరి మిమ్ము రక్షించుత!

మొదటి శ్లోకమున రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల ప్రాదుర్భావాంశము, విశ్వామిత్రాద్యుపకారము, బ్రహ్మవేత్తయౌ జనకుని అధిని శివ ధనుర్భంగ సామర్థ్యమున అపనోదించుట, సీతావివాహము మున్నగు సంశములు సూచింపబడినవి. రెండవ శ్లోకమున ఇంద్రజిత్, కుంభకర్ణ రావణ బలములకు క్షోభ కల్గునట్లు రామలక్ష్మణకృత సమరకృత్యము శ్లేషముఖమున సూచింపబడినది. మూడవ శ్లోకమున మధుకైటభుల వంటి రావణకుంభకర్ణుల సంహారము, సీతాస్వీకారము, సకల దేవర్షి సంజ్ఞానానందము ననునవి సూచితములు.

మొదటి శ్లోకమున 'చ'కారము నిపాత కావున పరిగణింపరాదను వారి మతానుసారము పదునెనిమిది పదములున్నందున అష్టాదశపద నాంది. శ్లోక పాదములను బట్టి ద్వాదశపద నాంది. 'ఇందు' పద నిర్దేశము వలన నీలీనాంది. ఆశీస్సుండుటచే ఆశీరూపనాంది.

## మురారి : అనర్ఘ రాఘవము

"నిష్ప్రత్యూహముపాస్మహే భగవతః కౌమోదకీ లక్ష్మణః
కోకప్రీతి చకోర పారణ పటు జ్యోతిష్మతీలోచనే
యాభ్యామర్ధ విబోధ ముగ్ధమధుర శ్రీరర్థ నిద్రాయితో
నాభీ పల్వల పుండరీకముకులః కంబోస్సపత్నీకృతః."

విఘ్నోపశాంతికై కౌమోదకియను గదాయుధము చేతదాల్చిన భగవానుని చక్ర (వాక) చకోరప్రీతి సంధాన ధురీణము, సూర్యాచంద్రమ సరూపములువౌ లోచనముల నుపాసింతము. వేనిచే సగము విచ్చి సగము మొగ్గగానున్న నాభిహ్రద మందలి పుండరీక కోరకము శంఖమునకు దాయగా నొనరింపబడినదో "నిర్గతః ప్రత్యూహః రావణాదిర్యస్మాత్సః నిష్ప్రత్యూహః" అనువ్యుత్పత్త్యనుసారము రావణాది సంహర్తయౌ రామభద్రుడు రూపకనాయకుడని, అతడు లోక కంటకులను సంహరించునని కౌమోదకీ - కౌ = భూమియందు, మోదకీ = ఇంద్రజిదాది వధ వలన లోకానందము చేకూర్చబడునని కోకచకోర పదమువలన సుగ్రీవ, విభీషణ రాజ్యలాభానందము కలుగునని, అర్ధవిబోధ ముగ్ధ పదముల వలన రామ సేనకు విజయ వికాసములు, రావణ సేనకు విషాద వినాశములు

చేకూరునను అంశములు సూచింపబడినవి. మరియొక రీతి కావ్యార్థ సూచన:- 'భగ' మనగా కామము. ఇది కలవాడు భగవుడు. భగవుని భావము భగవతా. ఇది లేనివాడు అభగవతుడు. "ఉపాస్మహ్మోఽభగవతః" అని గ్రహింప వలయును. దీనివలన కామపరతంత్రుడు కానివాడు ధర్మైకాయత్తచిత్తుడు, తత్పరిపాలనైక తానుడు, ధీరోదాత్తుడు, ఈ కావ్య నాయకుడు. అతడు రామ చంద్రుడె యని సూచితము. 'మోదమే" మోదకము. అట్టి మోదము కలవాడు మోదకీ. కౌ=భూమి యందు; మోదకీ=భారాపనోదన పూర్వక జనతా మోద ప్రదుడను అర్థము సూచితము. 'లోచనా + ఈ' అని విభాగము. 'ఈ' అనగా లక్ష్మి. సీతా రూపమున నవతరించినదని "రలయోరభేదః" అను నియమాను సారము 'రోచనా.' రావణ సంహారమునకు నిమిత్తమై పురుషకారము ద్వారా సకల సుజన ప్రీతిని కల్గించునని ఆమె ఇందు నాయిక యనియు అర్థము సూచితము. 'యాభ్యామ్' అను ద్వివచనము వలన రామలక్ష్మణులు. "అర్థ విబోధ ముగ్ధ" పదము వలన బల వన్నిద్రా ప్రబోధిత కుంభకర్ణుడు. 'నాభీ పల్వల పుండరీ కముకుల' యనుటవలన పుండరీకపద మోషధి వాచకము. అట్టి యోషధి రూపామృత కలిక కలవాడు రావణుడను అర్థము సూచితము. రామకృత ద్విషన్నాశమాక్షిప్తమగునని మరి కొందరు కావ్యార్థమును సూచన చేయుదురు.

విరమతి మహా కల్పే నాభీపద్మైక నికేతనః
త్రిభువన పురశ్శిల్పీ యస్య ప్రతిక్షణమాత్మభూః
కిమధికరణం కీదృక్ కస్య వ్యవస్థితిరిత్స సౌ
ఉదర మవిశత్ ద్రష్టుం తస్మై జగన్నిధయేనమః."

ప్రళయము వచ్చి ముగియగా నాభికమలైకా వాసుడౌ బ్రహ్మ తిరిగి త్రిభువన నగర నిర్మాణము చేయబూని దాని నిర్మాణమునకు కావలసిన ఉపకర ణములను సమకూర్చదలచి ఎవని ఉదరమున ప్రవేశించెనో అట్టి జగదావాసుడౌ పరాత్పరునకు నా నమస్కారము.

కావ్యార్థ సూచన : లంకా ప్రవేశము, రావణ సేనాబల సమీక్ష, స్వబల నిర్మాణము, రావణాది సంహారము- అను కావ్యాంశములు సూచింపబడినవి. ఈ సూచన అర్థాదాక్షిప్తము. పూర్వ శ్లోకమున శబ్ద శక్తి బోధ్యమని గ్రహింప వలయును. "అర్థతః శబ్దతోవాపి మనాక్కావ్యార్థ సూచనమ్" అను నియమమును కవి పాటించి పైవిధముగా కావ్యార్థ సూచన చేసినాడని తలంపవలయును.

సుప్తిఙన్త పదము పదమనువారి పక్షానుసారము మొదటి శ్లోకమున పన్నెండు పదములుండుటవలన ద్వాదశపద నాంది. రెండవ శ్లోకమున ఇరువది పదములుండుట వలన వింశతిపద నాంది. లేదా మొదటి రెండు శ్లోకముల పాదాష్టకమునుబట్టి అష్టపదానాంది. మొదటి శ్లోకమున ఆశీస్సు. రెండవ శ్లోకమున నమస్సుండుట వలన ఉభయాత్మిక. 'సూర్యేందు' పదనిర్దేశమువలన నీలీనాంది. శ్లేష ముఖమున కావ్యార్థమును (1వ శ్లోకమున) సూచించుట వలన పత్రావళీ నాంది యని గ్రహింపవలయును.

## రాజశేఖరుడు : బాలరామాయణము

"ప్రసత్తేర్యః పాత్రం తిలకయతియం సూక్తిరచనా
య ఆద్యస్స్వాదూనాం శ్రుతి చులుకలేహ్యేన మధునా
యదాత్మానో విద్యాః, పరిణమతి యచ్చార్థవపుషా
సగుంఫోవాణీనాం కవివృషనిషేవ్యో విజయతే."

ఏ వాణీ గుంఫమును ప్రసాదగుణ పరిపూర్ణమౌ వచన పరిపాటి భూషింప జేయుచున్నదో, ఏ వాణీ గుంఫము శ్రవఃపుట పేయమౌ మధువు నిండి యుండుట వలన సుస్వాదు పదార్థములో ప్రథమగణనజెందునో, దేనిస్వరూపమున తత్త్వ జ్ఞాన సర్వస్వము భాసించుచున్నదో, ఏ గుంఫము పరమార్థ వైచిత్ర్యమయా కారమున వెలుగుచున్నదో, సకల కవిశిఖామణి నిషేవ్యమౌ అట్టి వాణీగుంఫము సర్వోత్కర్షమున వెలుగొందుత!

**కావ్యార్థము :** వేదాత్మకమౌ వాల్మీకీయ వాగ్గుంఫము పరమప్రసన్నమై పరమ వాత్సల్య పరిపూర్ణుడౌ రామపరాత్పరుని భూషించి భూషితమగుచున్నదని, అది సకలలోక శ్రవఃపేయమౌ వాగ్రూప ప్రథమ రసాయనమని దాని మూల మున వివిధ తత్త్వములు ప్రకాశితములైనవని, అదియె పరమాత్మకు శరీరమని, అది సర్వలోక సర్వకాల సర్వావస్థలయందు సర్వకవులకు నిషేవ్యమని, దాని కా సేవనీయత రామపరాత్పర గుణకీర్తనమున చేకూరినదనెడి రామగుణ వర్ణనా త్మక కావ్యప్రశంస వ్యక్తమగుచున్నది. తద్ద్వారా స్వకావ్యోత్కర్షము సంబద్ధ సంబంధ రూపమున సూచితమైనది.

'చ'కారము కూడ పదమను వారి మతానుసారము ఇరువదిరెండు పదము లున్నందున ద్వావింశతిపద నాంది. ఆశీరూప, చంద్రార్కపద నిర్దేశము లేనందున శుద్ధపదానాంధి.

# ప్రస్తావన

నాందీ పాఠము పిదప సూత్రధారుడు నటీ, విదూషక, పారిపార్శ్వికులలో ఎవరో యొకరితో కలసి రంగస్థలమునందు, కావ్యార్థ సూచకములు సభారంజకములు, ఉక్తిప్రత్యుక్తి రూప సల్లాపములు చేయుచు, ప్రదర్శింపబడనున్న నాటకము నందలి పాత్రను ప్రవేశపెట్టు కమనీయ సన్నివేశము ప్రస్తావన యనబడును. శాకుంతల వ్యాఖ్యాత రాఘవభట్టు రంగస్థలాలంకరణ మొదలుకొని నాటక పాత్ర ప్రవేశించు వరకు మధ్యతో అనుచరసహిత సూత్రధార సల్లాపమంతయు పూర్వరంగముగానే భావించినాడు. పూర్వరంగమందు నాందికి పూర్వము పదునొకండంగములు, నాందితో కలసి పండ్రెండు యవనికలో జరుగును. నాంది పిదప ప్రరోచన మొదలుకొని త్రిగతము వరకునుండు పది యంగములు సానుచరుడై సూత్రధారుడు రంగస్థలమున ప్రవేశించి నిర్వహించును. కావున ఇది యంతయు పూర్వరంగమే. అందుకొరకే సభాపతి, సభాసభ్యులు, గాయకులు, వాదకులు, నటీనటులన్యోన్యానురంజనమున ఆనందింతురు. ఇది యంతయు నాట్య పాత్ర ప్రవేశమునకు పూర్వము జరిగెడి కార్యకలాపము కావున పూర్వరంగమని భావప్రకాశికాకారుడు వెల్లడించినాడు. పూర్వమయినను తెరలో నిర్వహింపబడు కార్యము క్రియారూపము. వాగాత్మకమౌ ఛందస్సు, స్వరవత్తు అభిదానవత్తు అని రెండు విధములు. స్వరవత్తు ఆతోద్యాశ్రయము. ఆతోద్యము కుతప విన్యాసాది రూపమున పూర్వమనుష్ఠింపబడినది. అభిదానవత్తు భావాశ్రయము. ఇది నాందీ రూపమున అనుష్ఠితమైనది. అందు నాంది యొకటియే వాగ్రూపము. ఈ నాందిని మొదటి సూత్రధారుడు నిర్వహించును. అదే వేషమున స్థాపకుడను రెండవ సూత్రధారుడు ప్రదర్శింపనున్న రూపకము, తత్కర్త, దానిని నటించువాడు, దేశము, కాలము మున్నగు వానిని ప్రశంసించుచు కావ్యార్థ సూచనద్వార పాత్ర ప్రవేశించు ధాకా ప్రస్తావము నడుపును. కావున ఇది ప్రస్తావన యనబడుచున్నది.

నాందీ పాఠము మొదలుకొని పాత్ర ప్రవేశమువరకు మధ్యలో జరిగెడి ప్రస్తావమున నెన్నియో చిన్న చిన్న అంశములుండును. వాస్తవమున కిది యంతయు ప్రస్తావన కాదు. స్థూల దృష్టితో ప్రస్తావన యని వ్యవహరించు చున్నారు. అందుకొరకే "విధేర్యథైవ సంకల్పః ముఖతాం ప్రతి పద్యతే, ప్రధానస్య ప్రబంధస్య తథా ప్రస్తావనాస్మృతా, అర్థస్య ప్రతిపాద్యస్య తీర్థం ప్రస్తావనోచ్యతే, ప్రస్తావనాయాస్తుముఖే నాందీ కార్యా శుభావహా, నాంద్యంతేతు ప్రవిష్టేన సూత్రధారేణ ధీమతా, ప్రసాధనాయ రంగస్య వృత్తిః యోజ్యాహి భారతీ." సృష్టి కర్త సంకల్పము క్రియా ప్రారంభము దాల్చునట్లు ప్రధాన ప్రబంధమునకు ప్రస్తావన క్రియా రూపము వంటిది. ప్రదర్శింపబడు కావ్యార్థ మునకు సంబంధించిన అంశమును ప్రస్తుతించుటయే ప్రస్తావన. ఈ ప్రస్తావనకు పూర్వము అనగా మొట్టమొదట నాంది ననుష్ఠించి పిదప సభా సభ్య మనో వినోదమునకు అనువగునట్లు భారతీ వృత్తిని నాంద్యంతమున ప్రవేశించిన సూత్రధారుడు నిర్వహింపవలయునని రసార్ణవ సుధాకర కర్త పేర్కొనినాడు. పై శ్లోకానుసారము నాంది మొదలుకొని పాత్ర ప్రవేశమువరకు జరిగెడి వాక్క్రియా కలాపము ప్రస్తావన యని తెలిసనది. శారదా తనయుడు "నాంద్యంతే" అను మాటను రెండు విధముల నిర్వచించినాడు. నాద్యంత పదము పూర్వరంగాంగములలో మొదటిదగు ప్రత్యాహారము మొదలుకొని నాంది చివరివరకు అను అర్థము గ్రహించిన పక్షమున నాంది పిదప మిగిలిన దశాంగ ములు ప్రస్తావనా నామమున ప్రదర్శింపబడును. లేక నాంది ముగిసిన పిదప యను షష్ఠీ తత్పురుషను గ్రహించిన పక్షమున తర్వాతి కృత్యమును సూత్ర ధారుడు నాందీ పాఠక సూత్రధార సదృశుడు నిర్వహించునని గ్రహింప వలయును. నాందీ పాఠము పిదప స్థాపకుడనువా డొనరించు విధానమే ప్రస్తావన యని తాత్పర్యము.

"ఆ సూత్రయన్ గుణాన్నేతుః కవేరపిచ వస్తునః. రంగప్రసాదనప్రౌఢః సూత్రధార ఇహోచ్యతే." రూపక నాయకుని, తత్కర్తను, ఆ రూపకేతివృత్తమును సంగ్రహముగా గుణ ప్రశంస చేయుచు సభా సభ్య మనోరంజనను నాపాదించు టలో ఆరితేరినవాడు సూత్రధారుడనబడును- అను పై సూత్రధార నిర్వచన శ్లోకము నాందీ పాఠానంతరము పాత్ర ప్రవేశాత్పూర్వము, మధ్య జరిగెడి వాక్క్రియా వ్యాపారము ప్రస్తావనయని పరోక్షముగా సూచించుచున్నది.

భరతుడు నాందీ పాఠము పిదప మరియొక సూత్రధారుడు సానుచరుడై రంగ స్థలమున చతురశ్ర ప్రావేశికీ ధ్రువాగానానుసారము ప్రవేశించి, దేవ బ్రాహ్మణ ప్రశంసాపరమగు ఆంతరచారి ననుసరించుచు ఉక్తి విచ్ఛిత్తిమయములు, నానాభావ రసాభివ్యంజకములునగు శ్లోకముల ద్వార సభారంజన చేయుచు కవి కావ్య ప్రశంసను, కావ్యార్థసూచన పురస్సరముగా ప్రస్తావనను నడుపవలయును. ఈ కావ్యార్థోపక్షేపము ముఖరూపమున గాని, బీజ రూపమున కాని వెల్లడింప వచ్చును. నాయకుడు దివ్యుడైనచో దివ్య వేషమున, అదివ్యుడైనచో అదివ్య వేషమునను, దివ్యాదివ్యుడైనచో దివ్యవేషమునగాని, అదివ్యవేషమునకాని సూత్ర ధారుడు రంగస్థలమున ప్రవేశించి కావ్యార్థోపక్షేపము చేయవలయును.

"ప్రయుజ్య విధినైవంతు పూర్వరంగ ప్రయోగతః
స్థాపకః ప్రవిశేత్తత్ర సూత్రధార గుణాకృతిః
స్థాపకస్య ప్రవేశౌతు కర్తవ్యార్థానుగా ధ్రువా
త్ర్యశ్రావా చతురశ్రావా తజ్జ్ఞైః మధ్యలయాన్వితా
కుర్యాదనంతరం చారీందేవ బ్రాహ్మణశంసినీమ్,
సువాక్య మధురైః శ్లోకైః నానా భవరసాన్వితైః
ప్రసాద్యరంగం విధివత్ కవేర్నామచకీర్తయేత్
ప్రస్తావనాంతతః కుర్యాత్ కావ్య ప్రఖ్యాపనాశ్రయాం.
ఉద్ఘాత్యకాది కర్తవ్యం కావ్యోపక్షేపణాశ్రయమ్.
దివ్యే దివ్యాశ్రయో భూత్వా మానుషే మానుషాశ్రయః
దివ్యమానుష సంయోగే దివ్యోవా మానుషోషివా
ముఖ బీజాను సదృశం నానామార్గ సమాశ్రయం
నానా విధై రుపక్షేపైః కావ్యోపక్షేపణం భవేత్
ప్రస్తావ్యైవంతు నిష్క్రామేత్ కావ్యప్రస్తావక స్తతః
ఏవమేవ ప్రయోక్తవ్యః యధావిధి

(నాట్యశాస్త్రము-5 వ అధ్యాయము-161 నుండి 167 వరకు)

దశరూపకకర్తయు ఇట్టి నాందీ రూపమగు "పూర్వరంగం విధాయాదౌ సూత్రధారే వినిర్గతే, ప్రవిశ్యతద్వదపరః కావ్యమాస్థాపయేన్నటః, దివ్యమర్త్యే సతద్రూపో మిశ్రమన్యతర స్తయోః, సూచయేద్వస్తు బీజం వా ముఖం పాత్ర

మధాపివా." సూత్రధారుడు నిష్క్రమించిన పిదప ఆకార గుణంబులలో వానిని బోలిన ఇంకొక నటుడు ఆ నామముతోనే రంగభూమిని ప్రవేశించి కావ్యార్థ సూచన చేయవలయునని నుడివినాడు. దీనినిబట్టి సూత్రధారు లిరువురని, అందొకడు పూర్వరంగ ప్రవర్తకుడని, రెండవవాడు స్థాపకుడు లేక ప్రస్తావనా ప్రవర్తకుడని గ్రహింపవలయును. కథానాయకుడే రూపమునున్న ఆ రూపము ననే (ఇట రూప పదము దివ్య, అదివ్య, దివ్యాదివ్యపరము) ప్రవేశించి వస్తు రూపమున గాని, బీజరూపమున గాని, ముఖరూపమున గాని, పాత్రరూపమున గాని కావ్యార్థము సూచింపవలయును- అని ఆతడే పేర్కొనినాడు. సాహిత్య దర్పణ కర్తయు దశరూపక కారుని ఉక్తినే యనుకరించి అదే విషయమును తెల్పినాడు.

**భరతుడు :**

"యఇమం పూర్వరంగంతు విధినైవ ప్రయోజయేత్
నా శుభం ప్రాప్నుయాత్ కించిత్ స్వర్గలోకంచగచ్ఛతి
యశ్చాపి విధిముత్సృజ్య యథేష్టం సంప్రయోజయేత్
ప్రాప్నోత్యపచయం ఘోరం తిర్యగ్యోనించ గచ్ఛతి
నతథాగ్నిః ప్రదహతి ప్రభంజన సమీరితః
యథాహ్యప ప్రయోగస్తు ప్రయుక్తో దహతిక్షణాత్."

**భావప్రకాశికాకారుడు :**

"ఇతిద్వావింశదంగాత్మా పూర్వరంగ ప్రకీర్తితః
ఏవంయః పూర్వరంగంతు విధినాసంప్రయోజయేత్
నా శుభం ప్రాప్నుయాత్ అత్ర పశ్చాత్ స్వర్గంచ గచ్ఛతి."

ద్వావింశాంగములుగల పూర్వరంగమును విధిగా ననుష్ఠించువాడు తన ప్రయోగ జీవితమున ఎన్నడును అనర్థమును పొందలేడు. స్వర్గసుఖమును కూడ అనుభవించును. సభారంజన ద్వార కీర్తి, శాస్త్రవిహిత కర్మానుష్ఠానము ద్వార స్వర్గప్రాప్తి చేకూరునని పూర్వరంగ ఫలశ్రుతి తెలిపి : "ఇత్థం రంగం విధాయాదౌ సూత్రధారే వినిర్గతే, తద్వన్నటః ప్రవిశ్యాన్యః సూత్రధార సమాకృతిః సూచయేత్ వస్తు బీజంవా ముఖం పాత్రమథాపివా"- ఈ విధముగా రంగపూజ

ననుష్ఠించి మొదటి సూత్రధారుడు నిష్క్రమింప, అదే వేషమున మరియొక నటుడు రంగస్థలమున ప్రవేశించి వస్తువునో, బీజమునో, ముఖమునో, పాత్రనో రూపకమునకు సంబంధించిన దానిని సూచింపవలయునని తెలిపి, అతడే ఇదే విషయము నించుక విస్తృతముగా నన్నాడు - "తదీ దృఙ్నాటకారంభ ప్రకారోత్ర ప్రదర్శ్యతే ప్రయుజ్య రంగం నిష్క్రమేత్ సూత్రధారః సహానుగః, స్థాపకః ప్రవిశేత్తత్ర సూత్రధారగుణా కృతిః, దివ్యమర్త్యే సతద్రూపో మిశ్రమన్య తత్తయోః సూచయేద్వస్తు బీజంవా ముఖం పాత్ర మథాపివా" (వస్తు బీజముఖ పాత్ర రూపముల నుండు కావ్యార్థ సూచనకు తరువాత యుదాహరణ మొసగబడును. ధనిక, విశ్వనాథ, శారదా తనయులు వానికి నొసగిన ఉదాహరణ లొకటిగనే యున్నవి.)

ప్రస్తావనను నడుపు సూత్రధారుడు భారతీవృత్తి నాశ్రయించి కావ్యార్థ సూచనా విధానము ననుష్ఠింప వలయునని భరతాదులు పేర్కొనినారు. కావున వృత్తిని గూర్చి తెలిసికొందము.

## భారతీవృత్తి

"రంగం ప్రసాద్య మధురైః శ్లోకైః కావ్యార్థ సూచకైః
ఋతుం కంచి దుపాదాయ భారతీం వృత్తి మాశ్రయేత్"

"భారతీ సంస్కృత ప్రాయో వాగ్వ్యాపారో నటాశ్రయః, భేదైః ప్రరోచనా యుక్తైః వీథీ ప్రహసనా ముఖైః" - అని దశరూపక కర్త.

"రంగం ప్రసాద్య మధురైః శ్లోకైః కావ్యార్థ సూచకైః
ఋతుంచ కించిత్ప్రాయేణ భారతీవృత్తి మాశ్రితః
భారతీ సంస్కృత ప్రాయో వాగ్వ్యాపారో నరాశ్రయః
తస్యాః ప్రరోచనా వీథీ తథా ప్రహసనాముఖే
అంగన్యాత్ర—" అని సాహిత్య దర్పణకర్త.
"రంగం ప్రసాద్య మధురైః శ్లోకైః కావ్యార్థ సూచకైః
ఋతుం కంచిదుపాదాయ భారతీంవృత్తి మాశ్రయేత్
భారతీ సంస్కృత ప్రాయో వాగ్వాపారో నటాశ్రయః
సాంగైః ప్రరోచనాముక్తైః వీధీ ప్రహసనాముఖైః"—

అని భావ ప్రకాశిక కావ్యార్థ సూచకములగు మధుర శ్లోకములతో రంగ ప్రసాధన మొనరించి, ఏదేని ఒక ఋతువును గ్రహించి వర్ణనా రూపమున భారతీవృత్తినను సరింపవలయును. భారతీవృత్తి యనగా - సంస్కృత ప్రాయమగు వాగ్వ్యాపారము. ఇది నటాశ్రయము, ప్రరోచన, వీధీ, ప్రహసనము - అను నాల్గంగములు భారతీవృత్తికి కలవు. అంగమనగా అంశమను అర్థమే గ్రహింపవలయునని అభినవ గుప్తుడు తెలిపినాడు. ఇట్లు గ్రహించిన పక్షమున వీధీ ప్రహసనములు స్వతంత్ర రూపకములగుచున్నవనియు ఆతడే స్పష్టముగా తెలిపినాడు. భారతీ వృత్తి నాశ్రయించి చక్కని పద్యములచే సభవారిని రంజింపజేసి ఏదైన ఒక ఋతువు నుద్దేశించి గానము చేయవలయును. పూర్వ నాటకములందు ఋతు గానము లేనందున ఇది ఐచ్ఛికమని గ్రహింపవలయును. లలిత ప్రసన్నమై సభ్యులకు విన నింపు సొంపులు గూర్చు నటభాషితము భారతియని పై ముప్వురు లక్షణ కర్తల అభిప్రాయము.

వృత్తి యనగానేమి? అది ఎన్ని విధములను విషయమును తెలిసికొనుట కూడ అవసరము.

"యా వికాసేధ విక్షేపే సంకోచే విస్తరే తథా చేతసోవర్తయిత్రీసా వృత్తిః" చిత్తమునకు వికాసము, విక్షేపము, సంకోచము, విస్తరము అను ప్రధాన ధర్మములు కలవు. అట్టి ధర్మముల యందు సత్త్వోద్రిక్తముగా చేతస్సును ప్రవర్తింపజేయు వ్యాపారము లేక వ్యవహారము వృత్తి యనబడునని భోజుడు తెలిపినాడు. అర్థగతము గాను, శబ్ద గతముగాను ఆ వ్యాపారముండును. అర్థగత వ్యాపారము కైశిక్యాది రూపమున, శబ్దగత వ్యాపారము భారతీ రూపమున నుండునని విజ్ఞుల అభిప్రాయము. రసాభివ్యక్తికి కవి వాక్కు, అభినయ మనునవి తోడ్పడును.

విషయ వైచిత్ర్యమును బట్టి చిత్తమునకు వికాసాది అవస్థలుద్బుద్ధమగును. విషయము దీప్తముగా మసృణముగా మధ్యమముగాను నుండవచ్చును. అభినయ బలముననేమి, విభావాది వర్ణనాబలమున నేమి, తన్మయీ భావమున కర్త్వమగు చిత్తమొకప్పుడు వికసించును. చిత్తమునందు మిగిలిన గుణముల నణచి సత్త్వగుణ మావిర్భవించుటయే వికాసము. అపుడానందమయ స్థితి సత్త్వోద్రేకము వలన చేకూరును. శృంగార సన్నివేశములలో ఈ స్థితి చిత్తమున కబ్బును.

హాసము, శృంగార జన్యము కావున హాస్యమయ సన్నివేశమున చిత్తమునకు కలుగనిది వికాసమే. క్రమముగా సత్త్వగుణ మణగుచు రజోగుణము ప్రాదుర్భవించుచున్నపుడే చిత్తమున నొక విక్షిప్తత వచ్చును. రజోగుణోద్రేకకరములగు విభావాదుల మూలమున చిత్తమునందు విక్షేపావస్థ పొడమును. ఈ విక్షేప స్థితి రౌద్రకరుణములలో చిత్తమునకు సంభవించును. వికాస స్థితిని గోల్పోయినపుడు సత్త్వగుణము క్రమముగా మరుగుపడి రజోగుణ మావిర్భవించినపుడే చిత్తమునకు విక్షేప దశ వచ్చునని గమనింపవలయును. సత్త్వ తమో గుణములు విలీనమై కేవల రజోగుణము ప్రతిష్ఠితమైనపుడు చిత్తమునకు విస్తారదశ ఉద్బుద్ధమగును. తదుచిత వ్యాపార సమున్మేషమున విస్తారము చిత్తమునందు ప్రకాశితమగు నని తాత్పర్యము.

వీరాద్భుత సన్నివేశములందు చేతస్సున కీస్థితి కలుగును. అందుకొరకే రజోగుణము తిరస్కృతమై తమోగుణము ప్రబుద్ధమగునపుడు చేతస్సునం దేర్పడెడి అవస్థ సంకోచము. ఏతదుపస్కారక విభావాది సామగ్రీమూలమున సంకోచావస్థ చేతస్సునందు ప్రకాశితమగును. బీభత్స, భయానక, సన్నివేశములలో చేతస్సునకీ స్థితి చేకూరును. వికాసదశకు సంపూర్ణ సత్త్వోద్రేకము, విక్షేపదశకు సత్త్వోద్రేక భ్రంశాదికముతోపాటు రజోగుణావిర్భావ ప్రారంభము, విస్తారమునకు కేవల రజోగుణసముద్రేకము, సంకోచమునకు ఇతర గుణాభిభావి తమోగుణ సముద్రేకము మూలములని తేలినది. కావున రెండేసి రసములలో ఒక్కొక్క పూర్వోక్త దశ చేకూరుచున్నది. అందువలననే, "శృంగారాద్ధి భవేద్ధాస్యః రౌద్రాచ్చ కరుణో రసః, వీరాచ్చైవాద్భుతోత్పత్తిః బీభత్సాచ్చ భయానకః" అను రీతి జన్యజనకరసవ్యవస్థ చేయబడినది. పూర్వోక్తదశాసముద్బోధకములగు వృత్తులు కైశికి, ఆరభటి, సాత్త్వతి యనునవి అర్థవృత్తులని; భారతీవృత్తి యొక్కటియే శబ్దవృత్తి యని కొందరాలంకారికులందురు. కైశిక్యాదులు సాత్వికాభినయ రూపములయినచో భారతివాచికాభినయరూపము. భరత వంశమునందు జనించినవారు లేక భరత కళకు సంబంధించినవారు భరతులనబడుదురు. "భకారో భావవాచీ స్యాత్ రకారో రాగవాచకః, తకారో తాళవాచీ చ తతో 'భరత' ఈరితః" భావరాగతాళ స్వరూపము నాట్యము కావున తత్ప్ర

యోక్తలు భరతులగుదురు. ఆ భరతులచే ప్రయుక్తమగు వృత్తి కావున భారతీ వృత్తి యనబడుచున్నది.

"యా వాక్ప్రధానా నృపర ప్రయోజ్యా
స్త్రీవర్జితా సంస్కృతపాఠ్యయుక్తా
స్వనామధేయై ర్భరతైః ప్రయోజ్యా
సా భారతీ నామ భవేత్తు వృత్తిః"—అని భోజుడు.

"వాక్ప్రధానేత్యనేన శ్రుతి స్మృత్యుక్త విధివాక్యానామ వన్యవిధేయతాం ప్రతిపాదయతి, నృవరప్రయోజ్యేత్యనేన అధికారిణో నిర్దిశతి, స్త్రీవర్జితేత్యనేన అనధికారిణో నిరస్యతి,సంస్కృత పాఠ్యయుక్తేత్యనేన అంతర్వేద్యాం న మ్లేచ్ఛిత. వ్యమిత్యభిధత్తే ప్రస్తుత వస్తూపపాదనావసర సూచకం హి వాక్యం ప్రస్తావనా వక్తవ్యార్థే ప్రశంసాపరం హి వచః. ప్రరోచనాపీథ్యాం పరిప్రశ్నోత్తర ప్రత్యుత్త రాదిభి రనువాద విధానాత్ విపర్యయా జ్ఞానాదీన్ సంశయాదీనపనయతి. ఉద్ఘా త్యకాదీనామంగానాం హి ప్రవృత్తి పరిపాటీ వీథీ. ప్రహసనేన తు స్వధర్మాన్న చలితవ్యం నియమయతి స్వధర్మచలితానాం హితాపసాదీనాం ఉపహాని పరం వచః ప్రహసనం. సేయం భారతీవృత్తిః చతురంగా ధర్మశృంగార స్యాంగమ్"— అని భోజుడు.

"సర్వరూపక గామిన్యా ముఖ ప్రరోచనోత్థితా, ప్రాయస్సంస్కృత నిశ్శేష రసాఢ్యా వాచి భారతీ సర్వరూపకేషు అభినేయానభినేయేషు గమనశీలాదిప్రాయః తన్మయత్వా ద్వర్ణనాయ ఆముఖ ప్రరోచన యోరుద్భితః ప్రాయో బాహుల్యేన సంస్కృతేన సర్వరసైశ్చ దీప్తా వాచి వాగ్వ్యాపారాత్మకా భారతీ" - అని రామ చంద్రుడు.

"నామమాత్ర సముద్దిష్టాశ్చతస్రో వృత్తయో మయా, ఏకీభావస్తు సర్వాసాం భారత్యామేవ దృశ్యతే"—సాగరనంది.

"భారత్యాం వాచికాస్సర్వే వర్తంతేభినయా ఇహ, తిసృష్వన్యాసు వర్తంతే భినయా ఆంగికాః" కుంభుడు.

"భారత్యంతర్హితా యత్ర సా వృత్తిః భారతీ స్మృతా"—విప్రదాసః.

ఈ విషయమే నాట్యశాస్త్రమున "యా వాక్ప్రధానా పురుష ప్రయోజ్యా స్త్రీవర్జితా సంస్కృతపాఠ్యయుక్తా, స్వనామధేయైః భరతైః ప్రయోజ్యా సా భారతీ నామ భవేత్తు వృత్తిః" - వాక్ప్రధానము, పురుషప్రయోజ్యము, స్త్రీరహితము, సంస్కృతపాఠ్యసహితము, భరతనామమున వ్యవహరింపబడునది యగు వృత్తి భారతీవృత్తియని చెప్పబడినది. స్త్రీరహితము, సంస్కృతపాఠ్యసహితము భారతీ వృత్తి యనినందున ఒక చిక్కు వచ్చుచున్నది. భారతీవృత్తికి వీధీ, ప్రహసన, ప్రరోచన, ప్రస్తావన లంగములు కదా! ప్రస్తావనలో బహురూపకములందు నటీ సూత్రధార సల్లాపము కానవచ్చుటచే పై లక్షణ మసంభవమగుచున్నది. మరియు అభిజ్ఞానశాకుంతలమునందు వీథ్యంగమగు త్రిగతము నటీవాక్యముననే సూచింప బడినది. నటి సంస్కృతభాషిణి కాదు. అట్టులేని భారతీవృత్తి సంస్కృతపాఠ్య ప్రధానమని చెప్ప వీలుండదు.

కావున "భారతీ సంస్కృత ప్రాయః" అనినట్లు ప్రాయశః సంస్కృతము పాఠ్యముగా నుండవచ్చునని లక్షణము సవరించుకొనుట యుత్తమము. ఇంతేగాక, ఈ భారతి ప్రస్తావనకే పరిమితము కాదు. ప్రస్తావనాంతముగానే భారతి గ్రహింతుమేని భారతికి పేర్కొనబడిన వీథ్యంగములు ఏ రెండు మూడు నాటకములలోనో కొన్ని మాత్రమే కానవచ్చుచున్నవి. ప్రస్తావనేతర స్థలముననే అనగా, ఆయా అంకము లందే వీథ్యంగ ప్రహసనాంగములు సమన్వయింప బడినట్లు మనకు శాకుంతలాది నాటకములు ప్రమాణ మగుచున్నవి. కావున, భారతి నట వ్యాపారమని, అదియు వాచికాభినయ రూపమని, నటీనటులందు (తత్తత్ నాటక పాత్రలందు) సర్వసామాన్యముగా నుండు పాఠ్యమని గ్రహించుట యుచితము. బ్రహ్మ పాఠ్యప్రధానమైన ఋగ్వేదము నుండి భారతీవృత్తిని, గీత ప్రధానమైన సామవేదము నుండి కైశికీవృత్తిని, అభినయ ప్రధానమైన యజుర్వేదము నుండి సాత్త్వతీవృత్తిని, రస ప్రధానమైన అథర్వణవేదము నుండి ఆరభటీవృత్తిని గ్రహించి, నాట్య వేదమును రూపొందించినట్లు నాట్య శాస్త్ర ప్రథమాధ్యాయ శ్లోకము కూడ పై విషయమునకే బలమిచ్చుచున్నది.

"వాఙ్మనఃకాయ చేష్టలతో ఎపుడును ఏ చేష్టయు, వ్యస్తముగా అనగా, దేనితో పొత్తు లేక యుండదు. ఇవి పరస్పరము సమ్మిశ్రితము లగును. వీనిలో దేని అంశమునకు ప్రాధాన్యముండునో అదియే ఆ నామమున వ్యవహరింప

బడును. వాచికాభినయములో మిగిలిన అభినయము లసలే యుండవని కాదు. ప్రధానముగా ఉండవలసిన రీతిలో నుండవవి గ్రహించుట యుత్తమము. కాన, పాఠ్య ప్రధానమైనది భారతీవృత్తి యని తేలినది. అందుచే దీనిని శబ్దవృత్తి అని పేర్కొనుట జరిగినది నాట్యమును సృష్టించినపుడు వాక్కు క్రొత్తగా చేర్చ బడినది. ఈ క్రొత్త వృత్తిని ఏర్పరచిన వాడు భరతుడు కావున, భారతీవృత్తి యని శారదా తనయుడు తెలిపినాడు. భారతీవృత్తి ప్రయోజనము ప్రస్తావనకు మాత్రమే పరిమితము కాదని, భారతీవృత్తికే ప్రస్తావన యంగమగును కాని, ప్రస్తావనకు భారతీవృత్తి అంగము కాదని, రూపకములోని పాఠ్యము నంతయు భారతీవృత్తి యని పరమార్థము. అందువలననే "వృత్తి స్సర్వత్ర భారతీ" అను సూక్తి చరితార్థము. "ఇయం నాట్యం క్రియా హేతోః భారతీ నిర్మితా బుధైః, నాట్యా దౌ భారతీ వృత్తిం వృత్తి భేదేన యోజయేత్, ప్రయుక్తత్వేన భరతైః భారతీతి నిగద్యతే, ప్రస్తావనోప యోగిత్వాత్ సాంగం తత్రైవ యుజ్యతే, శోక విస్మయ సంత్రాస హాస నిందాస్త వైరపి, రత్యుత్సాహ జుగుప్సాద్యైః విశేషై రుపలక్షితా, వాఙ్మయీ సంస్కృత ప్రాయా భారతీవృత్తి రిష్యతే" అను భరత సూక్తియు పూర్వోక్త విషయమునకు ప్రమాణ మగుచున్నది. 'ప్రస్తావనోప యోగిత్వము' అను మాట భారతీవృత్తి వాచక ప్రధాన మగుటచే ఇతరత్ర యనగా, అంక ప్రదర్శనల యందు వాచికము కన్న సాత్వికాదీతర అభినయ వ్యాపారములకే ప్రాధాన్యమని ప్రస్తావనలో పాఠ్యమునకే (భారతీవృత్తికే) ప్రాధాన్య మనియు గ్రహింపవలయును.

# ప్రరోచన

నాందీ పాఠము పిదప సూత్రధారుడు రంగస్థలమున ప్రవేశించి పరిషత్తు వారి ఆదేశానుసారము, పలాన కవి వ్రాసిన నాటకమును ప్రదర్శింపవలసి యున్నదని తెలుపుచు ఆ దేశ కాలములు, ఆ కవి కావ్యములు, ఆ పరిషత్సభ్యులు, ఆ నాటకమును ప్రదర్శించెడి నటీనట వర్గము - ఇత్యాది అంశములను సామాజిజికులకు మెప్పు కలుగునట్లు కావ్యార్థ సూచన వచ్చునట్లు స్తుతించుటయే ప్రరోచన యనబడును. ఈ విషయమే ఈ క్రింది శ్లోకమున చెప్పబడినది:

"నివేదనం ప్రయోజ్యస్య నిర్దేశో దేశకాలయోః
కావ్యార్థసూచకైః శబ్దైః సభాయాశ్చిత్తరంజనమ్
కవికావ్యనటాదీనాం ప్రశంసా చ ప్రరోచనా
ప్రకర్షేణ రోచ్యతే ఉపాదేయతయా్రధియతే."

"ప్రకృతోర్థః అనయేతి ప్రరోచనా" — అని వ్యుత్పత్తి. నాట్యదర్పణ కర్త రామచంద్రుడు నాట్య ప్రదర్శనకు పూర్వము రంజన నిమిత్తమొనరించెడి గీత, తాళవాద్య నృత్తాది రూపక్రియాకలాపము ప్రయోగింపబడుటవలన పూర్వ రంగమని, ఈ పూర్వరంగమునకు ప్రత్యాహారాదులు తొమ్మిది అంతర్యవనికాంగములని, గీతకాదులు పది బహిర్యవని కాంగములని, ప్రరోచన అందులోనొక భాగమని, నాంది పిదప పూర్వ రంగములో అతి ప్రధానమైనది ప్రరోచనమేనని కావ్యవస్తు సూచన కనుగుణమగు దేశకాల కవి కావ్యముల ప్రశంసద్వార సామాజికులకు శ్రవణాలోకనోత్సవము ప్రకర్షముగా కలిగించి వారలకందు రుచి కల్పించుటయే ప్రరోచనయని నుడివినాడు. "పూర్వరంగే గుణస్తుత్యా సభ్యోన్ముఖ్యం ప్రరోచనా" — అని రామచంద్రుడు.

పూర్వం నాట్యాత్ప్రథమం గీత తాళ వాద్య నృత్తాని నాట్యాదికం చ పాఠ్యం వ్యస్తం సమస్తం చ ప్రయుజ్యతే. యత్ర రంగే రంజనా హేతౌ సః పూర్వ రంగః. అస్య పూర్వరంగస్య ప్రత్యాహారాదీని నవ అంతర్యవనికాంగాని గీత

కాదీని దశ బహిర్యవనికాంగాని; ప్రరోచనా తు నాట్యే ప్రవృత్తే ప్రధానం అంగమితి లక్ష్యతే. గుణస్తుత్యా ప్రస్తుత ప్రబంధార్థస్య ప్రీత్యాది హేతుత్వ ప్రశంసనేన సామాజికానాం శ్రవణావలోకనోత్సాహ నోత్పాదనేన ప్రకృతోర్థః ప్రకర్షేణ రోచ్యతే. ఉపాదేయతయా ధ్రియతే అనయేతి ప్రరోచనా. భరతుడు: "జయా భ్యుదయనీ చైవ మంగళ్యా విజయావహా, సర్వపాపప్రశమనీ పూర్వరంగే ప్రరోచనా" శుభాభ్యుదయ, విజయాదులను పూర్వరంగమునందు కూర్చబడిన ప్రరోచన నొనగూర్చునని చెప్పినాడు. సాగరుడు: "ప్రరోచనా చ విజ్ఞేయా సంహితార్థ ప్రదర్శినీ, ప్రరోచనాయాః కోర్థః ప్రసిద్ధార్థ ప్రదర్శినీ, ప్రరోచనా భిధీయతే, అన్యేతు ప్రస్తుతస్యైవ కావ్యస్య యన్నిష్పన్నేన వస్తునా కథనం సా ప్రరోచనా ముఖాది సంధీనా మవతారాయాదౌ ప్రరోచనా కార్యా" అని కార్యా ర్థమును సూచించునది ప్రరోచన యనినాడు. దశరూపక కర్త: "ఉన్ముఖీ కరణం తత్రప్రశం సాతః ప్రరోచనా" ప్రస్తుతార్థ ప్రశంసచే సామాజికులను న్ముఖుల గావించుట ప్రరోచనయని నుడివినాడు. భోజుడు: "వక్తవ్యార్థ ప్రశంసా పరం వచః ప్రరోచనా" అని పేర్కొనినాడు. విశ్వనాథుడు "ఉన్ముఖీ కార. ప్రశంసాతః ప్రరోచనా" కవి కావ్యాదుల ప్రశంసద్వార అభినేయము వైపు సామాజికుల చిత్తవృత్తిని ప్రేరేపుటయే ప్రరోచనయని నిర్వచించినాడు. "ప్రేక్షకాద్యున్ముఖీకారః ప్రస్తుతార్థ ప్రసంసయా ప్రరోచనా సా" ప్రస్తుతార్థ ప్రశంసా పురస్సరముగా సామాజికులను అభినేయమువైపు ఉన్ముఖుల చేయుటయే ప్రరోచన. ఈ విధముగా సభాసదులకు సంబంధాది సిద్ధికై గోత్రనామముల నిబంధింపవలయును. సభాసదులకు పూజావాక్యము కూర్పవలయును. నాయకుని నామము నిబంధింపవలెను. ఇదియంతయు గర్భ నిర్దిష్టముగా నుండవలయును. అనగా వాక్య మధ్యమున కించిద్గూఢమై నామ గోత్రాదికము భాసింపవలెను. "వాంఛాకలాపము కలావిధి" అను రెండంశములు నాటక ప్రయోగమున నుండును. వాంఛాకలాపము - అభీష్టార్థము వెల్లడించుట, కవి కావ్య వస్తువులను సూచించుట యని రెండు విధములు. తన గోత్రాదులను వెల్లడించుట వలన తన కీర్తి ప్రకాశమగును. అభిధేయగతముగా కావ్యనామ నిర్దేశమహిమాది వర్ణనము మరియు నాటకమునకు సంబంధించిన పేరు, నాటకమునందు గర్భితమైన అర్థమును సూచించునదిగ నుండవలయును. 'రామాభ్యుదయ నాటకము' అను పేరు గర్భితమగు రామాభ్యుదయమును సూచించుచున్నది.

ఇట్లుత్తమ రూపకము వ్రాసిన వానికి, దానిని ప్రయోగించిన వారికి, చూసి మెచ్చు కొనువారికి కీర్తి ప్రత్యక్ష ఫలము, దృష్టఫలమును అగును. స్వర్గ స్థితి అదృష్ట ఫలము. ఇవి కావ్యము వలన కలిగెడి ప్రయోజనములు.

"ఇత్థం రంగవిధానస్య సంబంధాది ప్రసిద్ధయే
గోత్రం నామ చ బధ్నీయాత్పూజావాక్యం సభాసదామ్
నాయకస్య చ యన్నామ గర్భనిర్దిష్ట లక్షణమ్
వాంఛా కలాపః ప్రథమం కలావిధి రనంతరః
వాంఛాశూన్యా న దశ్యంతే వ్యవహారాః కదాచన
వాంఛాకలాపస్తు కవేరభీష్టార్థప్రకాశనమ్
స్వాభిధేయగతత్వేన తద్ద్విధా పరిపఠ్యతే
స్వగతం తు స్వగోత్రాది స్వస్య కీర్తిప్రకాశనం
అభిధేయ గతం తత్తత్కావ్యనామ్నా ప్రకాశనమ్
తన్నామ నాట్యకాద్యంతర్గర్భితార్థోప సూచకమ్
యథా హి రామాభ్యుదయం నామ నాటకమిత్యతః
వాచ్య వాచక సంబంధో నాట్య విద్భిర్విభావ్యతే
కీర్తిః ఫలం తయా స్వర్గ స్థితిరత్ర ప్రయోజనమ్."

ఇందరికన్న ప్రరోచనకు చక్కని వివరణ నొసగినవాడు సింగ భూపాలుడు. "నివేదనం ప్రయోజ్యస్య నిర్దేశో దేశకాలయోః" అను శ్లోకము సింగభూపాలుని నుడిలో సమ్యగ్వివృతమైనది."ప్రరోచనా తు సా ప్రోక్తా ప్రకృతార్థ ప్రశంసయా,సదస్య చిత్తవృత్తీనాం సమ్ముఖీకరణం చ యత్"అభినేయార్థమును ప్రశంసించుట ద్వార సభ్యుల చిత్తవృత్తులను అభినయమువైపు ఆసక్తి పుట్టునట్లు ఏకాగ్రత పరచుటయే ప్రరోచన. ఈ ప్రరోచన చేతనాశ్రయ, అచేతనాశ్రయ భేదమున రెండు విధములు. అందు అచేతనము దేశకాలరూపము. కాలము వసంత గీష్మ శరదాది భేదమున ప్రభాత మధ్యాహ్నాది భేదమునను బహువిధములనుండును. ఇక చేతనులు కథానాయక, కవి, సభ్య నటులను భేదమున నుందురు. అందు కథానాయకులు ధర్మార్థరసమోక్షోప యోగులుగా నుందురు. అందు ధర్మోపయోగులు యుధిష్ఠిర నలాదులు; అర్థోపయోగులు రుద్ర, నృసింహ నృపాదులు; రసోపయోగులు విద్యాధర, వత్సేశ్వరాదులు;

మోక్షోపయోగులు రామ, వాసుదేవాదులు. కవులు కావ్యకర్తలు. వారు ఉదాత్త, ఉద్ధత, ప్రౌఢ, వినీత భేదమున నలువిధములుగ నుందురు. సభ్యులును ప్రార్థనీయ, ప్రార్థక భేదమున ఇరుతెరగులు. ఈ నాటకమును ప్రదర్శింతము, అనుజ్ఞ యొసగుడు!' అని సూత్రధారునిచే ప్రార్థింపబడు ప్రేక్షక వర్గమునకు ప్రార్థనీయులని పేరు. ప్రేక్షక పరిషత్తే 'ఈ రూపకము ప్రదర్శించుడని నటులను కోరిన యెడల ప్రేక్షకులు ప్రార్థకులగుదురు. ఇట్టి లక్షణము గలది 'ప్రరోచన' యని నుడివినాడు. "ప్రశంసా తు ద్విధాజ్ఞేయా చేతనాచేతనాశ్రయా, అచేతనౌ దేశకాలౌ కాలో మధు శరన్ముఖః, దేశస్తు దేవతారాజ తీర్థస్నానాది రుచ్యతే చేతనాస్తు కథానాథ కవి సభ్య నటా స్స్మృతాః; కథానాధాస్తు ధర్మార్థ రసమోక్షోపయోగినస్తత్ర యుధిష్ఠర నలాదయః,అర్థోపయోగినో రుద్రనరసింహ నృపాదయః, మోక్షోపయోగినో రామవాసుదేవాదయో మతాః, కవయస్తు ప్రబంధాద్యైః తే భవేయుశ్చతుర్విధాః, ఉదాత్త ఉద్ధతః ప్రౌఢో వినీత ఇతి భేదతః."

(భాస రూపక చక్రమున ప్రరోచన కానరాదు. మహా నాటకమున సూత్రధార ప్రవేశమే లేదు.)

# ప్రస్తావన – వివిధ లక్షణములు

భరతుడు :

"నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా
సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే
చిత్రైర్వాక్యైః స్వకార్యోత్థైః వీథ్యంగైరన్యథాపి వా
ఆముఖం తత్తు విజ్ఞేయం బుధైః ప్రస్తావనాపి వా,
ఆముఖాంగాన్యతో వక్ష్యే యథావదను పూర్వశః
ఉద్ఘాత్యకః కథోద్ఘాతః ప్రయోగాతిశయస్తథా
ప్రవృత్తకావలగితే పంచాంగాన్యాముఖస్య తు "

నటికాని, విదూషకుడు కాని, పారిపార్శ్వకుడుగాని సూత్రధారునితో కలసి ప్రస్తుత కార్యమునకు సంబంధించిన చిత్రవాక్యములతో వీథ్యంగముతో స్పష్టములైన ఉక్తి ప్రత్యుక్తులతో చేయు సల్లాప 'మాముఖ' మనబడును. దీనినే ప్రస్తావన యందురు. ఉద్ఘాత్యకము, కథోద్ఘాతము, ప్రయోగాతిశయము, ప్రవృత్తకము, అవలగితము అను అయిదు ఆముఖాంగములని భరతుడు నుడివినాడు. ఈ భరతోక్తిని అభినవు డిట్లు వివరించినాడు: "ఆముఖం లక్షయతి వా శబ్దేన వ్యస్తానాం నటీప్రభృతీనాం సూత్రధారేణ సంఘాతమాహ. అపి శబ్దేనాత్మనా సమస్తానాం. ద్వితీయో వా శబ్దః సమస్తవ్యస్తతాం వికల్పయతి. ఏవ శబ్దః సూత్రధారస్య అవశ్యంభావం దర్శయతి. చిత్రైరితి భావిరూపాకార్థానుకూల విషయానుసారిభిః స్వకార్యం నటవ్యాపారం. వీథ్యంగైరితి శ్లిష్ట వక్రోక్తి ప్రత్యుక్తి ప్రాయైరిత్యర్థః అన్యథేతి స్పష్టోక్తి ప్రత్యుక్తి భిరాముఖమితి. ముఖ సంధిర్నివర్తతే యతః ఆఙ్ మర్యాదాయాం. యదివా అత్రాముఖ ప్రారంభ మీషన్ముఖం వా ప్రస్తావ్యతే అనయేతి. బాహులకేన తచ్ఛీలసంజ్ఞయోః యత్ర కదాచిత్కావ్యాభిముఖం నీయతే పూర్వరంగ విధిః తదభిముఖం వా కావ్యారంభః తన్నీయతే. సా ద్విధేతి పూర్వ రంగాధ్యాయే దర్శితమస్మాభిః ఏవంచ యదా స్థాపకోపి సూత్రధారతుల్య గుణాకారో, రామాదివదేవ తదేదం కవికృత మాముఖం భవతి॥"

**సాగరుడు :**

"ఆముఖమేతత్ ఉత్పాద్యవస్తు సూచనా స్వరూపాలాపః స చ సంధేః ముఖస్య ఆదితః కార్యః నటీ విదూషకో వాపీత్యాది భరతః. అన్యస్తు అన్యాపదేశేన కథాను కథాభ్యామేకకః సానుగో వా - సూత్రధారః కుర్యాత్. ఆముఖమితి అంతర్నేపథ్యమాత్రోక్తి శ్రుతిస్మరణదర్శనైః స్వైరంగైశ్చాపి వీథ్యంగైః ప్రకుర్యాత్ ఆముఖం బుధః" - ఆముఖము నాటక విషయమును ప్రస్తావించు సంలాపమైనను ఇది నాటక కథవోలె ప్రఖ్యాతము కాదు. ఇది ముఖసంధికి ముందే నిబంధింపబడును. అన్యాపదేశమున కథాను కథారూపమున సూత్రధారుడొకడే గాని అనుచర సహితుడై కాని ఈ ఆముఖమును నిర్వహింపవలయును. కొన్ని యెడల ఆముఖమున అంతర్నేపథ్యమాత్రోక్త్యాదులను గ్రహించి సూత్రధారుడు ప్రత్యుత్తర మొసగును. ఆముఖమున వీథ్యంగములను కూర్చవచ్చునని పేర్కొని నాడు.

**దశరూపకకారుడు :**

"సూత్రధారో నటీం బ్రూతే మార్షం వాథ విదూషకమ్
స్వకార్యం ప్రస్తుతాక్షేపి చిత్రోక్త్యా యత్తదాముఖమ్
ప్రస్తావనా వా తత్ర స్యుః కథోద్ఘాతః ప్రవృత్తకమ్
ప్రయోగాతి శయశ్చాథ వీథ్యంగాని-"

సూత్రధారుడు మారిషునితోగాని, నటితోగాని ప్రస్తుత కథా సూచకముగా (నాటకములోని పాత్ర ప్రవేశించు దాక) తమ కార్యమును గూర్చి చిత్రమైన సంభాషణ మొనరించుటయే ఆముఖము. ఇది ప్రస్తావనా నామమున వ్యవహరింప బడును. (మారిషునకే మార్షుడు, పారిపార్శ్వికుడను నామాంతరములు కలవు.) కథోద్ఘాతము ప్రవృత్తకము, ప్రయోగాతిశయము - అను అంగములు మూడుండును.

**సాహిత్యదర్పణకారుడు :**

నటీ విదూషకోవాపి పారిపార్శ్వక ఏవవా
సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే
చిత్రైర్వాక్యైః స్వకార్యోత్థైః ప్రస్తుతాక్షేపిభిర్మిథః
ఆముఖం తత్తు విజ్ఞేయం నామ్నా ప్రస్తావనాపి వా
ఉద్ఘాత్యకః కథోద్ఘాతం ప్రయోగాతిశయ స్తథా
ప్రవర్తకావలగితే పంచ ప్రస్తావనాభిధాః"—

నటియేని, విదూషకుడేని, పారిపార్శ్వకుడేని సూత్రధారునితో కలసి స్వకార్య జనితములు, ప్రస్తుతాక్షేపులునైన చిత్ర వాక్యములతో చేయు సల్లాప మా ముఖమనబడును. దీనినే ప్రస్తావన అందురు. ఇట సూత్రధార పదమునకు స్థాపకుడని అర్థము. ఈ ప్రస్తావనకు ఉద్ఘాత్యకము, కథోద్ఘాతము, ప్రయోగాతిశయము, ప్రవర్తకము, అవలగితము - అను ఐదంగములుండునని భరతునిపతె తెల్పినాడు.

**నాట్యదర్పణకారుడు :**

"విదూషక నటీ మార్షైః వ్యస్తైః సమస్తైర్వా సహ సూత్రధారస్య రంగ సూత్రణా కర్తుః సూత్రధార గుణానుకారస్య వా నాట్యార్థస్య స్థాపనా కర్తుః స్థాపకస్య ప్రస్తుతస్య కావ్యార్థస్య ఆక్షేపి ఉప స్థాపకం భాషణం. వక్రోక్తైః సాక్షాత్ వివక్షితార్థస్య ప్రతిపాదకైశ్చ యత్ స్వస్య అభిప్రాయోత్కీర్తనం తదాముఖమ్. ఆఙ్మర్యాదాయాం తేన ముఖ సంధిం సంప్రాప్య నివర్తతే ఈషదర్థే వా తత ఈషన్ముఖమ్ ముఖసూచకత్వా దారంభః—

ప్రస్తావనా శబ్దేనాపి ఏతదుచ్యతే ఇదం తావదాముఖం నాట్యాత్ పృథగ్భూతమ్ తత్ర కదాచిత్ రంగ సూత్రయిత్రైవ ఆముఖార్థమ్ అనుతిష్ఠతి. తథాచ దృశ్యతే నాంద్యంతే ఇతి అవయవే సముదాయోపచారాత్ పూర్వరంగాంత ఇతి ద్రష్టవ్యమ్ నాందీ హి పూర్వరంగస్య అంగమ్. అత్రచ పక్షే ఆముఖార్థస్య సూత్రధార విషయత్వాత్ ముఖ సంధేః ప్రభృతి కవేర్వ్యాపారః కదాచిత్తు సనాందీకం రంగమ్ అనుష్ఠాయ విశ్రాంతే సూత్రధారే తత్తుల్యగుణాకృతిః స్థాపకః ఆముఖమను తిష్ఠతి అత్రచ పక్షే ఆముఖానుష్ఠానేపి కవేర్వ్యాపారః స్థాపకస్య సూత్రధారాను కారిణో రామానుకారిణో నటస్యేవ కవినైవ ప్రవేశాత్—" సూత్రధారుడు నటీ విదూషక పారిపార్శ్వకులలో కలసి కాని, ఒంటరిగా గాని నాట్యార్థమును వెల్లడించు సందర్భముల నటికించుచు రూపక పాత్ర ప్రవేశము దాక ఋజూక్తులతో గాని, వక్రోక్తులతో గాని యొనరించు సల్లాప మాముఖమనబడును. ఇట 'ఆఙ్' అను ఉపసర్గకు ఈషదర్థము కాని మర్యాదార్థము కాని గ్రహింపవచ్చును. ముఖసంధి వచ్చుదనుక ప్రస్తావన నడుపుట యని మర్యాదార్థము. ఒకప్పుడు సూత్రధారుడే పూర్వరంగమును, ఆముఖమును నిర్వహించును కావున నాంద్యంతే 'సూత్రధారః' అని ఆయా రూపకములతో మన కగుపడు

చున్నది. పూర్వ రంగాంతమున పూర్వరంగ నిర్వాహకుడగు సూత్రధారుడే ప్రవేశించి ఆముఖ ప్రయోజనమును కూడ తానే నెరవేర్చును. కావున ఆ విషయ మున కవికి సంబంధము లేదు. ముఖసంధి నుండియే కవికి వ్యాపారము. కొన్ని రూపకములలో నాందీ పాఠ సహితముగా పూర్వరంగము ననుష్ఠించి సూత్ర ధారుడు విశ్రమింప, అతని వేషమున స్థాపకుడను మరియొక సూత్రధారు డాముఖమును నిర్వహించుట కలదు. అపుడు రామ పాత్రను ధరించిన నటుని ప్రవేశపెట్టినట్లే సూత్రధారానుకారియగు స్థాపకుని కవియే ప్రవేశపెట్టును. కావున అట ప్రస్తావనా కార్యకలాపమంతయు కవికృత వ్యాపారమే యగును. స్థాపకుడందు ఉదాసీనుడని రెండు పక్షములకు చక్కని సమన్వయము సూక్ష్మ దృష్టితో నొనరించినాడు. దీనివలన ప్రస్తావన సూత్రధార కల్పితమా? కవి కృతమా? అను వికల్పములు పరిష్కృతమైనవి.

భావప్రకాశికాకారుడు :

"సూత్రధారో నటీయుక్తో వస్తుప్రస్తావనావధి
కురుతే యత్ర సద్వృత్తైః తదాముఖముదాహృతమ్
సూత్రధారో నటిం బ్రూతే మారిషం వా విదూషకమ్
స్వకార్యప్రస్తుతాక్షేపి చిత్రోక్త్యా యత్తదాముఖమ్
నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా
సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే
చిత్రైర్వాక్యైః స్వకార్యోత్థైః వీథ్యంగైః అన్యధాపి వా
ప్రవృత్తక కథోద్ఘాత ప్రయోగాతిశయైస్తథా
వీథ్యంగైః షోడశైస్తేషాం యోగః ప్రస్తావనోచ్యతే."

రెండుమూడు విధముల నిర్వచన మాముఖన కొసగినాడు. సూత్రధారుడు నటీసమేతుడై ప్రస్తావనాధికముగా కథాంశమును మంచి వృత్తముతో సూచించునేని అది ఆముఖమనబడును. నటి, విదూషకుడు, మారిషుడు అను తన పరివారములోని ఒకరితో ప్రవేశించి ముచ్చటించుచు చిత్రోక్తుల ద్వార స్వకార్యమును ప్రస్తుతార్థ మును స్ఫురింపజేయునేని అది ఆముఖమనబడును నటి, విదూషకుడు, పారి పార్శ్వకుడు అనువారిలో నొకడు సూత్రధారునితో సల్లాపించుచు స్వకార్యోప యోగులైన వీథ్యంగములతో సమన్వితమగునట్లు సల్లాపమొనరించుటయు ఆముఖ

మనదగును. పదమూడు వీథ్యంగములు, మూడు ఆముఖాంగములు కలసిన యెడల అట్టి ఆముఖమును ప్రస్తావన అందురు. షోడశాంగోపేతమగు ఆముఖమును ప్రస్తావనయగునని ప్రస్తావనకు క్రొత్త నిర్వచనమొసగినాడు. ఈ ఆముఖమునకు ప్రవృత్తకము, కథోద్ఘాతము, ప్రయోగాతిశయమను మూడంగములు కలవని దశరూపకకారుని మతమునే పోషించినాడు.

**రసార్ణవసుధాకరకర్త :**

"సూత్రధారో నటీం బ్రూతే స్వకార్యం ప్రతియుక్తితః
ప్రస్తుతాక్షేప చిత్రోక్త్యా యత్తదాముఖమీరితమ్
త్రీణ్యాముఖాంగాన్యుచ్యంతే కథోద్ఘాతః ప్రవర్తకమ్
ప్రయోగాతిశయశ్చేతి తేషాం లక్షణముచ్యతే."

కావ్యార్థ సూచకము, చిత్రోక్తిమయము, స్వరార్థోపయోగియునగు నటీ సూత్రధారసల్లాపము ఆముఖమని,దీనికి కథోద్ఘాత, ప్రవర్తక, ప్రయోగాతిశయములను మూడంగములుండునని తెలిపినాడు. ఇతడు ప్రవృత్తకమును ప్రవర్తకమని నాడు. మరియు ఇతడే -

ప్రస్తావనా స్థాపనేతి ద్విధా స్యాత్ ఇదమాముఖమ్
విదూషక నటీపారిపార్శ్వకైస్సహ సల్లపన్
శ్లోక వీథ్యాది సహితాన్యాముఖాంగాని సూత్రకృత్
యోజయేత్ యత్ర నాట్యజ్ఞైరేషా ప్రస్తావనా స్మృతా॥

సర్వాముఖాంగవీథ్యంగ సమేతైః వాక్యవిస్తరైః
సూత్రధారో యత్ర నటీవిదూషక నటాదిభిః
సంలపన్ ప్రస్తుతంచార్థమాక్షిపేత్ స్థాపనా హి సా
శృంగారప్రచురే నాట్యే యోగ్యః ఆముఖక్రమః
రత్నావళ్యాదికే ప్రాయో లక్ష్యతాం కోవిదైరయమ్
వీరాద్భుతాదిప్రాయే తు ప్రాయః ప్రస్తావనోచితా
అనర్ఘరాఘవాద్యేషు ప్రాయశో వీక్ష్యతామిదమ్
హాస్యభీభత్సరౌద్రాది ప్రాయే తు స్థాపనా మతా
వీరభద్ర విజృంభాదౌ సా ప్రాయేణ నిరీక్ష్యతామ్॥

ఆముఖము ప్రస్తావన, స్థాపనయని రెండు విధములు. కొద్దిపాటి వీథ్యంగములు ఆముఖాంశములు కలిగి సానుచర సూత్రధార సల్లాపములు ప్రస్తావనయని సర్వముఖాంగ వీథ్యంగములు కలిగి వాక్య విస్తారములతో కూడిన సానుచర సూత్రధార సల్లాపము స్థాపనయని గ్రహింపవలయును. శృంగార ప్రధానమగు రూపకమున చిత్రోక్తిమయమౌ నటీ సూత్రధార సల్లాపమను ఆముఖముండదగినది.ఇతి రత్నావళ్యాది రూపకములలో చూడవచ్చును. వీరాద్భుతాది భూయిష్ఠమౌ రూపకమున ప్రస్తావన యుండదగినది. అనర్ఘ రాఘవాది నాటకములలో ఏవంవిధ ప్రస్తావన మనకగుపడును. హాస్య రౌద్ర బీభత్సాది బహుళమైన రూపకములలో స్థాపన యుండదగినది. మేము సూచించిన యీ స్థాపన వీరభద్ర విజృంభాది రూపకములలో పరీక్షించుకొనవచ్చునని ఆముఖము యొక్క వైవిధ్యమును సింగభూపాలుడు ప్రదర్శించినాడు. కాని కొన్ని రూపకములలో ఇవి ఏకార్థముగా నగుపడుటవలన తర్వాతివా రెవరు ఈ భేదములను పాటింపలేదు. శారదా తనయుడు సర్వాముఖాంశ వీథ్యంగములు గలదానిని ప్రస్తావన యనియనగా సింగభూపాలుడు, సర్వాముఖాంశ వీథ్యంగములు కలది స్థాపనయని నుడివినాడు. భరత, విశ్వనాథులు తప్ప మిగిలిన నాట్య శాస్త్రకారులు ప్రస్తావనకు మూడంగముల భేదమునే పాటించినారు.

## ప్రస్తావనాంగ లక్షణములు

"పదాని త్వగతార్థాని యే నరాః పునరాదరాత్
యోజయంతి పదై రన్యైః తదుద్ఘాతకముచ్యతే."

ఆదర సహితములు, ప్రశ్నరూపములును అగు పదములకు తత్పర్యాయములైన పదములతో సమాధానము చెప్పుట ఉద్ఘాత్యకమనబడును. అనగా ప్రతి వచనాత్మకముద్ఘాత్యకమని తేలినది, కాటయవేముడు శాకుంతల వ్యాఖ్యలో కుమారగిరిరెడ్డి వసంతరాజీయములోనిదని దీని నుదాహరించినాడు. నిర్మలమైన చంద్రహాసము పొంది ఉగ్రమైన గాఢ తమస్సుగల దశాస్యుని రాముడు నశింప జేసినట్లు అంధకార బంధురమౌ వర్షాకాలమునణచి బంధు జీవములను పోషించు శరత్సమయము వచ్చినదను శరత్కాల సామ్యముచే సూచింపబడిన రామ పాత్ర ప్రవేశముదాహరణము. శారదా తనయుడు మాత్రము "సత్పక్షా మధుర గిరః" అను వేణీ సంహార శ్లోకము ప్రవృత్తకమునకు ఉదాహరించినాడు.

**అవలగితము :-**

"యత్రాన్యస్మిన్ సమావేశ్య కార్యమన్యత్ ప్రసాధ్యతే
తచ్చావలగితం నామ విజ్ఞేయం నాట్యయోక్తృభిః"

అని భరతుడు-

"యత్రైకత్ర సమావేశాత్ కార్యమన్యత్ ప్రసాధ్యతే
ప్రయోగేఖలు తజ్జ్ఞేయం నామ్నావలగితం బుధైః"

-అని విశ్వనాథుడు. ఒక ప్రశ్న కొసగబడిన సమాధానము, మరియొక అర్థమును సాధించుట అవలగితమనబడును. దీనికి విశ్వనాథుడు "తవాస్మిగీత రాగేణ" అను శాకుంతల శ్లోకము నుదాహరించినాడు.

వాస్తవముగా ఉద్ఘాత్యక, అవలగితములు ప్రస్తావనాంశములు కావు. ఇవి వీథ్యంగములు. వీథ్యంగ సమావేశము లక్షణ కర్తలు చెప్పియే యున్నారు. ప్రస్తావనలో ఈ రెంటి ఉపయోగము ఆవశ్యకమగుటవలన భరతుడు వీనిని ప్రస్తావనాంశములుగా చేర్చి యుండవచ్చును. భరతుని నాటి రూపకములు మనకు లభించినగాని వాస్తవము గ్రహింప వీలుపడదు. విశ్వనాథు డొకడే భరత మతమును స్వీకరించినాడు. దశరూపక కారాదులు ప్రస్తావనకు మూడే అంగములని తెలుపుటనుబట్టి వీటి ప్రయోగము తర్వాతి రూపకములలో లభింపక పోవుటయే యని భావింపవలసి వచ్చుచున్నది.

ఇదిగో ఇతరులీమె యిదియని సూత్రధారునిచే నిర్దేశింపబడిన పాత్ర ప్రవేశించుట ప్రయోగాతిశయము. ఇదే శ్లోకమును భావప్రకాశికాకారుడు గ్రహించినాడు. భరతుడు తప్ప మిగిలిన ఆచార్యులు "ఏష రాజేవ దుష్యంతః" అను శాకున్తల శ్లోకమును ప్రయోగాతిశయముగా ఉదాహరించినారు.

**ప్రవృత్తకము :-**

"కాలప్రవృత్తిమాశ్రిత్య వర్ణనా యా ప్రయుజ్యతే
తదాశ్రయాచ్చ పాత్రస్య ప్రవేశః తత్ప్రవృత్తకమ్"

అని భరతుడు,

"యదా కాలప్రవృత్తిం కాంచిదవలంబ్య యథా సూత్రధారేణ
కించిద్వస్తు వర్ణ్యతే తదాశ్రయేణచ పాత్రస్య ప్రవేశః
తత్కాలప్రవృత్యా స్వార్థోక్తత్వాత్ ప్రవృత్తకమ్"

అని అభినవుడు,

"కాలం ప్రవృత్తమాశ్రిత్య సూత్రధృక్యత్ర వర్ణయేత్
తదాశ్రయశ్చ పాత్రస్య ప్రవేశః తత్ప్రవృత్తకమ్"

అని విశ్వనాథుడు,

"కాలసామ్య సమాక్షిప్త ప్రవేశః స్యాత్ ప్రవృత్తకమ్"

అని దశరూపకర్త,

"ప్రవేశో యో వసంతాదిసామ్యేన స్యాత్ ప్రవృత్తకమ్"

అని శారదాతనయుడు నేకాభిప్రాయమును వెల్లడించినారు. ప్రస్తావనలో ప్రవృత్తమైన ఋతుసమాన గుణవర్ణనచే సూచింపబడిన పాత్ర ప్రవేశించుట ప్రవృత్తకము. దీనికి ఛలితరామమను నాటకము నుండి దశరూపకకర్త, సాహిత్య దర్పణకర్తలు మాత్రము

"ఆసాదిత ప్రకట నిర్మల చంద్రహాసః
ప్రాప్తః శరత్సమయ ఏష విశుద్ధకాంతిః
ఉత్ఖాయ గాఢతమసం ఘనకాలముగ్రం
రామో దశాస్య మివ సంభృత బంధుజీవః"

అని ఉద్ఘాత్య లక్షణము నుల్లేఖించినారు.

"సూచినీ ప్రస్తుతార్థస్య యా ప్రశ్నోత్తరమాలికా
ఉద్ఘాత్యకమితి ప్రాహుః తదేతన్నాట్యవేదినః"

కావ్యార్థమును సూచించెడి ప్రశ్నోత్తర మాలికయే ఉద్ఘాత్యక మని భావము.

**సాహిత్యదర్పణకర్త :-**

"పదాని త్వ గతార్థాని తదర్థగతయే నరాః
యోజయంతి పదైరన్యైః స ఉద్ఘాత్యక ఉచ్యతే"

సూత్రధారోక్తములైన పదముల కాయర్థము లేకున్న నేపథ్యగతమైన పాత్ర తనకు సంబంధించిన విధముగ అర్థమును గ్రహించినచో అది ఉద్ఘాత్యక మనబడును. దీని కుదాహరణముగా ముద్రారాక్షసములోని "క్రూరగ్రహః స కేతుః" అను శ్లోకము నొసగినాడు.

**భరతుడు :-**

"సూత్రధారస్య వాక్యం వా యత్ర వాక్యార్థమేవ వా
గృహీత్వా ప్రవిశేత్పాత్రం కథోద్ఘాతః స కీర్తితః"

**అభినవుడు :-**

"కథాంశావ్యార్థరూపా ఉత్ ఊర్ధ్వమేవ హన్యతే గమ్యతే
తత్రేతి కథోద్ఘాతః ఇతి."

**కథోద్ఘాతము :**

"సూత్రధారస్య వాక్యం వా సమాదాయార్థమస్య వా
భవేత్పాత్ర ప్రవేశ శ్చేత్ కథోద్ఘాతః స ఉచ్యతే"

అని విశ్వనాథుడు,

"స్వేతివృత్తం సమం వాక్యం అనర్థం వా యత్ర సూత్రిణః
గృహీత్వా ప్రవిశేత్ పాత్రం కథోద్ఘాతో ద్విధైవ సః"

అని భావప్రకాశికాకారుడును,

"సూత్రిణో వాక్యమర్థం వా స్వేతివృత్త సమం యథా
స్వీకృత్య ప్రవిశేత్ పాత్రం కథోద్ఘాతో ద్విధా మతః"

అని సింగభూపాలుడు నుడివినారు. సూత్రధారుడు ప్రయోగించిన స్వేతివృత్తసమమౌ వాక్యమునుగాని ఆ వాక్యములోని అర్థమునుగాని గ్రహించి పాత్ర రంగస్థలమున ప్రవేశించునేని అది కథోద్ఘాత మనబడును ఇది వాక్యగ్రహణ రూప భేదమున రెండు విధములని భరతుడు దప్ప మిగిలినవారు "ద్వీపాదన్యస్మాదపి" అను రత్నావళి శ్లోకమును వాక్యగ్రహణ రూపమునకు "నిర్వాణ వైరదహనాః" అను వేణీ సంహార శ్లోకమును వాక్యార్థగ్రహణ రూపమునకు నుదాహరించినారు. కాని శారదా తనయుడు "క్రూర గ్రహస్స కేతుః" అను ముద్రారాక్షస శ్లోకము వాక్యార్థగ్రహణ కథోద్ఘాతమనినాడు.

**ప్రయోగాతిశయము :**

"యది ప్రయోగ ఏక స్మిన్ ప్రయోగోన్యః ప్రయుజ్యతే
తేన పాత్రప్రవేశశ్చేత్ ప్రయోగాతిశయ స్తథా"

అని విశ్వనాథుడు-

"ప్రయోగే తు ప్రయోగం తు సూత్రధారః ప్రయోజయేత్
తతశ్చ ప్రవిశేత్పాత్రం ప్రయోగాతిశయో హి సః"

అని భరతుడును నుడివినారు. నాట్యమునకు సంబంధించిన వస్తువును సూత్రధారుడు ప్రస్తావనయందు ప్రయోగింపగా, దానిననుసరించి పాత్ర ప్రవేశించుట ప్రయోగాతిశయ మనబడును- అని ఇరువురి నిర్వచనముల కర్థము.

"ఏషోఽయమిత్యుపక్షేపాత్ సూత్రధార ప్రయోగతః
పాత్ర ప్రవేశో యత్రైష ప్రయోగాతిశయో మతః" (దశరూపకకారుడు).

## భాసుని కృతులలో స్థాపన

భాసుని కృతులలో ఋతుగానము కాని, కవికావ్యపరిచయము కాని, దేశ కాల నిర్దేశముకాని యుండదు. కనీసము రూపక నామమైన పేర్కొనుట జరుగ లేదు. సామాన్యముగా పాత్ర ప్రవేశము ప్రయోగాతిశయమను ప్రస్తావనాంశముచే సూచింపబడును. సూత్రధారుడొక్కడే స్వప్నవాసవదత్తము, కర్ణభారము, దూత వాక్యము, దూతఘటోత్కచము, మధ్యమవ్యాయోగము, బాలచరితము - అను రూపకములలో ప్రస్తావనను నిర్వహించును. అవిమారకము, చారుదత్తము, ప్రతిజ్ఞాయౌగంధరాయణము, ప్రతిమా నాటకము - అను రూపకములలో నటితో గూడి ప్రస్తావనను నిర్వహించును. అన్ని రూపకములలో ప్రస్తావన అనునది స్థాపన అను పేర నిబంధింపబడినది.

1. దూతఘటోత్కచము : "నేను ఆర్యమిశ్రులకు విన్నపము చేతును. ఏమి! నేను విన్నపమునకు పూనుకొనునంతలోనె ఏదో శబ్దము వినబడుచున్నది. పరికింతును (తెరలో అయ్యో! నివేదించుడు: నివేదించుడు) ఈ మాట విని తెలిసినది. కృష్ణసారథ్యమున అర్జునుడు సంశప్తకులతో పోరాడుటకై వెళ్ళిన సమయమున భీష్మవధామర్షితులైన ధార్తరాష్ట్రులు చుట్టుముట్టి అభిమన్యుని బరిమార్చినారు.

"యాంత్యర్జున ప్రత్యభియాన భీతా
యతోఽర్జునస్తాం దిశమీక్షమాణాః
నరాధిపా స్స్వాని నివేశనాని
సౌభద్ర బాణాః కిల నష్టసంజ్ఞాః"

అభిమన్యు బాణ క్షతగాత్రులై విగత సంజ్ఞులైన రాజులించుక తెలివి నంది అర్జునుడు తిరిగివచ్చి క్రమ్ముకొనునను భయమున అతడు వెళ్ళిన దిక్కునసే

చూపులు నిగుడించుచు తమ తమ శిబిరములకు చేరుకున్నారు" అని నిష్క్రమించును. ఇట జరిగిన అభిమన్యు వధ, అర్జునుడు వచ్చునని వెరచి పారిపోయి శిబిరములకు చేరెడి రాజుల విషయము సంగ్రహముగా పేర్కొనబడినవి. కాని పాత్ర ప్రవేశము సూచింపబడలేదు "అయ్యా నివేదించుడు, నివేదించుడు" అను తెరలో వినబడెడు మాటను బట్టి ఎవడో రాజభటుడు రంగస్థలమున ప్రవేశింపనున్నాడనునది మనమే గ్రహింపవలసియున్నది.

**2.** దూతవాక్యము : సూత్రధారుడు విన్నవించునంతనే ఏదో శబ్దము వినబడును. (అయ్యా! ద్వార రక్షాధికారులారా! దుర్యోధన మహారాజు ఆదేశించుచున్నాడు) అను మాట గ్రహించి సూత్రధారుడు - తెలిసినది.

"ఉత్పన్నే ధార్త రాష్ట్రాణాం విరోధే పాండవైస్సహ
మంత్రశాలాం రచయితి భృత్యో దుర్యోధనాజ్ఞయా."

పాండవులతో గూడ కౌరవులకు విరోధ మేర్పడగా భృత్యుడు దుర్యోధనుని ఆదేశానుసారము ఆలోచనా మందిరము సమకూర్చుచున్నాడు" అని నిష్క్రమించును. ఇట తెరలోని పాత్ర రంగస్థలమును ప్రవేశించుచున్నదను విషయమును సూచించుటచే ప్రయోగాతిశయము.

**3.** కర్ణ భారము : కర్ణభారమున సూత్రధారుడు విన్నవించునంతలో మహారాజు కర్ణునకు విన్నవించుడనుమాట తెరలో వినబడ గ్రహించి సూత్రధారుడు-

"సంగ్రామే తుములే జాతే కర్ణాయ కలితాంజలిః
నివేదయతి సంభ్రాన్తో భృత్యో దుర్యోధనాజ్ఞయా."

యుద్ధము ఘోరముగా జరుగు సూచన యగుపడ దుర్యోధనుని ఆదేశానుసారము ఉద్విగ్నుడైన రాజభటుడు కర్ణునకు అంజలి ఘటించి విన్నవించుచున్నాడని నిష్క్రమించును. ఇట సూత్రధారుడు కర్ణునకు యుద్ధకాల మాసన్నమైనదను విషయమును వెల్లడింప భటుడు రంగస్థలమున ప్రవేశించుచున్నాడని సూచించుటయే ప్రయోగాతిశయము.

**4.** మధ్యమవ్యాయోగము : ఇందును పూర్వోక్త రూపకము నందువలె ఏదో ధ్వని వినబడును. సూత్రధారుడు గ్రహించి-

"భో శబ్దోచ్చారణాదస్య బ్రహ్మణోఽయం న సంశయః
త్రాస్యతే నిర్విశంకేన కేనచిత్పాప చేతసా"

'భోస్త్రాత' అను పదము నుపయోగించుటను బట్టి ఇతడు బ్రాహ్మణుడని నిస్సందేహము. ఎవడో పాపాత్ము డితనిని బెదరగొట్టుచున్నాడు. (తిరిగి తెరలో "అయ్యా! నాయనా! ఎవరీతడు" అని వినబడును) సూత్రధారుడు గ్రహించి ఇతడు భీముని పుత్రుడు. హిడింబయను అరణియందు పుట్టిన రాక్షసాగ్ని. బ్రాహ్మణులను బెదరగొట్టుచున్నాడు. ఎంత కష్టము!

"భ్రాంతై స్సుతైః పరివృతైస్త్రుణైరుదారైః
వృద్ధో ద్విజో నిశిచరానుచరః స ఏషః
వ్యాఘ్రానుసారచకితో వృషభస్స ధేనుః
సంత్రస్త వత్సక ఇవాకులతాముపైతి"

రాక్షసుడు వెంట తరుముచుండ బెదిరిన పుత్రులతో భార్యతోపాటు మాప మా వృద్ధబ్రాహ్మణుడు పెద్దపులి అనుసరించినపుడు ఆవుతోపాటు లేగలు బెదురుచుండ చకితమైన వృషభమువోలె వ్యాకులతను చెందుచున్నాడు" అని నిష్క్రమించును. ఇట సూత్రధార వాక్యానుసారము ముగ్వురు పుత్రులతోను భార్యతోను బ్రాహ్మణుడు, ఆతని వెనుక ఘటోత్కచుడును ప్రవేశించుట వలన ప్రయోగాతిశయము.

5. **బాలచరితము** : బాలచరితమునను "నేను గగన సంచారిని" అను తెరలోని మాటను గ్రహించి సూత్రధారుడు తెలిసికొని-

"పతత్యసౌ పుష్పమయీ చ వృష్టిర్నదంతి తూర్యాణి చ దేవతానామ్
ద్రష్టుం హరిం వృష్ణికులే ప్రసూతమభ్యాగతో నారద ఏష తూర్ణమ్."

"ఇదిగో పుష్పవృష్టి కురియుచున్నది. దేవతలు దుందుభులను మ్రోగించు చున్నారు. 'ఇదిగో నారదుడు వృష్ణి కులమున ఆవిర్భవించిన కృష్ణుని దర్శింప నరుదెందుచున్నాడు." అని నిష్క్రమించును. ఈ సూత్రధారోక్తివలన నారద పాత్ర రంగస్థలమున ప్రవేశించుటచే ఇది ప్రయోగాతిశయమను స్థాపన.

6. **స్వప్న వాసవదత్తము** : స్వప్న వాసవదత్తమునను సూత్రధారుడు విన్నవించునంతలో 'ప్రక్కకు తొలగుడు తొలగుడు' అని తెరలో వినిపింప గ్రహించి :

'భృత్యైర్మగధరాజస్య స్నిగ్ధైః కన్యానుగామిభిః

ధృష్టముత్సార్యతే సర్వస్తపోవనగతో జనః"

మగధరాజుగారి భటులు ఆయన కూతురు వెంట రక్షణార్థ మరుదెంచుచు ఆశ్రమవాసి జనమును గడుసు తనమున తొలగుడు తొలగుడని నుడువు చున్నారు" అని నిష్క్రమించును. ఈ మాట రాజభటుల రంగస్థల ప్రవేశమును సూచించుటచే ఇది ప్రయోగాతిశయమను ప్రస్తావనాంగము.

7. అవిమారకము :- సూత్రధారుడు : ఆర్యమిశ్రురాలా! నీ చిరు నవ్వునుబట్టి ఏదో చెప్పదలచినట్లు గ్రహించినాను, తెల్పుము.

నటి :- ఆర్యా! మీతోపాటు ఉద్యానవనమునకు రాదలచుచున్నాను. ఆ ప్రదేశమున స్త్రీ లొనరించు కొండొక పని గలదు.

(తెరలో భూతకా! కురంగీ రక్షణకై నీవు ఉద్యాన వనమున కేగుము. అంజనగిరి యను మాతంగము మదించినదని తెలిసినది)

సూత్ర :- (విని) ఆర్యురాలా! రాకుమారి ఉద్యాన వనమున కేగినదని వింటిమి కదా! కావున ఉద్యానము చుట్టును చక్కని కావల ఏర్పరచబడి యుండును. రాకుమారి తిరిగి వచ్చిన పిదప మనము వెళ్ళుదమని నిష్క్రమించును. కురంగీ రక్షణార్థము ఆదేశించుచున్న రాజ పాత్రను సపరివారముగా ప్రవేశ పెట్టుటవలన ఇది ప్రయోగాతిశయము

8. ప్రతిజ్ఞాయౌగంధరాయణము :- నటీ సూత్రధార సల్లాపము.

సూత్ర :- ఆర్యా! ఏదైన గీత మాలాపింపుము. నీ పాటకు సభాసదులు మెచ్చిన పిదప ప్రకరణము ప్రయోగింతము. ఏమీ చింత గొనినావు?

నటి :- ఆర్యా! ఈ వేళ నాకు కలలో మా బంధువుల కస్వాస్థ్యము జరిగినట్లు చూచినాను. కుశల వార్త తెలిసికొనుటకు మా బంధువుల ఇంటికి ఎవరినైన పంపించిన బాగుండును.

సూత్ర :- మంచిది.

"పురుషం ప్రేషయిష్యామి వ్యక్తమాత్మహితే క్షమమ్

పురుషం ప్రేషయత్యేష యథా యౌగంధరాయణః"

ఆత్మహితుడగు వ్యక్తిని యౌగంధరాయణుడు పంపించినట్లే నేనును పంపింతును. (అని నిష్క్రమించును.)

రంగస్థలమున యౌగంధరాయణ పాత్ర ప్రవేశమును సూచించుట వలన ఇది ప్రయోగాతిశయము.

**9. ప్రతిమానాటకము** :- నటీ సూత్రధార సల్లాపము.

సూత్ర :- ఆర్యా! ఈ శరత్కాలము నుద్దేశించి ఒక గీత మాలాపింపుము.

నటి పాడును.

సూత్ర :- ఈ సమయమున

'చరతి పులినేషు హంసీ కాశాంశుకవాసినీస సహృష్టా'

కాశ పుష్పము వంటి వన్నెతో నిర్మల జలా వాస మొనరించుచున్న ఈ హంసాంగన సైకత స్థలమున ప్రహర్షమున విహరించుచున్నది. (తెరలో ఆర్యా! ఆర్యా! అను మాట విని) సూత్రధారు డిట్లనును:

"ముదితా నరేంద్రభవనే త్వరితా ప్రతిహారరక్షీవ"

దశరథ మహారాజుగారి యంతఃపురమున కాశ కుసుమమువలె తెల్లని కోక దాల్చినది. ప్రసన్నచేతస్కయు పని తొందర కలిగియున్న ద్వారపాలిక వోలె హంసాంగన చరించుచున్నదని తాత్పర్యము.

ఈ నాటకమున మాత్రము శరదృతు గానము చేయబడినది. ఇదియొకటి మిగిలిన రూపకములలో లేని విశేషము. సూత్రధార వాక్యము వలన ప్రతిహార పాత్ర ప్రవేశము సూచితమగుటచే ప్రయోగాతిశయము.

**10. చారుదత్తము** : ఇందు నాందీపాఠము లేదు. నటీ సూత్రధారోక్తి: ఏమి! ప్రాతఃకాలమున యింటినుండి బయలుదేరినప్పటినుండి నా కనులు ఆకలి మూలమున తామరరేకుల పైబడిన జలబిందువులవలె రెపరెపలాడుచున్నవి. ఇంటిలో నేమైన లభించునో వెళ్ళి తెలిసికొందును. (ప్రవేశించి) వంటపాత్రలన్ని శుభ్రముచేసి బోర్లవేయబడియున్నవి. ఏమి! కమ్మని నేతివాసన వచ్చుచున్నది. ఏదైన ఇంటిలో ధార్మికారాధన కావచ్చు. పరిజనము అటునిటు తిరుగుచున్నది. ఆకలి మూలమున లోకమంత నా కన్నమయముగా గోచరించుచున్నదే. అందుకే ప్రతిది భోజన సంవిధానముగ తోచుచున్నది. గృహిణిని పిలిచి అడిగెద. ఆర్యా! ఇటురమ్ము.

నటి : (ప్రవేశించి) ఇదిగో! అనుకున్నంతలోనే వచ్చినారని ప్రవేశించును.

సూత్ర : ఆర్యా! తినుటకేమైనను కలదా?

నటి : ఉన్నది.

సూత్ర : పెక్కుకాలము జీవింతుము. చక్కని భోజనమివ్వేళ దానము చేయుము.

నటి : అయ్యా! నీ కొరకు ఎదురుచూచుచున్నాను. నేయి, బెల్లము, పెరుగు, బియ్యము- అన్నియు కలవు.

సూత్ర : ఏమి, ఇవన్నియు మన ఇంటనున్నవా?

నటి : మన ఇంటకాదు. కొట్టులోనున్నవి.

సూత్ర : అనార్యురాలా! నాతో పరిహాసములాడుచుంటివా? నీ కోరిక తెగిపోవుగాక! తీవ్రవాయువుచే ఎగజిమ్మబడిన ఎండుగడ్డివోలె కోరికలూరించి, పర్వతమెక్కించి, చిట్టచివరకు నేలపై బడవేయబడినాను.

నటి : అయ్యా! భయపడకు. క్షణమోపిక పట్టుము. అన్నియు సిద్ధమగును, సామగ్రి లభించినది. ఇవ్వేళ నాకొక ప్రొద్దు (నోము).

సూత్ర : ఆ ఉపవాసము దేని కొరకు?

నటి : అభిరూప పతి నిమిత్తము.

సూత్ర : అన్యజన్మను గురించియా?

నటి : ఔను.

సూత్ర : పోనిమ్ము. ఈ ఉపవాసము చేయుమని చెప్పిన వాడెవడు?

నటి : చూర్ణగోష్ఠుడను ధార్మికుడు. నాయందు దయయున్నచో తగిన బ్రాహ్మణుని భోజనమునకు పిలువుము.

సూత్ర : దరిద్ర బ్రాహ్మణుడెక్కడ లభించును? ఇదిగో చారుదత్తులవారి మిత్రుడు మైత్రేయుడిటు వచ్చుచున్నాడు. పిలిచెద. అయ్యా! మైత్రేయ! దరిద్రుని మాట యని త్రోసిపుచ్చకు. షడ్రసోపేత భోజనముతోపాటు తగిన దక్షిణయు నొసగెద, భోజనమునకు రమ్ము.

(తెరలో- "మరియొకనిని నిమంత్రించుము. నేను ఇదివరకే ఒప్పుకున్నాను" అని వినబడును)

"ఘృత గుడ దధిన సమృద్ధం ధూపిత సూపోపదంశ సంభిన్నమ్ సత్కార దత్తమిష్టం భుజ్యతాం భక్తమార్యేణ"

నేయి, మధురపదార్థము, మంచి పెరుగు, హింగ్వాది సువాసితమౌ పప్పు శాకపాకములు కలిగి ఆదరపూర్వకముగా నొసగెడి యీ భోజనమును స్వేచ్ఛగా భుజించుము.

మిగిలిన రూపకములకన్న చారుదత్తములోని స్థాపన విస్తృతముగానున్నది. రూపకములో శకారపాత్ర అసంబద్ధ ప్రలాపము, హాస్యమునీ నటీ సూత్రధార సల్లాపము సూచింపజేయుటయే ఇందలి స్థాపన యొక్క ముఖ్యోద్దేశము. చారుదత్తుని దారిద్ర్యమును సూత్రధారోక్తి సూచించుచున్నది. తెరలోని పాత్రతో సూత్రధారు డాలాపము చేయుట యితర రూపకములలో లేదు. ఇది ఈ రూపకము లోని మరియొక విశేషము. చారుదత్తుని మిత్రుడు మైత్రేయుడు అను విదూషకుడు రంగస్థలమున ప్రకాశించుటను సూచించుటచే నిది ప్రయోగాతిశయము.

**11. ఊరుభంగము :-** మారిష, సూత్రధార సల్లాపము.

సూత్రధారుడేదో విన్నవింతు నన్నంతలోనే "ఇదిగో మేము" అనుమాట వినిపించును.

పారి :- బావా! ఈ వీర పురుషులెవరు?
"స్వర్గార్థమాహవముఖోద్యత గాత్రహోమా
నారాచతోమరశతైర్విష మీకృతాంగాః
మత్త ద్విపేంద్ర దశనో ల్లిఖితైః శరీరై
రన్యోన్యవీర్య నికషాః పురుషా భ్రమంతి"

స్వర్గ లోకప్రాప్తికై సమరాగ్నిలో తమ శరీరము నాహుతి చేయుచున్న వారు, శస్త్రాస్త్ర ప్రహారములచే జర్జరీకృతాంగులు, మదించిన మాతంగముల రద ప్రహారములచే చిల్లులుపడిన దేహము కలవారు వీరత్వమునకే నికషో పలములై పరిభ్రమించుచున్న ఈ పురుషులెవరు?

సూత్ర :- ధృతరాష్ట్ర పక్షమున కొడుకులు చనిపోయి దుర్యోధనుడు మాత్రమే బ్రతికియుండ వాసుదేవ పాండవావశిష్టకముకాగా యుధిష్ఠిర పక్షము. సమంతపంచక క్షేత్రము రాజ కళేబరములతో క్రిక్కిరిసియుండ-

"ఏతద్రణం హతగజాశ్వనరేంద్రయోధం
సంకీర్ణలేఖ్యమివ చిత్రపటం ప్రవిద్ధమ్

యుద్ధే వృకోదర సుయోధనయోః ప్రవృత్తే
యోధా నరేంద్ర నిధనైక గృహం ప్రవిష్టాః"

రణరంగమున చతుర్విధ సేనలు నిహతమై చిత్తరువులో దింపబడిన బొమ్మలవోలె నగుపడుచుండ గదా యుద్ధము వృకోదర సుయోధనులకు ఘోరముగా జరుగుచున్న సమయమున భటులు ఆ యుద్ధ రంగమున ప్రవేశించినారు" అని మారిషునితో నిష్క్రమించును. భటుల ప్రవేశమును ఈ సూత్రధారోక్తి తెల్పుట వలన ప్రయోగాతిశయమను ప్రస్తావనాంగము. ఇదే పద్ధతి ఇంచుమించు మిగిలిన రూపకములలో మనకగుపడును.

**మహానాటకము :-** కొద్దిపాటి గద్యములను కూడ తొలగించినచో ఇదియొక పద్యనాటకమగును. 'ఒపెరా' వంటి రూపకములు మనకు లేవు. ఒపెరా గీతమయము కాగా మహా నాటకము పద్యరూపమగును. మహా నాటకమున ప్రథమాంకమున 34 వ పద్యము పిదప జామదగ్న్యుని పాత్రలో ఒకే ఒక గద్య ముపయోగింపబడినది. 'తదా సీతా (ఆత్మగతమ్) రామో లక్ష్మణం. ప్రతి' ఇత్యాదిరూపమున పాత్రోక్తి సూచన మొనరింపబడినది. ప్రస్తావనా లక్షణము లేకున్నను ఉపక్రమనామమున నుపయోగింపబడిన నాలుగుపద్యములు కథాప్రవేశమును సూచించుచున్నవి. సభ్యులకు ప్రయోగింపబడు నాటకమునకు సంబంధించిన కథాంశమును పరిచయము చేయుటె ప్రస్తావన యొక్క ముఖ్యోద్దేశము. పిదప ప్రస్తావనలో చిత్రోక్తులు, ఋతుగానము మున్నగునంశములు చోటు చేసికొనినవి.

మహానాటకమున మాత్రము కేవలము కథా ప్రవేశము ఇట్లు ఉపక్రమ నామమున గావింపబడినది— శత్రు భయంకరుడు, సూర్యవంశ ప్రసిద్ధుడు, దశరథుడను రాజు గలడు. భూభారాపహరణ నిమిత్తము విష్ణువు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులను నామమున దశరథున కుదయించినాడు. వారిలో రాముడు పెద్దవాడు. అతడు ఈశ్వరీయ గుణములతో విరాజిల్లుచుండెను. విశ్వామిత్రుడు యాగము చేయదలచి, రక్షోభయము తొలగింప రాముని పంపుమని దశరథుని యాచించినాడు. ఎట్టకేలకు దశరథుడు రాముని ముని వెంట పంపినాడు. రాముడు లక్ష్మణునితో ముని వెంట మహానందమున తపోవనమున కేగినాడు. తాటకను రాముడు సంహరించినాడు. విశ్వామిత్రు డానందమున శ్రీరామునకు

దివ్యాస్త్రోపదేశము చేసినాడు. రాముడు యాగమునకు నొవిఘ్నము నరించు చున్న రాక్షసుల నందరిని చంపివేసి, భావివేత్త యౌటవలన, ఉగ్రుడౌ మారీచుని తీవ్ర బాణముతో నొప్పించి దూరము పారద్రోలినాడు. యాగము నిర్విఘ్నముగా కొనసాగినది. అటు పిదప జనకు డొనర్చు ధనుర్భంగయాగ వార్తను, అందు రాజుల భంగపాటును విని, అందు పాల్గొనుటకై రామలక్ష్మణులను వెంట తీసి కొని సత్యవతీ పుత్రుడు విశ్వామిత్రుడు వెళ్ళినాడు. జనక కృత సపర్యల నందు కొని, ధనుర్మండపమునకు రాకుమారుల తీసికొని వెళ్ళినాడని ఉపక్రమము చేయబడినది. అటుపిదప సభలో రాముని జూచి సీత అనుకొనుట, రాముడు లక్ష్మణునితో, రావణ పురోహితుడు జనకునితో, స్వ స్వభావములను (పద్యముల లోనె) వెల్లడించుట యనునది అంకరూపమున ప్రదర్శింపబడునని మనము సమన్వయము చేసికొనక తప్పదు. మహానాటకమున ఉపక్రమ నామమున ఈ శ్లోకములు కలవు:

"ఆసీ దుద్భట భూపతి ప్రతిభట ప్రోన్మాది విక్రాంతికో
భూపః పఙ్క్తిరథో విభావసుకుల ప్రఖ్యాతకేతుర్బలీ
ఉర్వీబర్బర భూరి భారహరణే భూరిశ్రవాః పుత్రతాం
యస్యారస్వమధో విధాయ మహితః పూర్ణశ్చతుర్ధా విభుః

తేషామీశ్వర తాగుణైశ్చ జనుషా జ్యాయానభూద్రాఘవో
రామసోప్యథ కౌశికేన మునినా రక్షోభయా ద్యాచితః
రాజానం, సయశోధనో నరపతిః ప్రాదాత్ సుతం దుఃఖితః
తస్మై సోపి త మన్వగాదనుగతస్సౌమిత్రిణో చ్చైర్ముదా

సుందస్త్రీ దమన ప్రమోద ముదితాదాస్థాయ విద్యోదయం
రామస్సత్యవతీ సుతా దథగతస్తస్యాశ్రమం లీలయా
క్లృప్తే కౌశిక నందనేన చ మఖే తత్రాగతాః రాక్షసాః
హత్వాఽ మాముచ దాశుభావివిదసౌ మారీచముగ్రాకృతిమ్

పూర్ణే యజ్ఞ విధేయి యా సురభవత్ రామేణ సార్థం మునిః
సీతా సంవరణా గతాఖిల నృపవ్యాభగ్న వీర్యశ్రియమ్
శ్రుత్వా తద్ధనురుత్సవం చ మిథిలా మాస్థాయ తేనాధికం
సత్కారైరుపలంభితః పునరగాత్ చాపాశ్రితం మండపమ్."

## కాళిదాస కృతులు

**1. మాళవికాగ్నిమిత్రము :**

"వసంతోత్సవ సందర్భమున కాళిదాసు కూర్చిన "మాళవికాగ్నిమిత్రము" అను నాటకమును ప్రదర్శింపవలయునని సభవారాదేశించినారు" (అను వాక్యమున దేశకాల నిర్దేశము, నాటకనామ నిర్దేశము చేయబడినది. అందు నటులు ప్రార్థనీయులు.)

"ప్రాచీనులగు ధావక సౌమిల్లాది మహాకవుల ప్రబంధములుండగా నవీనుడగు కాళిదాసు కృతిపట్ల సభవారికేల ఆదరణ కల్గినది" అని పారిపార్శ్వకుడు ప్రశ్నింప సూత్రధారుడు సమాధానముగా :-

"పురాణ మిత్యేవ న సాధు సర్వం నచాపి కావ్యం నవమిత్యవద్యమ్
సంతః పరీక్ష్యాన్యతరద్భజన్తే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః"

"పాతదైనంత మాత్రమున సర్వము గ్రాహ్యముకాదు. క్రొత్తదగుటవలన కావ్యము గర్హణీయముకాదు. పండితులు గుణదోషములు పరీక్షించి, ఆ రెంటిలో ఏది సుందరమో దాని నాదరింతురు. మూర్ఖులు పరుల అభిప్రాయములకు తల యొగ్గుదురు" అని అనును.

(ఈ వాక్యమున తన కావ్యము పండిత పరీక్షకు నిలుచునని ఆత్మ ప్రత్యయము చాటుకొనినాడు. కావున ఉదాత్తుడు. అంతర్గూఢాభిమానోక్తిః ఉదాత్త ఇతి గీయతే" ఎవని ఉక్తిలో అభిమాన మంతర్గూఢముగా స్ఫురించునో అత డుదాత్తకవి. పూర్వశ్లోకమున తన అభిమానమును నిగూఢముగా చాటుకొనుటచే కవి ఉదాత్తుడు.) ఈ మాట విని నటుడు పూజ్యులైన సభ్యులే ఈ విషయమున ప్రమాణమగుదురనును.

సూత్ర :- ప్రదర్శించువేళ అయినది. త్వరపడుమని పలికి-
"శిరసా ప్రథమ గృహీతామాజ్ఞామిచ్ఛామి పరిషదః కర్తుమ్
దేవ్యా ఇవ ధారణ్యాస్సేవాదక్షః పరిజనోఽయమ్"

"సేవాదక్షమైన పరిజనము ధారణీదేవి ఆజ్ఞను వోలె పూర్వమే శిరసా స్వీకరింపబడిన సభ్యుల ఆజ్ఞను నిర్వర్తింపగోరుచున్నాను" అని అనును.

సూత్రధారుని నిర్దేశానుసారము పాత్ర ప్రవేశము జరిగినచో అది ప్రయోగాతిశయమను ప్రస్తావనాంగమనబడును. సూత్రధారుడు ఉపమానరూపమున ధారణీదేవి పరిజనము పేర్కొనెను. దీనిని బట్టి ధారణీదేవి, ఆమె పరిచారికలు రంగ స్థలమున ప్రవేశింతురు. కనుక ప్రయోగాతిశయము.

2. విక్రమోర్వశీయము :-

మారిష, సూత్రధార సల్లాపము.

"మారిషా! మన సభవారు పూర్వకవుల నాటకము లెన్నియో ప్రదర్శింప జూచియున్నారు. అపూర్వము, కాళిదాస కృతమునగు విక్రమోర్వశీయమను త్రోటకమును వారి సమక్షమున ప్రదర్శింప దలచితిని. అయాపాత్రల పాఠ్యమును సిద్ధము చేసికొని ప్రదర్శనకు ఉపస్థితులు కావలయునని మన బృందముతో చెప్పుము. విదగ్ధులగు ఈ పండితుల గోష్ఠికి ఇంచుక విన్నవింపవలసియున్నది.

"ప్రణయిషు వా దాక్షిణ్యాత్ అథవా సద్వస్తుపురుషబహుమానాత్
శృణుత జనా అవధానాత్ క్రియామిమాం కాళిదాసస్య"

"సహజ స్నేహమున గాని లేక మహాపురుష నాయకోదాత్త వస్తుకమగు రూపకమందలి బహుమానమునగాని ఈ కాళిదాస కృతిని సావధాన చిత్తులై చూడవలసినదిగా కోరుచున్నాను." (అని అనును).

(ఈ వాక్యమున నాటకమును ప్రదర్శించుచున్నాము చూడవలసినదని కోరుటచే సభ్యులు ప్రార్థనీయులు. ప్రయోక్త ప్రార్థకుడు. పరిషత్తువారి బహు నాటక పరిశీలన వైదగ్ధ్యము, 'సద్వస్తుపురుష' అనుటచే త్రోటకమందలి ఇతి వృత్తము వేదేతిహాస ప్రోక్తము. నాయకుడు దేవతాస్తుతి పాత్రుడని సభ్యరూపక నాయక ప్రశంస చేయబడినది. అట్లు అపూర్వముగా రూపకమును కూర్చిన కాళిదాసు మహా ప్రతిభావంతు డనునది, 'ఆక్షిప్త'మనుటచే కవి ప్రాశస్త్యము ద్యోతితమగుచున్నది) ఇంతలో (తెరలో ఆర్యులారా! రక్షింపుడు, రక్షింపుడు!, ఇంద్ర పక్షపాతియైనవాడు, ఆకాశ సంచార శక్తియు కలవాడు ఎవరైన యున్నచో అరుదెంచుడు) అను మాట విని సూత్రధారుడు నేను విన్నవించిన వెంటనే ఏదో ఆర్తస్త్రీల గొంతుకపోల్ల వినవచ్చుచున్నదేమి?

"మత్తానాం కుసుమ రసేన షట్పదానాం
శబ్దోఽయం పరభృత నాద ఏషధీరః
ఆకాశే సురగణసేవితే సమంతాత్
కిల నార్యః కలమధురాక్షరం ప్రగీతాః"

మకరందపాన మత్తములగు మిళిందముల నాదమా! లేదా ఇది కోకిలాలాపమా! కాదు, దేవతా పరిసౌమ్యమగు ఆకాశమున సురస్త్రీ లేలకో అవ్యక్త మధురాక్షరముగా గానము చేయుచున్నారు.

ఇందు త్రిగతమను వీథ్యంగము గలదు. 'శ్రుతి సామ్యాత్ అనేకార్థ యోజనం త్రిగతం మతమ్' శబ్ద సామ్యమునుబట్టి అనేకార్థములను కల్పించుట త్రిగతము. సూత్రధారుడు మొదట వినబడు ధ్వనిని షట్పద నాదముగా, పిదప కోకిలాలాపముగా, అటుపిదప నారీగీతముగా శ్రుతి సామ్యమున పరికల్పించుట వలన త్రిగతము. ఆలోచించి, ఆ! తెలిసినది.

"ఊరూద్భవా నరసఖస్య మునేః సురస్త్రీ
కైలాసనాథ మనుసృత్య నివర్తమానా
బందీకృతా విబుధ శత్రుభిరర్ధ మార్గే
క్రందత్యతః కరుణమప్సరసాం గణోఽయమ్"

నారాయణ మహర్షి ఊరువునుండి పుట్టిన ఊర్వశియను అప్సర కైలాస నాథుని సేవించి చెలికత్తెలతో తిరిగివచ్చుచుండ మార్గమధ్యమున రాక్షసులు చెరపట్టినారు. అందువలన రక్షించుడు రక్షించుడని అతి దీనముగా వారాక్రందించుచున్నారు.

అని సూత్రధారుడు తెరలోని ఆక్రందనను విని ఇది ఊర్వశి సఖురాండ్ర దీనాక్రందన యని తెలుపుచు, ఆక్రందించు అప్సర స్త్రీల రంగస్థల ప్రవేశమును సూచించుటవలన ఇది ప్రయోగాతిశయమను ప్రస్తావనాంశము.

3. అభిజ్ఞాన శాకుంతలము:

నటీ సూత్రధార సల్లాపము.

"మన ఎదుట సకల కళా కోవిదమగు పండిత పరిషత్తు నాటకము జూడ కూర్చొనియున్నది. కావున కాళిదాసు క్రొత్తగా కూర్చిన నాటకమును ప్రదర్శిం

తము" అని అనగా నటి నాట్య ప్రయోగము నందెంతయో ప్రౌఢిగడించిన మీకు చెప్పవలసినదేమి! అని అనును.

(ఇట 'సువిహిత ప్రయోగతయా ఆర్యస్య న కిమపి పరిహాపయిష్యతి' ప్రయోగ విజ్ఞానమున ఆరితేరిన మీకేవిధమైన కొరత ఉండదనునది నటీవాక్యము లోని వాచ్యార్థము. దుష్యంతుడు శకుంతలను గాంధర్వ విధిని చేపట్టిన పద్ధతి శాస్త్రీయము. అది కణ్వమహర్షి సమ్మతిని పొందజాలును అను కావ్యార్థమును సూచితమైనది. ఈ వాక్యమున ననేకార్థములు స్ఫురించుటవలన త్రిగతమను వీథ్యంగము) అని అనగా సూత్రధారుడు:-

"ఆపరితోషాత్ విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్
బలవదపి శిక్షితానామాత్మన్య ప్రత్యయం చేతః."

మనలో అభినయ చాకచక్యమెంతేని ఉండవచ్చును. పండిత పరిషత్తు మెచ్చుకొనుదాక ప్రయోగ విజ్ఞానము అనవద్యమనిపించుకొనదు. అభినయ విద్యాభ్యాస పాటవము గడించిన వారికైనను మనస్సు పరులు మెచ్చుకొనుదాక అవిశ్వసనీయముగనె యుండును. (అను వాక్యమునుబట్టి సూత్రధార పరముగా గాక కవి పరముగాను ఈ అర్థమును గ్రహింపవచ్చును. గురుకులమున క్లేశము బడసి సకల కళా కౌశలము నలవరచుకొని ప్రతిభాసామర్థ్యమున అనల్పకల్పనో దారముగా, హృద్యానవద్యముగా, శ్రేయస్కరముగా, ప్రేయస్కరముగా కావ్యములు వ్రాసిన వారికైనను గుణదోష గ్రహణ పారీణులగు పండితులు మెచ్చుదాక మనస్సు అవిశ్వసనీయముగానే యుండును, దీనివలన కవి తన యుదాత్తతను వ్యంగ్యముఖమున వెల్లడించినాడు. దుష్యంతుడు గాంధర్వ విధిన శకుంతలను చేపట్టిన విధానము శాస్త్ర సమ్మతమైనను కణ్వమహర్షి యంగీకారము తెలుపుదనుక శంకావహముగానే యుండునను కావ్యార్థము సూచితమైనది. కావున త్రిగతమను వీథ్యంగము ఈ శ్లోకమున సమన్వితమగునని రాఘవభట్టాదు లందురు.

(ఈ విధముగా కవి, కావ్య, ప్రేక్షక, నట ప్రశంస సంక్షేపముగా మార్చబడినది) అటు పిదప -

"సుభగసలిలావగాహాః పాటలసంసర్గసురభివనవాతాః
ప్రచ్ఛాయసులభనిద్రా దివసాః పరిణామరమణీయాః''

చక్కని జలమున అవగాహించి పాటల కుసుమ వాసనలను నింపుకొనిన పిల్లగాలుల సొగసులు కలిగి సులభముగా నిద్రవచ్చు చక్కని చెట్ల నీడలతో విరాజిల్లెడి ఈ నిదాఘ దినము లెంత పరిణామ పేశలముగా నున్నవి! (అని సూత్రధారుడు గ్రీష్మర్తు వైభవమును వర్ణించును. ఇది కాల ప్రశంస. దీనికి పూర్వము కొద్ది కాలముననే అరుదెంచి భోగార్హమగు గ్రీష్మ ఋతువును గురించి గానము చేయుమని సూత్రధారోక్తిలోని 'నాతిచిర' ప్రవృత్తి పదము వలన నాటకములోని నాయిక యౌవన దశ సూచితమైనది. 'ఉపభోగక్షమ' శబ్దము వలన ఆమె నాయకునకు అత్యంతోపాదేయురాలు అను అర్థము స్ఫురించు చున్నది. 'సలిలావగాహాః' పదము వలన అంగుళీయకము సరోవరములో జారి పడుటను తెలుపుచున్నది. శ్లోకములోని 'నిద్రా' పదము వలన దూర్వాసుని శాపము దాని మూలమున దుష్యంతునకు వ్యామోహమనునవి 'పరిణామ రమణీయాః, అనుటచే మారీచాశ్రమమున శకుంతలా దుష్యంతుల పునస్సమా గమమగునని సూచితమైనవి.) పిదప నటి గ్రీష్మ వైభవమును గూర్చి గానము చేయును.

''ఈషచ్చుంబితాని భ్రమరైః సుకుమారకేసరశిఖాని
అవతంసయంతి దయమానాః ప్రమదాశ్శిరీషకుసుమాని''

తుమ్మెదలు స్పృశించి స్పృశింపకయున్నవి. సుకుమార కింజల్కాగ్ర ములతో విలసిల్లెడి దిరిసెన పువ్వులను మత్తకాశినులు కర్ణాభరణములుగా ధరించుచున్నారు. (ఈ శ్లోకమున గ్రీష్మర్తులోని శిరీష కుసుమ కోమలతావలిత కామనీయకము వర్ణింపబడినది.)

**కావ్యార్థ సూచన** :- 'భ్రమరైః' ఈషచ్చుంబితాని అనుటవలన రూపక నాయికకు యౌవన విలాసములిప్పుడే కలుగుచున్నవని కావున ఆమె అప్రగల్భ యని, సుకుమార కేసర శిఖ శిరీష కుసుమ పదము వలన నాయిక అతి సుకుమారురాలని, పద్మినీ జాతి స్త్రీయని ఈ ఋతువులో శిరీష కుసుమమును మాత్రమే వర్ణించుటనుబట్టి లోకములోని సౌందర్యవతీ సృష్టిలోనే ఈమె సృష్టి యపూర్వ మనియు కావ్యార్థము సూచితమైనది.

పిదప సూత్రధారుడు "ఆర్యురాలా! చక్కగా పాడితివి. నీ పాట విని ప్రేక్షకలోకము చిత్ర లిఖితమైనది. నేనును-

"తవాస్మి గీతరాగేణ హారిణా ప్రసభం హృతః
ఏష రాజేవ దుష్యంతః సారంగేణాతిరంహసా"

సారంగముచే దుష్యంత మహారాజువోలె మనోజ్ఞమగు నీ గీతరాగముచే ఆకర్షింపబడితిని అని అనుసు.

ఈ వాక్యమున సూత్రధారుడు జింకను తరుముచున్న దుష్యంత పాత్ర రంగస్థలమున ప్రవేశించుటను సూచించుటచే ప్రయోగాతిశయమను ప్రస్తావనాంగము పిదప దుష్యంత పాత్ర ప్రవేశము జరుగును.

## భవభూతి కృతులు

**1. మాలతీ మాధవము:-** సూత్రధార సల్లాపము సూత్రధారోక్తి సకలలోక దీపకుడగు సూర్యుడదయించి సమయమెంతో గడచినది.

"కల్యాణానాం త్వమసి మహసాం భాజనం విశ్వమూర్తే
ధుర్యా లక్ష్మి మిహ మయి భృశం దేహి దేవ ప్రసీద
యద్యత్పాపం ప్రతిజహి జగన్నాథ నమ్రస్య తన్మే
భద్రం భద్రం వితర భగవన్ భూయసే మంగళాయ."

విశ్వమూర్తీ! నీవు క్షేమంకరములగు తేజస్సులకు నిధివి. సకల సౌఖ్యాపాదన క్షమమగు సంపద ప్రసాదించుము. కైమోడ్చి వేడుచున్న నా పాపములన్ని తొలగించి కల్యాణాభ్యుదయములు కటాక్షించుము.

(ఇందు కావ్యార్థ సూచన కలదు. కథానాయకుని, ఆతని మిత్రాదులయు అనిష్ట పరిహారము, ఇష్ట ప్రాప్తియు సూచితము. 'యద్యత్ పాపం' ఇత్యాదిచే అఘోరఘంట శార్దూలనందనాదు లొనరించిన ఉపద్రవము. 'భద్రం భద్రం' ఇత్యాదిచే మాలతీ మదయంతికా ప్రాప్తి 'భూయసే మంగళాయ' అనుటచే కపాలకుండల బంధనము నుండి మాలతి విడువబడుట, మాధవ మకరందుల ప్రాణరక్షణాదులు సూచింపబడినవి. సూర్యోదయవర్ణనకావున కాలప్రశంసచేయబడినది.) పిదప మారిషునితో నాట్యశాలలో మాంగళిక కర్మలు ముగిసినవి. కాలప్రియనాథుని ఉత్సవమున పాల్గొనదలచి పలు ప్రాంతముల వారరుదెంచినారు. ఇట్టి సమయమున అపూర్వ నాట్య ప్రదర్శన ద్వారా మమ్మానందపరచవలసినదని పండిత పరిషత్తాదేశించినది. కాని అట్టి అపూర్వ వస్తుకమగు రూపకమును ప్రద

ర్శింప మనము సిద్ధము కావలసినదని సూత్రధారుడనుటచే కాలప్రియనాథోత్సవ మనుదేశము నిర్దిష్టమగుట వలన దేశ ప్రశంస చేయబడినవి. తిరిగి ఆతడే-

"భూమ్నా రసానాం గహనాః ప్రయోగాః
సౌహార్ద హృద్యాని విచేష్టితాని
ఔద్ధత్య మాయోజిత కామసూత్రం
చిత్రాః కథా వాచి విదగ్ధతా చ."

శృంగారాది రసప్రాచుర్యముచే గంభీరమై, సౌహార్ద గుణభూషితుడగు నాయకునిచే నుదారమై, అడుగడుగున రౌద్ర బీభత్సాద్భుత సన్నివేశములు కలిగి వాగ్వైచిత్ర్యాంచితమునగు కథా సంవిధానముగల ప్రకరణము భవభూతి గ్రథితమైన మాలతీమాధనము దప్ప మరియొకటి లేదు. ఆ కవి ఎట్టి వాడనగా- దక్షిణా పథమున పద్మపురమను నగరము కలదు. ఆ పురమున ఎందరో పంక్తి పావనులు ఆహితాగ్నులు సోమయాజులు ఉదుంబరనామమున ఖ్యాతిబడసినవారు నగు బ్రహ్మవాదులు కలరు.

"తే శ్రోత్రియాస్తత్త్వ వినిశ్చయాయ
భూరిశ్రుతం శాశ్వతమాద్రియన్తే
ఇష్టాయ పూర్తాయ చ కర్మణేఽర్థాన్
దారా నపత్యాయ తపోర్థమాయుః."

వస్తుతత్త్వమును గ్రహింప బహుశాస్త్ర శ్రవణము చేయుదురు. ఇష్టాపూర్తముల ననుష్ఠింప ధనమును, సంతానావాప్తికై ధర్మదార గ్రహణము చేయుదురు. అట్టివారికులమున జనించిన భట్టగోపాలునకు పౌత్రుడు పుణ్యశ్లోకుడగు నీలకంఠునకు పౌత్రుడు న్యాయవ్యాకరణ మీమాంసాభిజ్ఞుడు భవభూతి యనుకవి మనయందలి సహజ సౌహార్దమున అపూర్వ సంవిధాన సుందరమగు మాలతీమాధవ రూపకమును ప్రయోగించుడని యొసగినాడు. (ఇట కాలప్రియ నాథుని ఉత్సవమనుటచే దేశప్రశంస. శృంగార రస భూయిష్ఠ వస్తుకమనుటచే రూపక ప్రశంస. దానిని రచించినవాడు సకలశాస్త్ర పారీణుడేకాక సదనుష్ఠా

తృవంశమున జనించిన వాడనుటచే కవి ప్రశంస చేయబడినది. ఆదేశించినందున సభ్యులు ప్రార్థకులు, నటులు ప్రార్థనీయులు.) ఆ కవియే:

"యేనామ కేచిదిహ నః ప్రథయంత్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే మమ న కోపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ."

నాపట్ల అవజ్ఞచూపువారు ఏ కొందరో లేకపోలేదు. మాత్సర్యోపహత బుద్ధులు, అజ్ఞులు, నా కావ్య సౌందర్యరహస్యములను గ్రహింపలేరు ఇట్టివారిని కూర్చికాదు నా కృతి. నా ఉద్దేశ్యము నా దృక్పథముగల పాఠకులు ఎక్కడనో ఎప్పుడో పుట్టకపోవుదురా! ఏలనన, కాలమా అనంతము. భూతలమా అఖండము. మరియు.

"గుణైస్సతాం న మమ కో గుణః ప్రఖ్యాపితో భవేత్
యథార్థనామా భగవాన్ యస్య జ్ఞాననిధిర్గురుః"
"యద్వే దాధ్యయనం తథోపనిషదాం సాంఖ్యస్య యోగస్య చ
జ్ఞానం తత్కథనేన కిం నహి తతః కశ్చిద్గుణో నాటకే
యత్ప్రౌఢత్వముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవం
తచ్చేదస్తి తతస్త దేవ గమకం పాండిత్యవైదగ్ధ్యయోః."

జ్ఞాననిధియను అన్వర్థనామముగల అస్మద్గురు చరణుల గుణములే నా గుణములు వెల్లడించును. (ఇది "అపరితోషాత్ విదుషామ్" అను కాళిదాసోక్తికి వెక్కిరింపు) అయిన, వేదాధ్యయనము కాని, వేదాంత పరిశీలన కాని కాపిల పాతంజలయోగ పరిజ్ఞానము కాని రూపకమునకు గౌరవమాపాదింపదు. ఉక్తిగత ప్రౌఢి విన్యాసగత ఔదార్యము, అర్థమును బట్టి గౌరవము అనునవియే కదా కావ్యమునకు గౌరవము కల్గించునవి? అవియే వేదశాస్త్రాది వ్యుత్పత్తి రూప పాండిత్యమునకు కవి కర్మ కర్మ నిర్వహణ దురీణ నైపుణ్యరూప వైదగ్ధ్యమునకు గమకములగును (శ్రోత్రియులు, వేదాంతులు, యోగులు తన కృతుల నేవగించి యుందురేమో, అందుకొరకే కావ్యగౌరవము కాని తదాస్వాదము కాని వేదాంతాది పరిజ్ఞానము వలన కలుగదని, అసలు వారికి కావ్యసౌందర్యమే తెలియదని అట్టివారిని గూర్చి వ్రాయలేదని కవి అధిక్షేపించి యుండును. కవి

ఔద్ధత్యమును ప్రదర్శించినాడు. "పరాపవాదాత్ స్వోత్కర్షవాదే తూద్ధత ఉచ్యతే" పరులను గర్హించుచు తన యుత్కర్షను చాటుకొను వా డుద్ధతుడు. పూర్వ శ్లోకములందు పరాపవాద స్వోత్కర్షలున్నందున కవి యుద్ధతుడని తాత్పర్యము.) రూపకమునకు సంబంధించిన పాత్రలను మనవారు గ్రహించి సిద్ధముగానున్నారు కామందకీ భూమికను నీవు, ఆమె శిష్యురాలగు అవలోకిత వేషమును నేను పరిగ్రహింపవలసియున్నదని నటుడనగా, ఇదిగో కామందకీ భూమికను దాల్చి ప్రవేశించుచున్నాను-అని సూత్రధారుడు, అవలోకితావేషమున నేనును రంగస్థలమును ప్రవేశించుచున్నానని నటుడు-ఇట్లు పరస్పరము సల్లాపింతురు. ఈ ఇరువురి సల్లాపము అవలోకితా కామందకీ పాత్రల ప్రవేశము సూచించుటచే ప్రయోగాతిశయము. పిదప అవలోకిత, కామందకి అనువారు ప్రవేశింతురు.

**2. మహావీరచరితము :**

నటసూత్రధార సల్లాపము

సూత్రధార వాక్యము:- "కాలప్రియనాథుని మహోత్సవ సందర్భమున ఆర్యమిశ్రు లిట్లు ఆదేశించినారు:

"మహాపురుష సంరంభో యత్ర గంభీరభీషణః
ప్రసన్నకర్కశా యత్ర విపులార్థా న భారతీ"
"అప్రాకృతేషు పాత్రేషు యత్ర వీరః స్థితో రసః
భేదై స్సూక్ష్మైరభివ్యక్తైః ప్రత్యాధారం విభజ్యతే"

ఏ రూపకమున గంభీరము, శత్రుభీకరమునగు మహానాయకుని ఇతివృత్తము గ్రథితమైనదో ప్రసన్నము, దీప్తికరము విపులార్థమునగు ఉక్తివైచిత్ర్యము ఎందు భాసించుచున్నదో అప్రాకృతమగు పాత్రలలో వీర రసము స్థూల సూక్ష్మ భేదమున ఆధారానుగుణమున పలు పాయల విస్తరిల్లి ప్రవహించునో అట్టి రూపకమును ప్రదర్శింపుమని ఆదేశించినారు. వారి దృష్టిలో ఈ లక్షణము గల రూపక మేదియైయుండును? ఆఁ! గుర్తు వచ్చినది. మహావీరచరితమునే ప్రయోగించుమని వారి ఆదేశము.

"వశ్యావాచః కవేర్వాక్యం
సా చ రామాశ్రయా కథా

లబ్ధశ్చ వాక్యనిష్యంద
నిష్పేష నికషో జనః"

కవియో వశ్యవాక్కు. ఉక్తియా పరమసుందరము. కథయా రామాశ్రయము. ప్రేక్షక పరిషత్తు వాక్యార్థతత్త్వ నిర్ణయమున నికషాయమాణమైనది. ఇట్టి గుణసంపద నాకు లభించినది. దీనిని గ్రథించిన వ్యక్తి ఎవరనగా, దక్షిణాపథమున పద్మపురము కలదు. అందు తైత్తిరీయులు, కాశ్యపగోత్రులు స్వశాఖా విఖ్యాతులు, పంక్తిపావనులు, సోమయాజులునగు బ్రహ్మవాదులు గలరు. వారిలో 'వాజిపేయయాజి' యను మహాకవికి ఐదవవాడు, పూజ్యభట్ట గోపాలునకు పౌత్రుడు, పుణ్యకీర్తియగు నీలకంఠునకు పుత్రుడు, శ్రీకంఠుడను జన్మనామము కలవాడు, పదవాక్యప్రమాణజ్ఞుడు, భవభూతి యను కవి గలడు. ఆతని తల్లి జాతుకర్ణి. మాకాతడు పరమమిత్రుడు. ఆతని గురువా సామాన్యుడు కాడు.

"శ్రేష్ఠః పరమహంసానాం మహర్షీణాం యథాంగిరాః
యదార్థనామా భగవాన్ యస్య జ్ఞాననిధిర్గురుః"

పరమహంసలగు మహర్షులలో అంగిరునివోలె జ్ఞాననిధి యను ఆతని గురువు నిక్కువముగా జ్ఞాననిధియే.

"తేనేదముద్ధృత జగత్త్రియ మన్యుమూల
మస్తోక వీరగురు సాహస మద్భుతం చ
వీరాద్భుతప్రియతయా రఘునందనస్య
ధర్మద్రుహో దమయితుశ్చరితం నిబద్ధమ్"

వీరాద్భుత ప్రేయస్సులకు నిలయము, ధర్మద్రోహులపాలిటి మృత్యువునైన శ్రీరామచంద్రుని పరమసాహసబంధురము, వీరరససుందరము, అద్భుత రసోద్గారమునగు వస్తువును గ్రహించి రూపకము నా కవియే కూర్చినాడు, ఆతడే.

ప్రాచేతసో మునివృషా ప్రథమః కవీనాం
యత్పావనం రఘుపతేః ప్రణినాయ వృత్తమ్
భక్తస్య తత్ర సమరం సతమేపివాచః
తత్ సుప్రసన్న మనసః కృతినో భజన్తామ్."

మహాకవి వాల్మీకి కులగురువు. మొట్టమొదట ఆతడే లోకమున పరమ పావనమగు రామచరితమును నిబంధించినాడు. ఆ చరిత్రమందలి భక్తియే నన్నీ రూపకమునకు పురిగొల్పినది. అవహితచేతస్కులు, గుణజ్ఞులు, ఈ నా కృతిని సేవింతురుగాక, అని చెప్పికొనినాడు. కాల ప్రియనాథుని ఉత్సవమనుట వలన దేశ నిర్దేశము. మహాపురుష సంరంభ ఇత్యాదిచే నాయక ప్రశంస. తత్కథా ప్రశంస దానిని కూర్చిన కవి ప్రశంసయు నొనరింపబడినవి. వాల్మీకిపట్ల కృతజ్ఞతయు గురువులపట్ల భక్తియు సూచితమైనవి. ఆదేశించుటవలన సభ్యులు ప్రార్థకులు. ప్రయోక్తలు ప్రార్థనీయులు. మనము ప్రదర్శించెడి రూపకమునకు సంబంధించిన కథా ప్రవేశము వినగోరుచున్నారీ సభాసదులని నటుని మాట గ్రహించి విశ్వామిత్రుడు యాగము చేయదలచి దశరథునివద్ద కరుదెంచి తపోవనమునకేగినాడు. అతడు-

"విజయిసహజ మస్త్రైర్వీర్య మచ్ఛాయయిష్యన్
జగదుపకృతబీజం మైథిలీం ప్రాపయిష్యన్
దశముఖ కలమాత శ్లాఘ్య కల్యాణ పాత్రం
ధనురనుజసహాయం రామదేవం నినాయ"

"నిమంత్రితస్తేన విదేహనాథః
సప్రాహిణోద్భ్రాతర మాత్తదీక్షః
కుశధ్వజో నామ స ఏష రాజా
సీతోర్మిళాభ్యాం సహితోభ్యుపైతి."

స్వభావతః విజయియగు శ్రీరాముని పరాక్రమమునకు దివ్యాస్త్రములచే వన్నె తెచ్చుటకై జగత్కల్యాణమునకు మూలకందమునగు సీతాదేవిని ఆతనితో ఘటించుటకై రావణకుల వినాశకునిగా తీర్చిదిద్దుటకునై లక్ష్మణునితోపాటు ధనురేక సహాయుడగు రాముని తన తపోవనమునకు తీసికొని వెళ్ళినాడు. ఆ మహర్షి తన యాగములో పాల్గొన జనకమహారాజు నాహ్వానించినాడు. జనకుడో తానొక పెద్ద యాగమును చేయ తలపెట్టినందున తన తమ్ముని కుశధ్వజుడను వానిని విశ్వామిత్రుని యాగమునకు పంపినాడు. కుశధ్వజుడు సీతోర్మిళలను వెంట తీసికొని ఇపుడే తపోవనమున కరుదెంచినాడు. (అని సూత్రధారుడు నుడివి, సీతోర్మిళలతో కుశధ్వజుని రంగస్థల ప్రవేశమును

సూచించుట ప్రయోగాతిశయమను ప్రస్తావనాంగము. పిదప సీతోర్మిళలు కుశ ధ్వజులు ప్రవేశింతురు.

**3. ఉత్తరరామచరితము :**

నట సూత్రధార సల్లాపము.

సూత్రధారోక్తి :- కాలప్రియ నాథుని మహోత్సవమున పాల్గొనిన ఆర్యమిశ్రులకు విన్నవించుచున్నాను. పూజ్యుడు శ్రీకంఠ పదలాఞ్ఛనుడు, పదవాక్య ప్రమాణ తత్త్వజ్ఞుడు. జాతుకర్ణి పుత్రుడు, భవభూతియని ప్రసిద్ధకవి యున్నాడనునది మీ రెరిగినదే.

"యం బ్రాహ్మణమియం దేవీ వాగ్వశ్యైవాన్వవర్తత
ఉత్తరం రామచరితం తత్ప్రణీతం ప్రయోక్ష్యతే."

వాగ్దేవత వశంవదయై బ్రహ్మనువలె ఎవనిని అనుసరించి యున్నదో, ఆ భవభూతియే ఉత్తర రామచరిత నాటకమును కూర్చినాడు. దానినే ప్రదర్శింతుము. (ఇట ప్రరోచన అతి సంక్షేపముగా కవి కూర్చినాడు. కాల ప్రియనాథుని ఉత్సవమనుటవలన దేశ నిర్దేశము ఆర్యమిశ్రులనుటచే పరిషత్ప్రశంస. బ్రహ్మ సాదృశ్యము వాణీసేవ్యత్వము కవి చెప్పికొనుటచే కవి ప్రశంస. మరియు కవి ప్రౌఢియు సూచింపబడినది. "యథోచిత నిజోత్కర్షవాదీ ప్రౌఢ ఇతీరితః." సందర్భోచితముగా తన ఉత్కర్షను వెల్లడించువాడు ప్రౌఢుడు. పై లక్షణమును బట్టి భవభూతి ప్రౌఢుడు. సూత్రధారుడే నాటకప్రదర్శనకు ననుమతింప సభవారిని కోరుటచే పారిషదులు ప్రార్థనీయులు. ప్రయోక్త ప్రార్థకుడు, కాలప్రశంసలేదు) నేనీ నాటకమును ప్రదర్శించు తలపున కొద్ది రోజుల క్రితమే ఈ నగరమునకు వచ్చినాడను. రావణకుల కాళరాత్రియైన శ్రీరాముల వారి పట్టాభిషేకోత్సవములు ముగిసినను పట్టణములో నింక ఆటపాటల వినోదము తగ్గలేదు. రాజసభా ప్రాంగణమున వంది మాగధుల స్తుతి పాఠము లుడిగినవేమని సూత్రధారు డనుకొనుచున్నంతలో నటుడు ప్రవేశించి :- బావా! లంకా సమరమున మిత్రులగు శాఖామృగ, నిశాచరులు మహారాజుగా రనుజ్ఞవడసి నిజ నివాసముల కేగినారు నానా దిగంతముర నుండి అరుదెంచిన బ్రహ్మర్షులు, రాజర్షులును పీఠోక్తులు పొంది వెళ్ళినారు. వారి వినోదమునకై ఇన్ని రోజు లుత్సవము జరిగినది.

"వసిష్ఠాధిష్ఠితా దేవ్యో గతా రామస్య మాతరః
అరుంధతీం పురస్కృత్య యజ్ఞే జామాతురాశ్రయమ్."

తన జామాతయగు ఋష్యశృంగుడు చేయు యాగమును సేవింపనై అరుంధతీ వసిష్ఠుల వెంట కౌసల్యాది రాజమాతలు వెళ్ళినారు.

"కన్యాం దశరథో రాజా శాంతా నామ వ్యజీజనత్
అపత్యకృతికాం రాజ్ఞే రోమపాదాయ యాం దదౌ"

పూర్వము దశరథులవారికి శాంతయను అమ్మాయి కలిగినది. ఆమెను పెంచుకొందుననగా దశరథులవారు రోమపాదులవారికి శాంతను పెంపుడు కూతురుగా నొసగినాడు.

విభాండకులవారి పుత్రుడగు ఋష్యశృంగుడు ఆ శాంతాదేవిని పరిణయ మాడినారు. ఆయన యాగము చేయుచు అహ్వానము పంపినారు. ఆ నిమంత్రణను పునస్కరించుకొని రాజమాతలు, నిండుచూలాలగుటచే కోడలగు సీతాదేవి నింటిపట్టుననే యుంచి వెళ్ళినారు— అని రాజభవన వృత్తాంతమును చెప్పును. కానిమ్ము. రాజద్వారమున కేగి మన కులాచారమును పాటింతము. మారిషా! వినుము-

"సర్వథా వ్యవహర్తవ్యం కుతో హ్యవచనీయతా
యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః."

ఎంత ఆలోచించి చూచినను కులవృత్తికి మించినది కనబడదు. నిందించెడివారు నిందింతురు. స్త్రీల పాతివ్రత్యమునందువలె వాగ్రచనల యందు దుష్టులు ఏవియో దోషముల నెన్నుచునే యుందురు. (నా కృతిలో ధ్వని సౌందర్యము, ఉక్తిమాధుర్యము ఎంత యున్నను మాత్సర్యోపహత బుద్ధులేవియో దోషములను చూపుదురని తన ఆవేదనను కవి తెలిపికొనినాడని మనము గ్రహింపవచ్చును) అని సూత్రధారుడు పలుక మారిషుడు- లేని దోషములను కల్పించువారిని అతి దుర్జను లనవలసినదే - ఏలనన-

"దేవ్యామపి హి వైదేహ్యాం సాపవాదో యతో జనః
రక్షోగృహస్థితిర్మూలమగ్ని శుద్ధౌ త్వనిశ్చయః."

ఆ దుష్టులు సీతామాతను గూర్చి సైతము నిందలాడ జొచ్చినారే, రావణుని ఇంట నుండుట కారణమట. అగ్నిశుద్ధిని తాము నమ్మరట - అని అనగా సూత్రధారుడు ఈ లోకాపవాద మా మహారాజు దాక సోకిన ఎంత కష్టము ఘటిల్లును? అయిన ఋషులు, దేవతలును శ్రేయస్సు కూర్చెదరు. కానిమ్ము మహారాజెక్కడ నున్నారో! ఏమీ?

"స్నేహాత్ సభాజయితు మేత్య దినాన్యమూని
సీతోత్సవేన జనకోద్య గతో విదేహాన్
దేవ్యాస్తతో విమనసః పరిసాంత్వనాయ
ధర్మాసనాద్విశతి వాసగృహం నరేంద్రః"

అల్లుని పట్టాభిషేకోత్సవములో పాల్గొని స్వసుతా జామాతలకు ప్రీతి కలుగ నిన్ని రోజులు గడిపి ఇవ్వేళనే జనకులవారు మిథిలానగరమునకు ఏగినారు. దిగులుగానున్న సీతాదేవికి ఊరట కలిగింప మహారాజుల వారు అస్థాన మంటపమునుండి అంతఃపురమున కేగినారని ప్రజ లనుకొనుచున్నారా? అని సూత్రధారుడు తెలిపి రంగస్థలమున సీతారామ పాత్రల ప్రవేశమును సూచించుటవలన ప్రయోగాతిశయము.

## హర్షవర్ధనుడు

ప్రియదర్శిక, నాగానందము, రత్నావళి యను మూడు రూపకములలో ప్రరోచన ఒకే విధముగా కలదు. 'వసంతోత్సవ సందర్భమున శ్రీహర్షదేవ పాదపద్మోప జీవులనేక ప్రాంతములకు చెందిన సామంతరాజులు నన్ను ప్రార్థించినారు. ఏమనగా, మా ప్రభువులు శ్రీహర్షదేవులు- అపూర్వ వస్తు రచనాలంకృతముగా ప్రియదర్శిక యను నాటికను, విద్యాధర జాతక ప్రతిబద్ధమగు నాగానంద నాటకమును, రత్నావళి యను నాటకమును నిర్మించినారను విషయము శ్రోత్ర పరంపరగా మా చెవిన బడినది. దానిని ప్రయోగింపగా చూడలేదు. సకల ప్రజారంజకుడగు ఆ మహారాజు నందలి గౌరవమున, మా యందలి అనుగ్రహమునను ప్రదర్శింపవలసినదిగా కోరుచున్నాము. అని రాజ లోకము వేడుటచే సూత్రధారుడు వేష రచనను ముగించుకొని సకల సామాజికుల చిత్తవృత్తులభినేయాభి ముఖమైనట్లున్నవని తలంతును. ఏలనన,

"శ్రీహర్షో నిపుణః కవిః పరిషదప్యేషా గుణగ్రాహిణీ
లోకే హారి చ వత్సరాజచరితం నాట్యే చ దక్షా వయమ్
వస్త్వేకైక మపీహ వాంఛిత ఫలప్రాప్తేః పదం కింపున
ర్మద్భాగ్యోపచయాదయం సముదిత స్సర్వో గుణానాం గణః"

'లోకే హారి చ బోధిసత్త్వచరితమ్' అని మాత్రము మార్చి మిగిలిన శ్లోకము నాగానందమున మార్చకయే ప్రియదర్శికలో నివేశింపబడినది.

శ్రీ హర్షుడా కవిలోక నిపుణుడు. పరిషత్తా గుణగ్రాహిణి. వత్సరాజు కథయా లోకరంజకమైనది. నటులమా నాట్య ప్రయోగమున దక్షత గడించి నారము. పూర్వోక్తములలో యొక్కొక్కటి వాంఛిత ఫల ప్రాప్తికి స్థానముగు చుండ నా యదృష్ట విశేషమున అన్నియు గుణములు కలిసి వచ్చినవని ప్రియ దర్శికలో. బోధిసత్త్వ చరితము లోక రంజకమని, నాగానందములో, వత్సరాజ చరితము లోక రంజకమైనదని రత్నావళిలో - అని శ్రీ హర్షోనిపుణః కవిః - యను శ్లోకము రూపకానుగుణముగ కూర్చబడినది. (ఈ శ్లోకమున సంక్షిప్త ముగా ప్రరోచన కలదు. కవి నైపుణ్యము, పరిషత్తు గుణజ్ఞత, నాయక లోక రంజకత్వము, నటుల ప్రయోగ నైష్ణాత్యము - అనునవి ప్రశంసింపబడినవి. వసంతోత్సవము వసంత ఋతువున జరుగును కావున కాల నిర్దేశము. ఆ ఉత్సవము హర్ష రాజధానిలో సర్వాంగ సుందరముగా నిర్వహింపబడుటనుబట్టి దేశ నిర్దేశము చేయబడినది. ప్రేక్షకులు ప్రార్థకులు. ప్రయోక్త ప్రార్థనీయుడు.) సూత్రధారుడు తెర వైపు చూచి "నేను ప్రస్తావించుచున్నంతనే నా యభి ప్రాయము నెరిగి మా నాన్నగా రంగదేశాధిపతియగు దృఢ వర్మ యొక్క అంతఃపుర కంచుకి భూమికను దాల్చి వచ్చుచున్నా"డని రంగస్థలమున ప్రయో గింపనున్న పాత్రను సూచించుటచే ప్రయోగాతిశయము. పిదప కంచుకి పాత్ర ప్రవేశించును.

**2. నాగానందము :**

సూత్రధారుడు ప్రియదర్శిక యందువలె ప్రరోచన గావించును. తిరిగి తన గృహమున ప్రవేశించినట్లు నటించి "ఆర్యురాలా!

"ద్విజపరిజన బంధుహితే మద్భవనతటాకహంసిమృదుశీలే
పరపురుషచంద్రకమలిన్యార్యే కార్యాదితస్తావత్"

బ్రాహ్మణుల పట్ల, సేవకుల పట్ల, బంధువుల పట్ల హితబుద్ధి కలదానా! నా అగార కాసారమునకు హంసివైనదానా! మృదుశీలురాలా! పద్మిని చంద్ర దర్శనమువోలె, పర పురుష దర్శనమున ముకుళీభూత ముఖారవిందమైనదానా! అత్యవసరమైన పని కలదు. ఇటు రమ్ము!" అనగా నటి ప్రవేశించి, "ఇదిగో అరుదెంచినాను, సెలవీయుడు" అని అనును. "ఆర్యురాలా! నాగానందము ప్రదర్శించు సమయమున నీకి విషాదమేల" యనగా - "అత్తమామలు తమ వార్ధక్యమును దలంచి నిర్వేదము పొడసూప కుటుంబ భారమును మీపైన మోపి తపోవనమున కేగినారు. అదియే నా విషాదము" (ఈ వాక్యమువలన జీమూత వాహనుని తల్లిదండ్రులు జీమూత వాహనునిపై రాజ్య భారము మోపి తపోవనమున కేగినారని కావ్యాంశము సూచితమైనది) అని నటి పలుక సూత్రధారుడు వైరాగ్యమున "నా తల్లిదండ్రులు నన్ను విడిచి తపోవనమున కేగినారా? ఇవుడేమి చేయుదును? మాతా పితృ పరిచర్యా సుఖము విడనాడి గృహమున నెట్లుందును?

"విధాతుం పితృశుశ్రూషాం త్యక్త్వైశ్వర్యం క్రమాగతమ్
వనం యామ్యహమద్యైవ యథా జీమూతవాహనః"

'వంశ పరంపరగా వచ్చెడి ఐశ్వర్యమును విడనాడి పితృ శుశ్రూష నొనరింప జీమూతవాహనుడు తపోవనమున కేగిన విధమున నేను అట్లే యొన రింతును' అని సూత్రధారుడుపమాన పురస్సరముగా జీమూతవాహనుని గ్రహించి ఆతని రంగస్థల ప్రవేశమును సూచించుటచే ప్రయోగాతిశయము.

3. రత్నావళి :

"ఆ రెండు కృతులయందువలె నాగానందమున ప్రరోచన తథా విధముగ కలదు. నటిని పిలిచి రత్నావళి నాటిక నవలోకింప రాజు లోక మెదురు చూచు చున్నది. వేష రచన గావింపుము" అనగా నటి నిట్టూర్పులు నిగుడించుచు "ఆర్య పుత్రా! నీ చింత తొలగినది. కావున ఏ విధముగనైనను నృత్యము చేసెదవు. కాని దురదృష్టవతిని నేను. ఆ ఒక్క కూతురును ఎక్కడనో దూర దేశమున వ్యక్తికి ధారవోయ జూచుచున్నావు. అంత దూరమున నున్న వానితో మన పిల్ల కెట్లు వివాహము జరుగునో తోచుటలేదు" అనుచున్నంతలో సూత్రధారుడు దూర దేశస్థుడను దిగులు తగదు. చూడు!

"ద్వీపాదన్యస్మాదపి మధ్యాదపి జలనిధేర్దిశోప్యంతాత్
ఆనీయ ఝటితి ఘటయతి విధిరభిమత మభిముఖీ భూతః."

దైవము తలపోసినచో ఇతర ద్వీపమునుండి కాని లేదా సాగర మధ్యము నుండి కాని లేదా దిగంతమునుండి కాని కూర్చదలచిన దానిని తీసికొని వచ్చి కూర్చును. దైవ మనుకూలపడినపుడు ఇట్లు జరుగుట ఆశ్చర్యమేమీ కాదు. (రత్నావళి పడవ నధిష్ఠించి వచ్చుచుండ సాగరములో మునుగుట అటు పిదప చేటికాసాహాయ్యమున దైవానుకూల్యమున వత్సరాజు సన్నిధిని చేరుట అను కావ్యాంశము సూచితము.)

(తెరలో)— బాగు! భరతపుత్రా బాగు! నీవు పలికినది వాస్తవము అని పై శ్లోకము చదువబడును. సూత్రదారుడాలకించి "అర్యులారా! అపుడే నా చిన్న తమ్ముడు యౌగంధరాయణ భూమికను దాల్చి వచ్చు చున్నాడు. కాన మనము మన వేషములను ధరింతము" సూత్రధారుని వాక్యార్థమును గ్రహించి యౌగంధ రాయణ పాత్ర "ద్వీపాదన్యస్మాత్" అను శ్లోకమును పఠించుచు రంగ స్థలమున ప్రవేశించును. కావున ఇది కథోద్ఘాతమను ప్రస్తావనాంగము.

మృచ్ఛకటికము :- నటీ సూత్రధార సంలాపము,

సూత్రధారోక్తి :- పరిషత్తు వారి కుతూహలమునకు భంగమును ఆపాదించు ప్రసంగమేల? ఆర్య మిశ్రులకు నమస్కరించి విన్నవించుచున్నాము. మేము మృచ్ఛకటికమను ప్రకరణమును ప్రయోగింపదొరకొనినాము. ఈ ప్రకరణ కర్త-

"ద్విరదేంద్రగతిః చకోరనేత్రః పరిపూర్ణేందుముఖస్సువిగ్రహశ్చ
ద్విజముఖ్యతమః కవిర్బభూవ ప్రథితః శూద్రక ఇత్యగాధ సత్త్వః"

సింహగమనుడు, చకోరలోచనుడు, పూర్ణచంద్రాననుడు, ద్విజోత్త ముడునైన శూద్రకుడను ప్రసిద్ధ కవి మరియు-

"ఋగ్వేదం సామవేదం గణిత మథ కలాం వైశికీం హస్తిశిక్షాం
జ్ఞాత్వా శర్వప్రసాదాత్ వ్యపగతతిమిరే చక్షుషీ చోపలభ్య
రాజానం వీక్ష్య పుత్రం పరమ సదుదయేనాశ్వమేధేన చేష్ట్వా
లబ్ధ్వా చాయుశ్శతాబ్దం దశదినసహితం శూద్రకోగ్నిం ప్రవిష్టః."

ఋక్సామ వేదములను, గణితమును, వేశ్యాకలాపమును, గజశాస్త్రము నెరిగినవాడు. ఈశ్వరానుగ్రహ విశేషమున పారమార్థిక జ్ఞానము బడిసినవాడు. సర్వస్వాంతమను జీవన యాగమునందు తన నూరేండ్ల ఆయుష్షును వెచ్చించిన వాడు. ఇంతేకాదు-

"సమరవ్యసనీ ప్రమాదశూన్యః కకుదం వేదవిదాం తపోధన శ్చ
పరవారణబాహుయుద్ధలుబ్ధః క్షితిపాలః కిల శూద్రకో బభూవ."

రణకోవిదుడు, ప్రమాదమన్నమాట ఎరుగనివాడు, వేదవిదగ్రేసరుడు, పరవారణముల మదమణచినవాడు. బహుయుద్ధప్రవీణు డాతడు ఆ శూద్రక క్షితిపాలుడు రచించిన మృచ్ఛకటిక ప్రకరణములోని నాయకు డెట్టివాడనిన :

"అవంతి పుర్యాం ద్విజసార్థవాహో యువా దరిద్రః కిల చారుదత్తః
గుణానురక్తా గణికా చ యస్య వసంత శోభేవ వసంతసేనా
తయోరిదం సత్సురతో త్సవాశ్రయం నయప్రచారం వ్యవహారదుష్టతామ్
ఖలస్వభావం భవితవ్యతాం తథా చకార సర్వం కిల శూద్రకో నృపః"

అవంతీ నగరమున చారుదత్తుడని బాపని బేపారి యున్నాడు. ఆతడు యువకుడు. అతిదానమువలన దరిద్రుడైనాడు. వసంతశోభవలెనున్న వసంతసేన యను గణిక ఆతని యందు గుణానురక్తయైనది. ఆ ఇరువురి కలయికకు చెందిన ఇతివృత్తమును నీతిపూర్ణముగా అడుగడుగున దుర్జన స్వభావము వ్యవహార దుష్టత విధివిలాసములను వానిని నిగుడించుచు ఈ ప్రకరణమును శూద్రకుడు కూర్చినాడు. (ఇందు దేశ కాల నిర్దేశము చేయబడలేదు. కేవలము కవియొక్క గొప్పతనము విపులముగా ప్రశంసింపబడినది. ప్రయోక్తయే 'ప్రకరణమును ప్రదర్శించుచున్నాము, ఆదరింపవలసినదని' కోరుటవలన ప్రేక్షకులు ప్రార్థనీయులు. ప్రయోక్త ప్రార్థకుడు.) పిదప ఆతడే 'ఏమి! ఈ వేళ సంగీతశాల మూగవోయినది? కుశీలవులెటు వెళ్లి యుందురు? గ్రహించితిని.

"శూన్యమపుత్రస్య గృహం చిరశూన్యం నాస్తి యస్య సన్మిత్రమ్
మూర్ఖస్య దిశః శూన్యాస్సర్వం శూన్యం దరిద్రస్య."

పుత్రహీనుని గృహము శూన్యము. మిత్రరహితునకు కాలము శూన్యము. (ఎవరు సరుకు గొనరు.) మూర్ఖులకు సర్వదిక్కులు శూన్యము. దరిద్రునకో అంతయు శూన్యమే యగును. ఈ సంగీతోపాసనా మూలమున ఎండాకాలము నందు ప్రచండాతపమున కెండిపోయిన పద్మ బీజమువోలె ఆకలికి నా కనులు కటపెటలాడుచున్నవి. ఏమైన సద్దియున్నదేమొ? ఇంటి దానినడిగెద. ఏమీ! మా యింటిలో ఏదో క్రొత్త ప్రబంధము జరుగుచున్నది. ఒకతె గంధము తీయుచున్నది. వేరొకతె తండులాది సంభారము సమకూర్చుచున్నది. ఏమైన పూర్వులు పాతిపెట్టిన నిక్షేపము లభించియుండవచ్చును. ఆకలిగొన్న నాకు జీవలోకమంతా యన్నమయముగా అగుపడుచున్నదా? ఇంటిలో సద్దికూడైనా దొరకదేమో? ఆకలి ప్రాణములను తీయుచున్నది. ఇంటిలో ఈ క్రొత్త ఏర్పాట్లకు కారణమేమని ఇంటిదాని నడిగెద. ఆర్యురాలా! ఇటు రమ్ము. ఏమైన తినుటకున్నదా?" "ఆర్యా! అన్ని యున్నవి. చక్కని పొంగలి నెయ్యి, పెరుగు, కలమాన్నము, రసాయనము ఇదియది యననేల" అని నటి యనును. సూత్ర :- నిజముగా ఇవన్నియున్నవా, ఎగతాళికంటున్నావా? నటి:- ఇవన్నియు ఆపణములోనున్నవి. ఎగతాలికంటిని. అయినను, ఇవ్వేళ ఉపవాస దినమని నీ మిత్రుడు చూర్ణవృద్ధుడు చెప్పినాడు. సూత్ర :- అట్టులయిన ఈ ఉపవాస దినమున మనకు తగిన బ్రాహ్మణుని నిమంత్రించెద. ఈ విశాలోజ్జయినీ నగరమున నాబోటి బ్రాహ్మణులను వెదకవలసి వచ్చుచున్నది. ఏమి! ఇదిగో చారుదత్తుని మిత్రుడు మైత్రేయుడు ఈవైపే వచ్చుచున్నాడు. అడిగెద. "అయ్యా, మొదలే రానని చెప్పినాను, మాటి మాటికేల నిర్బంధింతువు" అని తెరలో వినబడును. కానిమ్ము మరియొక బ్రాహ్మణుని నిమంత్రింతునని-సూత్రధారుడు నిష్క్రమించును. ఈ సూత్రధార వాక్యము రంగ స్థలమున మైత్రేయ పాత్రప్రవేశమును సూచించుటచే ప్రయోగాతిశయము.

ముద్రారాక్షసము :-

నటీ సూత్రధార సల్లాపము.

సూత్రధారోక్తి :- సామంత నటేశ్వరదత్తుని పౌత్రుడు, మహారాజ పదవి నధిష్ఠించిన పృథువుగారి పుత్రుడు. విశాఖదత్తుడను కవి వ్రాసిన ముద్రా రాక్షస నాటకమును ప్రదర్శింపవలసినదని పరిషత్తువారాదేశించినారు. కావ్యమందల్లి గుణ

దోషముల నెరిగిన పరిషత్తువారి సమక్షమున నాటక ప్రదర్శన చేయుచున్న నాకు ఎంతయో ఆనందము కలుగుచున్నది.

"చీయతే బాలిశస్యాపి సుక్షేత్రపతితా కృషిః
న శాలేః స్తంబకరితా వప్తుర్గుణ మపేక్షతే."

కృషి పరిజ్ఞానము లేనివారి కృషి సత్ క్షేత్రమున జరిగినచో అది ఫలవంతమే యగును. ధాన్యము గొలుసు పట్టుటయనునది విత్తినవాని గొప్పతనము నపేక్షింపదు. క్షేత్రసారమే కదా సస్యవృద్ధికి కారణము! (నాట్య ప్రయోగ చాకచక్యము లేకున్నను కావ్యగుణజ్ఞమగు పరిషత్తుముందు నాట్య ప్రయోగము సఫలమే యగునని సూత్రధారపరముగా అర్థము). కావున గృహమునకేగి గృహిణిని పిలిచి సంగీతక మనుష్ఠింతును. ఏమీ, నేడు మా యింటిలో ఏదో పండుగ వేడుకయున్నట్లున్నది. పరిజనము తమ తమ పనులను నెరవేర్చుచున్నది.

"వహతి జలమియం పినష్టి గంధానియమియ ముద్గ్రథతే స్రజో విచిత్రాః
ముసలమిదమియం చ పాతకాలే ముహురనుయాతికలేన హుంకృతేన."

ఒకతె నీరు దెచ్చుచున్నది. వేరొకతె గంధము తీయుచున్నది. మరియొకతె పూలదండ లల్లుచున్నది. ఇంకొకతె హుమ్మని దంచుచున్నది. కానిమ్ము, గృహిణిని పిలిచి యడిగెద.

"గుణవత్యుపాయనిలయే స్థితిహేతో సాధికే త్రివర్గస్య
మద్భవననీతివిద్యే కార్యా దార్యే ద్రుతముపైహి."

గుణవతీ! కుటుంబ నిర్వహణోపాయములకు గనివైనదానా! సంసార స్థితికి మూలమా! ధర్మార్థకామములకు అవలంబనమా! నా గృహ రాజ్యమునకు నీతివిద్యయైనదానా! ఆర్యురాలా! ఇటు రమ్ము.

(ఇందు కావ్యార్థము సూచితమైనది. చాణక్య నీతి పరముగా సమన్వయము. సంధి విగ్రహయానాది గుణములు కలదానా! రాజ్య స్థితికి మూలమైనదానా! క్షయ స్థాన వృద్ధి రూప త్రివర్గమునకు సాధకమైనదానా! ఓ కౌటిల్య నీతి విద్యా! ఈ నాటకము నిర్వహింపనున్న మమ్మావహింపుము. అని కావ్య పరముగా అర్థము). (ఋతుపరమైన అర్థము- నాటకములోని తృతీయాంకమున శరదృతువు

వర్ణింపబడుటచే వీర రస ప్రధాన రూపకములలో శరదృతు గాన మావశ్యక మగుటచే తత్పరముగాను అర్థము సూచితమగుచున్నది. జలస్వచ్ఛత, ఆకాశ నిర్మలత దిక్ప్రసన్నత మున్నగు గుణములు కలదానా! ధాన్యాద్యుపచయ రూపమున జీవన స్థితికి హేతువైనదానా! సర్వులకు ధర్మార్థ కామముల నీడేర్చు దానా! ఓ శరదృతూ! భువనము (మాత్రాచ్యుతకము భవనము అనుదానికి ఆవహింపుము- అని శరత్పర మగు అర్థము. ఇట కవి కార్య ప్రశంస సామాన్య ముగా చేయబడినది. కావ్య విశేష వేదిని యని పరిషత్తు ప్రశంసింపబడినది. భంగ్యంతరముగా సూత్రధారోత్కర్షయు చాటబడినది. శరదృతు వర్ణన అభివ్యక్తమగుట కాలనిర్దేశము కలదు. దేశ నిర్దేశము లేదు. సామాజికులు ప్రార్థకులు, ప్రయోక్త ప్రార్థనీయుడు.

నటి ప్రవేశించి సెలవీయుడనును. ఆజ్ఞ అను మాట అటుండ నిమ్ము. బ్రాహ్మణ సమారాధనకు నిమిత్తమేమి? ఇంటిలో విశేషముగా వంటలు జరుగు చున్నవి. నటి :- నేడు చంద్రగ్రహణమట. పట్టణవాసు లనుకొనుచున్నారు. అందుకొరకే సమారాధన ఏర్పరచినాను. సూత్ర :- బ్రాహ్మణ సమారాధన కావలసినదే. కానీ ఎవడో చంద్రగ్రహణమని మోసపుచ్చినాడు. అరువదినాలు గంగములలో విస్తృతమైన జ్యోతిశ్శాస్త్రమున ఎంతో పరిశ్రమ చేసినాను. చూడుము.

"క్రూరగ్రహః సకేతు శ్చంద్రమసం పూర్ణమండలమిదానీమ్
అభి భవతు మిచ్ఛతి బలాత్
రక్ష్యత్యేనం తు బుధయోగః"

"క్రూరమగు రాహుగ్రహము పూర్ణమండలుడగు చంద్రునిని గ్రసింప బూనుచున్నది." అని అనుచున్నంతనే (తెరలో) — "ఎవడురా వాడు! నేనుండగా చంద్రుని కబళించ చూచువాడు?" అను మాట వినిపించును. "రక్షత్యేనం తు బుధయోగః" - బుధగ్రహ ప్రభావము రాహు గ్రాసము జరుగకుండ చంద్రుని రక్షించుచున్నదని ప్రకృతార్థము. మలయకేతువు కూడి దుష్ట రాక్షసుడు ప్రకృతి మండలము యొక్క సంపూర్ణానురాగమును చూరగొనిన చంద్రగుప్తునకు కీడొనరింప జూచుచున్నాడను అర్థమును తెరలోని పాత్ర గ్రహించినదని తాత్పర్యము. అందుకొరకే బుధుడని ఆర్య చాణక్యుల యోగము. ఆ అపాయము

రాకుండ చంద్రగుప్తుని కాపాడుచున్నదను అర్థము వచ్చునట్లు రక్షత్యేనంతు "బుధయోగః" అను రీతి పదసంధానము చేయబడినదను భావము) నటి :- ఆర్యా! తాను నేలపై నిలచి ఆకాశములో చంద్ర గ్రహణము కలుగకుండ ఎవరో నివారింప జూచుచున్నారు. ఎవరు కావచ్చు? సూత్ర :- నేను కూడ గ్రహింపలే కున్నాను. మరొకసారి చదివెద. తిరిగి 'ఎవడురా వాడ'ను మాటలు వినిపించును. ఆతడెవరో కాదు - కౌటిల్యుడు.

"కౌటిల్యః కుటిలమతిస్స ఏష యేన
క్రోధాగ్నౌ ప్రసభమదాహి నందవంశః
చంద్రస్య గ్రహణమితి శ్రుతేస్సనామ్నో
మౌర్యేందోర్ద్విషదభియోగ ఇత్యవైతి."

తన కోపాగ్నిలో నందవంశమును ఎవరూహించని విధముగా బూదిచేసిన గహనశేముషీకుడాతడు. ఒకే నామముండుట వలన చంద్రగ్రహణ పదమునకు మౌర్య చంద్రగుప్తుడను అర్థము నూహించి ఇట్లనినాడు. ఇక మనముండరాదు. వెళ్లుదము." (సూత్రధారుని "క్రూర గ్రహః" అను శ్లోకములోని అర్థమును గ్రహించి చాణక్య పాత్ర రంగస్థల ప్రవేశము చేయుచున్నది. కావున ఇది కథోద్ఘాతము. విశ్వనాథమతానుసారము ఉద్ఘాత్యకము.)

**వేణీ సంహారము**

నటీసూత్రధార సల్లాపము.

సూత్రధారోక్తి :- అధిక ప్రసంగము చాలు.

"శ్రవణాంజలిపుట పేయం విరచితవాన్ భారతాఖ్యమమృతం యః
తమహమరాగమకృష్ణం కృష్ణద్వైపాయనం వందే"

శ్రవణాంజలి పుట పేయముగా మహాభారతామృతమును సమకూర్చిన మహానుభావుడు. తృష్ణారాగ శూన్యుడునగు ఆ వేద వ్యాసునకు నా నమస్కారము.

సభాసద గ్రేసరులకు నా విన్నపమొకటి కలదు.

"కుసుమాంజలిరపర ఇవ ప్రకీర్యతే కావ్యబంధ ఏషోత్ర
మధులిహ ఇవ మధుబిందూన్ విరలానపి భజత గుణలేశాన్."

వేరే మరియొక పుష్పాంజలిగా మీకీ కావ్య బంధము నర్పించుచున్నాను. తుమ్మెదలు కొద్దిపాటి తేనె చుక్కలను వోలె ఈ మా ప్రయోగములోని గుణ లేశములను గ్రహించుడు. ప్రకృతము మృగరాజ లాంఛనుడైన భట్టనారాయణుని వేణీ సంహారమను నాటకమును ప్రయోగింప బూనినాము. కవి పరిశ్రమ విశేషముననేమి, అభినవ నాటక ప్రయోగ కుతూహలముననేమి, మీరు సావధాన చిత్తులై చూడవలసినది. (తెరలో - బాబూ! త్వరపడు, విదురులవారి ఆదేశానుసారము శైలూష జనమును హెచ్చరించుచున్నారు. పారాశర్యాది మహర్షులతో భరతవంశ క్షేమము నాశించి వామదేవుడు, మహారాజు దుర్యోధనుని నిలయమునకు రాయబారిగా వచ్చువేళయైనది. ఆతోద్యక్రమమును పాటింపుడు) విని" ఔరా! సకలలోక సృష్టి, స్థితి, లయకారకుడగు భగవానుడొక్క భరతకులమునకే కాదు-సమస్త రాజలోకమునకు క్షేమముగూర్చ నుద్యమించినాడు." (తెరలో-పారిపార్శ్వకా! కుశీలవులతో కూడి సంగీతమనుష్ఠింపవేమి!) పారి:—కానిమ్ము. సంగీతమనుష్ఠింతును. ఏ సమయమునుద్దేశించి గానము చేయుదును?

సూత్ర:- "కాశాది కుసుమములకు, చంద్ర చంద్రాతపములకు, నక్షత్ర కలహంసములకు వికాసోల్లాసములను కలిగించు ఈ శరత్సమయమును గూర్చియే గానము చేయవలెను. చూడుము.

"సత్పక్షా మధురగిరః ప్రసాధితాశా మదోద్ధతారంభాః
నిపతంతి ధార్తరాష్ట్రాః కాలవశాన్మేదినీపృష్ఠే."

చక్కని ఱెక్కలు, తీయని మాటలు, క్రైపెక్కిన ప్రచారము కలిగిన ధార్తరాష్ట్ర పక్షులు దిక్కుల నలంకరించుచు మానస సరోవరమునుండి ఈ శరత్ప్రభావమున వ్రాలుచున్నవి.

కావ్యార్థసూచన :- ప్రబలసేనలు కలవారు, మదోద్ధతారంభులు, తమ బలముచే దిగంతములు కైవసము చేసికొనిన కౌరవులు కాలము మూడుటచే నేలపై కొరుగుచున్నాను.

పారి:- బావా! పాపము శమించుత! అమంగళము ప్రతిహతమగుత.

సూత్ర:- మారిషా! శరద్వర్ణన ప్రశంస కావున హంసలను ధార్తరాష్ట్రులన్నాను.

పారి:- బావా! అమంగళోక్తిచే నా హృదయము ఇప్పటికిని కంపించు చున్నది. (ఇష్టదేవతాస్తుతి పిదప వేదవ్యాసస్తుతి సామాన్యముగా కవి నాటక పరిషత్ప్రశంస, కవి కాలనామనిర్దేశము చేయబడినది. శరదృతుగానమున కావ్యార్థము సూచించబడినది. దేశ నిర్దేశము లేదు.)

సూత్ర:- మారిషా! సాక్షాత్తుగా భగవానుడు సంధి యొనరింప అమంగళములన్నియు కొట్టుబడకుండనా? చూడుము.

"నిర్వాణ వైరదహనాః ప్రశమాదరీణాం
నందంతు పాండుతనయాస్సహ మాధవేన
రక్తప్రసాదితభువః క్షతవిగ్రహాశ్చ
స్వస్థా భవంతు కురురాజసుతాః సభృత్యాః."

వైరాగ్ని చల్లారి శాత్రవ ముడగుటవలన పాండుపుత్రులు వాసుదేవునితో కలసి ఆనందింతురుగాత! అనురక్తులయిన జనులను రంజింప జేయుచు యుద్ధ ముడిగినందున భృత్యులతోపాటు కౌరవులును స్వస్థులగుదురుగాత!

(ఇట కావ్యార్థ సూచన :- తమ శరీరములు ఖడ్గ ప్రహారములకు గురియై తమ రక్త ప్రవాహము భూమిని తడిపి వేయుచుండ భటులతో పాటు కౌరవులు స్వర్గస్థులగుదురు గాక! అని కావ్యార్థము. నిరుపద్రవులగుదురుగాక యను అర్థమును గ్రహించి తెరలోని పాత్ర ఇట్లధిక్షేపించుచున్నది):

దురాత్మా మృషామంగళపాఠకా! శైలూషాధమా!

"లాక్షాగృహానలవిషాన్న సభాప్రవేశైః
ప్రాణేషు విత్తనిచయేషు చ నః ప్రహృత్య
ఆకృష్ట పాండవ వధూపరిధానకేశాః
స్వస్థా భవంతి మయి జీవతి ధార్తరాష్ట్రాః"

లక్క ఇంట నిప్పు పెట్టి, విషాన్నమిడి. సభకీడ్చి, అన్యాయముగా మా సర్వస్వమును కొల్లగొట్టి మా ప్రాణములతో చెలమాడుటయే గాక నిండు సభలో పాండవ వధూకేశాంబరములనూడ్చిన కౌరవులా - నేను జీవించియుండ స్వస్థులగుట?!

సూత్ర :- వాసుదేవుడు రాయబారిగా వెళ్ళినాడను వార్త విని కోపోద్దీపిత మానసుడై భీముడు సహదేవునితో ఈ వైపే వచ్చుచున్నాడు. అతని ముందు మనము నిలువరాదు. నిష్క్రమింతము. (ఇట సూత్రధారుని మాటలోని అర్థమును గ్రహించి భీమపాత్ర రంగస్థలమున ప్రవేశించుటనుబట్టి ఇది కథోద్ఘాతమను ప్రస్తావనాంగము.)

**ఆశ్చర్యచూడామణి**

నటీ సూత్రధార సల్లాపము :—

సూత్ర :- ఆర్యురాలా!

"అభిరంజనీం జనానాం సహాయసాధ్యాం గురూపదేశేన
ధురముద్వహామి గుర్వీం నృప ఇవ భరతాదిభిర్వ్యూఢామ్"

సకల జనామోదకరము, గురూవదేశసాధ్యము, సహాయ సంపాద్యము, దుర్భరమునగు ఈ నాట్య విద్యను భరతాదులచే నిర్వ్యూఢమైన భూమిని ఈ రాజువలె నిర్వహించుచున్నాను. గురుశిక్షా పాటవము సహనట సంపద, నిరంతరాభ్యాసము నాట్యసిద్ధికి మూలము. అది నిర్వహింపబడుట లోక పరిపాలనవలె కష్ట సాధ్యము. (ఇట కావ్య వస్తువు సూచితమైనది. శ్రీరాము డగస్త్యాది గురూపదేశముద్వార సర్వరాక్షస వధరూపము, మహోత్సాహ సేతుబంధాది క్రియా కలాపముచే గౌరవాస్పదము, సుగ్రీవాది సహాయ సంపదచే సాధ్యము, జగద్రక్షణ మూలమున సర్వజనానురంజనము — అగు రావణవధ రూప కార్యమును నిర్వహించి భరతుడు పాదుకా ప్రాతినిధ్యమున పరిపాలించెడి భూభారమును తిరిగి నిర్వహించుచున్నాడను కావ్యార్థము సూచితమైనది.)

నటి :- ఆర్యా! మీ ఆకారమే ఈ గొప్ప అధికారమును వెల్లడించుచున్నది.

సూత్ర :- అసాధారణమగు ఈ పద్ధతి యందరకు నలవడదు. లోకోత్కృష్టము, వీరాద్భుతాది రస నిష్యందమునగు ఈ నాటకమును ప్రదర్శించుట సామాన్యులకు తరము కాదని భావము.

నటి :- ఆర్యా! అసాధారణమనియెదరేమి?

సూత్ర :- ఆర్యురాల! దక్షిణ ప్రాంతము నుండి వచ్చిన ఆశ్చర్య చూడామణి నాటకమును చదివినాము. దానిని ప్రదర్శింప చూడవలెనను కోరిక కలదు. ఆ కోరిక నీడేర్చుమని సభవారు కోరుచున్నారు.

నటి :- ఆర్యా! ఎంత అసంబద్ధము? దక్షిణ ప్రాంతమునుండి నాటకము నిర్మితమై వచ్చుట ఎంత అసంబద్ధము? ఆకాశమున పుష్పోత్పత్తి, ఇసుమున తైలము పుట్టుట వంటిదే యగును.

సూత్ర :- అట్లు భావింపవలదు. గుణములను గ్రహించి, ప్రాంతీయ దురభిమానమును విసర్జింపుము. గుణములే ప్రమాణమగును. దిగ్దేశకాలములు కావ్య గౌరవమునకు ప్రమాణములు కావు.

నటి :- వాస్తవమె. ఆ దేశము రత్నాకరము. ఈ నాటక వ్యాజమున తన ప్రజ్ఞామూర్తినీ దేశాంతరములకు పంపించిన మహానుభావు డెవరు?

సూత్ర :- ఆర్యురాల! ఉన్మాదవాసవదత్తాది బహు ప్రబంధములు నిర్మించిన శక్తిభద్రుడను కవి ప్రజ్ఞావిలసితముగా ఈ నాటకమును కూర్చినాడు. నీ భూమిక నీవు దాల్చుము. నేనును ఆర్యమిశ్రులకు విన్నవింతును. ఏమీ! విన్న వించుటకు పూనుకొనినంతనే ఏదో శబ్దము వినవచ్చుచున్నది. (తెరలో ధనుష్టం కారము) తెలిసినది.

"సపత్నీకస్య రామస్య వర్తయన్ వన్యమాస్పదమ్
జ్యాఘోషేణైవ సౌమిత్రిః పశ్వాన్ సత్త్వాన్ వ్యపోహతి."

సీతారాములకు అరణ్యమున పర్ణశాల నిర్మింపబూని సౌమిత్రి తన ధను ష్టంకారముచే వ్యాఘ్రాదిదుష్టసత్త్వములను పారద్రోలుచున్నాడు.

(ఇట ధనుష్టంకారమొనరించు లక్ష్మణపాత్రను, సీతారాముల పాత్రలను రంగస్థలమున ప్రవేశించుచున్నట్లు సూచించుటచే ప్రయోగాతిశయము.)

పిదప లక్ష్మణుడు ప్రవేశించును.

**అనర్ఘరాఘవము :**

నటి, సూత్రధార సల్లాపము

సూత్రధారోక్తి:- లవణోదవేలా వనాళీతమాల తరుకందళుడు, త్రిభువన మౌళిమండల మహానీలమణియు, కమలాకుచకలశకేళి కస్తూరికా పత్రాంకురుడు

నగు పురుషోత్తమస్వామి ఉత్సవ సందర్భమున సభాసదులుపస్థితులైనారు. ఏదో ద్వీపమునుండి వచ్చిన కలహకందళుడను కుశీలవుడు రౌద్రబీభత్సభయాన కాద్భుత రసభూయిష్ఠముగా ఏదో నొక ప్రబంధము నభినయించి జనమును బెదరగొట్టినాడట. కావున చక్కని రసనిష్యందమగు నాటకమును నాట్యవేదాధ్యాపకులగు బహురూపులవారి శిష్యుడను, మధ్యదేశమునకు చెందిన సుచరితుడను నేను ప్రదర్శింప అనుమతి గోరుచున్నాను.

"ప్రీతిర్నామ సదస్యానాం ప్రియారంగోపజీవికః
జిత్వా తదపహర్తారమేష ప్రత్యాహరామితామ్."

సభాసదులకు ప్రీతిగూర్చుట రంగోపజీవియగువానికి అభీష్టము. సదస్య ప్రీతియే నా ప్రేయసి. నా ప్రేయసిని హరించినవాని జయించి, దానిని మరల దెచ్చెదను.

కలహకందళుడను నటుడు రౌద్రబీభత్స భయానకాద్భుత రసభూయిష్ఠమగు ప్రబంధము నభినయించి సదస్యప్రీతిని హరించెను. నేను వానిని జయించి సదస్యాభిమత రసభావ భాసురమగు ప్రయోగము ప్రదర్శించి ప్రీతికూర్చెదను. (ఈ సూత్రధార వచనమున రావణాపహృతయైన సీతాదేవిని శ్రీరాముడు రావణుని జయించి మరల తీసికొనివచ్చుట యను నాటకీయవస్తువు సూచితమైనది.)

(ఆకాశమువైపు చెవియొగ్గి) వైదేశికుడవు నీవు. అనుచర నట సహాయము లేకుండ ఈ పనిలో నెట్లు నెగ్గెదవని యనుచున్నారా? (కైమోడ్చి) ఆర్యులారా! తమను మెప్పించెడి నా వృత్తియే పాత్రలను సమకూర్చిపెట్టును.

"యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతామ్
అపంథానం తు గచ్ఛంతం సోదరోపి విముంచతి"

న్యాయపథమున పయనించువానికి పశుపక్ష్యాదులు కూడ తోడుపడును. చెడుత్రోవను బోవువానిని సోదరుడు కూడ విసర్జించును.

(ఈ వాక్యమున శ్రీరామునకు వానరాది సాహాయ్యము విభీషణుడు రావణుని పరిత్యజించి రాముని చేరుట యను కావ్యవస్తువు సూచితమైనది.) అట్టులైన

ఇదిగో ఈ పత్రమును బంపుచున్నాము. (నటుడు పత్రికను దెచ్చిఇచ్చును) సూత్రధారుడు గైకొని:-

"చేతఃశుక్తికయా నిపీయ శతశః శాస్త్రామృతాని క్రమాత్
వాంతైరక్షరమూర్తిభిస్సుకవి నా ముక్తాఫలైర్గుంఫితాః
ఉన్మీలత్కమనీయనాయకగుణగ్రామోప సంవల్గన
ప్రౌఢాహంకృతయో లుఠంతి సుహృదాం కంఠేషు హారస్రజః."

మనస్సను ముత్యపుచిప్ప శాస్త్రామృత బిందువులను గ్రోలి అక్షర రూపములైన ముత్యములను వెడలగ్రక్కుచుండ సత్కవి వానిని ఉత్తమనాయక గుణములలో గ్రుచ్చి, సహృదయ కంఠములందు హారముగా దేనిని వేసినాడో.-

"తస్మై వీరాద్భుతారంభగంభీరోదాత్త వస్తవే
జగదానందకందాయ సందర్భాయ త్వరామహే"

అట్టి వీరాద్భుత సన్నివేశ బంధురము, గంభీరోదాత్త వస్తుకము, జగదానందకందమునగు నాట్యమును తిలకింప నువ్విళ్లూరుచున్నాము.

(అని పత్రికను చదివి) మారిషా! రామాయణము భగవద్వాల్మీకి భారతీసార భూతము. కవితావరణమునకు ప్రథమ తీర్థము. ఇక్ష్వాకుల యశశ్శరీరము కదా? ఆ రామాయణమునకు సంబంధించిన వస్తువునే పరిషత్తువారు కోరుచున్నారు. మారిషా! వాల్మీకీయుల సుభాషితము సర్వకవుల మూలధనమని యనుచున్నావు కదా! వాస్తవము.

"అపి కథమసౌ రక్షో రాజస్తతాప జగత్త్రియమ్
అపి కథమ భూత్ ఇక్ష్వాకూ ణాం కులే గరుడధ్వజః
అపి కథమృషో దేవ్యో వాచః స్వతః ప్రచకాశిరే
సుచరితపరీపాకః సర్వః ప్రబంధకృతామయమ్"

రావణుడు ముల్లోకముల బాధపెట్టుటయనునది, ఆదినారాయణుడు ఇక్ష్వాకువంశమున నుదయించుట యన్నది, ఛందోమయములగు వాక్కులు వాల్మీకి వదనారవిందమున స్వయం ప్రకాశితములగుట యనునదంతయు కావ్య కర్తల పుణ్యపరీపాకమే యగుచున్నది.

కావున మౌద్గల్య గోత్రసంభవుడు భట్ట శ్రీ వర్ధమానుని పుత్రుడు, తంతుమతీనందనుడు, మురారి యనుకవి వ్రాసిన అనర్ఘరాఘవమను నాటకమును ప్రదర్శించి సామాజికుల నుపాసింతము. పరిషదారాధనకు కావలసిన సామగ్రి యంతయు లభించియున్నది.

"మద్వర్గ్యా రస పాఠగీతి గతిషు ప్రత్యేకముత్కర్షిణో
మౌద్గల్యస్య కవేర్గ భీరమధురోద్గారా గిరాం వ్యూతయః
వీరోదాత్త గుణోత్తరో రఘుపతిః కావ్యార్థ బీజం మునిః
వాల్మీకిః ఫలతి స్మ యస్య చరిత స్తోత్రాయ దివ్యా గిరః."

నావారందరు రసయుక్తముగా పాఠనీతి గతులొనరించుటలో ప్రాతి స్వికముగా ఉత్కర్షగలవారు. మురారికవి వాక్ప్రసారములు గంభీర మధురోద్గారములు. నాటక నాయకుడయిన రఘుపతి ఉదాత్తుడగు గుణోత్తరుడు. ఈ కావ్యమునకు బీజము వాల్మీకి ముని. తచ్చరిత స్మృతికై దివ్య వాక్కు సఫలము.

(ఇట కవి కావ్య నాయక పూర్వ కవి వస్తువుల ప్రశంస సంక్షేపముగా నొనరింపబడినది) ప్రాచేతసోపజ్ఞమగు ఈ కథా వస్తువు నెందరో వాడుకొనినారు. మన కవియు వాడినాడు. ఇది చర్విత చర్వణ దోషము కాదు.

"యది క్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితం
గుణై రేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః
స్వమాత్మానం తత్తద్ గుణగరిమ గంభీరమధుర
స్ఫురద్వాగ్బ్రహ్మణః కథముపకరిష్యంతి కవయః."

ప్రాచీన కవులెందరో రామచరితను వర్ణించినారని ఆ చరిత్రను విడిచిపెట్టినచో అంతటి గుణములుగల నాయకుడు మరియొకడు లోకమున లభింపవలయును కదా? అట్టివాడు లేడు! కావున తద్గుణగానముచే కవులిప్పటికిని తమ వాక్కును చరితార్థపరచుకొనుచున్నారు. అందుకొరకే మన మురారి కవియు అనాయాస ప్రావృత్తకవితా ప్రవాహుడు, సకల కవికుల గురువు అగు వాల్మీకి నిట్లు స్తుతించినాడు :

"తమృషిం మనుష్యలోక ప్రవేశ విశ్రామ శాఖినం వాచామ్
సురలోకాదవతార ప్రాంతరభేదచ్ఛిదం వందే
ధాతుశ్చతుర్ముఖ కంఠ శృంగాట కవి హారిణీమ్
నిత్య ప్రగల్భవాచాలాముపతిష్ఠే సరస్వతీమ్."

భారతి మనుజ లోకమున ప్రవేశింపదలచి మొదట తాను విశ్రమించుటకు వాల్మీకి వృక్షము నాశ్రయించినది. ఆ వృక్షము తన నీడలో భారతిని కూర్చొన జేసి ఛాయారహితమగు సురలోక, నరలోక మార్గమందలి ఆయాసము తొలగించి ఆమెకు శీతలోపచారము కల్గించినది. అట్టి వాల్మీకికి నా నమస్కారము. చతురానన ఘంటాపథ సంచారిణి యగు సరస్వతీ మాతకు నా నమస్కారము. (ఇట పూర్వకవి, భారతి స్తుతియు పాటింపబడినది)

నటుడు:- బావా! బ్రహ్మర్షుల వంశమునకు వన్నెదెచ్చి బాల వాల్మీకి యను ఖ్యాతి గడించిన ఈ మురారి కవితామృతము వినిన కొలది కుతుకమును కందలింపజేయుచున్నది.

సూత్ర :- మారిషా! యుక్తము.

"తత్రా దృగుజ్జ్వల కకుత్స్థ కులప్రశస్తి
సౌరభ్య నిర్భర గభీరమనోహరాణి
వాల్మీకి వాగమృతకూపని పానలక్ష్మీ
మేతాని బిభ్రతి మురారి కవేర్వచాంసి"

ఆ కాకుత్స్థ వంశ ప్రశస్తిచే మరిమళించి, గంభీరమై మనోజ్ఞములైన మురారికవి వాక్కులు వాల్మీకి వాగమృత కూపపానసమృద్ధిని తాల్చియున్నవి.

(తెరలో)

"దినకర కిరణోత్కరః ప్రియాకరః కోపి జీవలోకస్య
కమలముకులాంక పాళీకృత మధుకర కర్షణ విదగ్ధః."

లోకమున కానందము కల్గించుచున్న సూర్యకిరణ సముదాయము తమ్మి రేకులను కారాగారములో చెరపడియున్న తుమ్మెదలను వెలికీడ్చుచున్నవి.

(ఇట దశరథుని ఒడినుండి శ్రీరామచంద్రుని తీసికొని విశ్వామిత్రుడు తపోవనమునకు వెళ్లుచున్నాడను కథాంశము సూచితమైనది) సూత్రధారుడు విని, అపుడే నటులు దశరథుని ఉత్సంగము నుండి రామభద్రుని గొంపోవుటకు విశ్వామిత్రుని ప్రవేశపెట్టెడి ధ్రువాగానము చేయుచున్నారు. అపుడే వసిష్ఠముని ఆశ్రమము నుండి మరలవచ్చెడి వామదేవుని ద్వార ఏదో విషయమును వినుచు దశరథ మహారాజు వైపునకే యున్నారు. మనము మన కర్తవ్యమును నిర్వహింప వెళ్ళుదుము. ఇట సూత్రధారవాక్యము దశరథ, వామదేవ పాత్రల ప్రవేశము సూచించుట వలన ప్రయోగాతిశయమను ప్రస్తావనాంగము. పిదప దశరథుడు, వామదేవుడును ప్రవేశింతురు.

**ప్రసన్నరాఘవము :**

నట సూత్రధార సల్లాపము.

**సూత్రధారోక్తి :** నిజవదన శారదారవింద నర్తిత గిరనందనీ నయన ఖంజనుడు, నిఖిలముని జన హృదయ రంజనుడు, వికట జటా పాటలోత్సంగ తాండవిత గంగాతరంగ నికరుడు, మందాకినీ చందన లలాటి కాయమాన ముకుటోపనీత నూతన సుధాకరుడు, త్రిభువన నలిన నిర్మాణ నూతన బిసాంకురుడు, భగవంతుడునైన పరమేశ్వరుని ఉత్సవమున పారిషదులెల్లరు సమావేశమైనారు. వీరి దరిజేరి నా నాట్యప్రయోగము తిలకింప వేడెద. (ఆలోచించి) అభ్యర్థనతో బనియేమి?

"ఆకారేణైవ చతురాస్తర్కయంతి పరేంగితమ్
గర్భస్థం కేతకీపుష్పమామోదేనేవ షట్పదాః"

తుమ్మెదలు కంటికగపడకున్నను సౌరభమును బట్టి మొగిలి పువ్వును గ్రహించినట్లే, నిపుణులు ఆకారమును చూచియే పరుల హృద్గతాభిప్రాయమును కనుగొందురు. ఇదిగో నా భావమును గ్రహించినట్లే నా మిత్రుడు రంగతరంగు డనువాడు సభ్యుల దగ్గర నుండి వచ్చుచున్నాడు.

నటుడు :- (ప్రవేశించి) బావా! సామాజికులు నీతో ఇట్లు చెప్పుమన్నారు. "అయ్యా! భరతాదిరాజా" అని సగము పలుకుచున్నంతనే సూత్రధారుడు చెవులు మూసికొని అయుక్తమయుక్తము కానిమ్ము, వారానతిచ్చినది ముందు వినెదను. మారిషా! చెప్పుము.

నటు :- బావా! ఎందుకిది అయుక్తమనుచుంటివో ముందు నాకు తెల్పుము.

సూత్ర:- పెద్దవాడు సమర్థుడుండగ చిన్నవానికి రాజపదము నంటగట్టుట అయుక్తము నేను భరత మాత్రుడనే. నా జ్యేష్ఠభ్రాత గుణారాముడు సార్థక నాముడు. అతడే రాజ పదార్హుడు.

"గుణ గ్రామావిసంవాది నామాపి హి మహాత్మనామ్
యథా సువర్ణశ్రీఖండ రత్నాకర సుధాకరాః"

సువర్ణము, చందనము, రత్నాకరము, సుధాకరుడు - అను వానివలె మహా పురుషుల నామము గుణములతో నిరంతరము సంవదించుచుండును. ఆతడు రతిజనకుడను రాజ సభలో హరచాపారోపణమను రూపకము నభినయించి సంతోష పరవశుడగు ఆ రాజు ఒసగిన రంగ విద్యాధరా ఖ్యాతిని ప్రేయసిని వలె స్వీకరించినాడు. దక్షిణ దేశీయు డెవడో శైలూషాధముడు, తాను గుణా రాముడనని పలుకుచు రంగ విద్యాధరాకాంతి నపహరించినాడు. అది విని గుణా రాముడు ప్రస్తుతమా దిక్కున కేగినాడు. పిదప సుకంతుడను గాయకునితో మైత్రి బడసి దాక్షిణాత్యులైన రాజుల సదస్సులో ఆతనితో రంగ సంగరమునకు దొరకొనినాడని ఇపుడే వార్త వినినాను. (గుణారామ, రతిజనక, దాక్షిణాత్య, ధరాఖ్యాతి, సుకంఠ, పదములవలన శ్రీరాముడు, జనకుడు, రావణుడు, సీత, సుగ్రీవుడు - అను పాత్రలు, రాముడు ధనుర్భంగము చేసి సీతను వివాహ మాడుట, ఆమెను రావణు డపహరించుకొనిపోవుట, సుగ్రీవ సాహాయ్యమున రాముడు రావణునిపైకి దండెత్తి వెళ్ళుట యను అర్థము. 'భరతాదిరాజు' అనుట వలన భరతునకు పట్టాభిషేకము కై కేయి కోరుట, రామ వనవాసము - అను నవి సూచితములైనవి.)

"కీర్తిం మృణాళకమనీయ భుజామనిన్ద్ర
చన్ద్రాననాం స్మితసరోరుహచారునేత్రామ్
జ్యోత్స్నా స్మితామహహృతాం దయితామివ స్వాం
లబ్ధుం న కః పరముపక్రమమాతనోతి"

మృణాళ కోమలకరములు గలదానిని, పూర్ణచంద్రాస్యను, వికసితారవిందలోచనను, జ్యోత్స్నా దరహాస రేఖను, అన్యాపహృతయునైన కీర్తిని ప్రేయసి వోలె తిరిగి పొందుట కెవరైన పూనుకొనక యుందురా?

(ఇట ప్రియోపమానత వలన రావణాపహృతయగు సీతను పొందుటకై చేసిన రామ ప్రయత్నము సూచితము.)

నటు:- దీనినే ప్రయోగింప చూడదలచితిమని సామాజికులు నా ద్వారా తెలుపుమనినారు. వినుము.

"ప్రత్యంక మంకురిత సర్వరసావతార
నవ్యోల్లసత్కుసుమ రాజివిరాజిబంధమ్
ఘర్మేతరాంశుమివ వక్రతయాతిరమ్యం
నాట్య ప్రబంధమతిమంజులసంవిధానమ్"

ప్రతి అంకమున నవరస పరీవాహము కలది, సద్యోవికసిత కుసుమ రాజవిరాజమాన రంగ రచన గలది, చంద్రునివలె వక్రత భాసించునట్టిది, హృదయావర్జకమైన సంవిధానము గల నాటకమును చూడదలచినామని సామాజికుల యాదేశము.

సూత్ర :- ఇట్టి లక్షణములే నాటకమునకుండియుండును. (స్మరించి) అష్ట పంక్తి క్రమమున శ్లోకమును వ్రాసినచో నాటక నామము వచ్చును. బాగు బాగు! ప్రసన్న రాఘవనామ నాటకము కదా వారాశించినది?

నటు :- ఔరా! కవి కుముద లోక కౌముది యగు సరస్వతీ మాత కటాక్ష విశేషము నేమందును? ఆ విశేషము వలననే ఒక్కొక్క కవిలో యొక్కొక్క పోకడ పొడసూపు సూక్తి వైచిత్ర్యము వెలువడుచుండును.

సూత్ర :- వాస్తవము. ఈ కవియే యనినాడు:

"వాణి త్వత్పదపద్మరేణుకణికాయాస్వాంత భూమిం సతాం
సంప్రాప్తా, కవితా లతా పరిణతా సైవేయ ముజ్జృంభతే
త్వత్కర్ణేఽపి చిరాయ యత్కిసలయం సూక్తాపదేశం శిరః
కంపభ్రంశిత పారిజాత కలికా గుచ్ఛే విధత్తే పదమ్."

అమ్మా! నీ చరణ పాంసులేశము సజ్జన హృదయ వీధిలో ప్రసరించి కవితా లతగా పరిణమించి పెంపొందుచుండును. అదియే సూక్తిచ్ఛలమున పల్లవముల ప్రసవించును. నీవు తల యూపునపుడు చెవి నుండి పారిజాత ముకుళము జారిపడిన వేళ ఆ సూక్తి పల్లవమునే కర్ణావతంసముగా ధరింతువు.

మారిషా! ఆ ఆది కవి మహిమ ఎట్టిదనవచ్చును? సాక్షాత్తు సరస్వతీ దేవి ఆ మహర్షి ఏకానన సరసిజమున నధివసించి చతుర్ముఖ వదన కమల వన విహార వినోద సుఖము ననుభవించుచున్నది.

నటు :- వాస్తవము.

"భాస్వద్వంశ వతంస కీర్తి రమణీ రంగ ప్రసంగస్వనద్
వాదిత్ర ప్రథమ ధ్వని ర్విజయతే వల్మీకజన్మా మునిః
పీత్వా యద్వదనేందుమండలగళత్కావ్యామృతాబ్ధేః కిమ
ప్యాకల్పం కవినూతనాంబుదమి యం కాదంబినీ వర్షతి."

శ్రీరామచంద్రుని కీర్తి యను నర్తకి నృత్యము చేయువేళ మొట్టమొదట వాయింపబడిన వాద్యధ్వనిగా వాల్మీకి విరాజిల్లుచున్నాడు. ఆతని ముఖేందు బింబమునుండి స్పందించిన కావ్యామృత సాగరములోని అమృత బిందువుల గ్రోలి ఈ కవిలోక కాదంబిని ఆచంద్రార్కము వర్షించుచునే యుండును. వాల్మీకుల సారస్వత పారావారము ఏ రామచంద్రుని కీర్తి కౌముదీ పరిచుంబితమై సముల్లాసము చెందెనో ఆ రామచంద్రుని యందు నా చిత్తచకోరము సంసక్తమై ఆనందించుచుండును.

"చంద్రే చ రామచంద్రే చ నారీణాం చ దృగంచలే
నీలోత్పల సుహృత్కాంతా కస్య నామోదతే మనః."

నీలోత్పలాప్త సుషమమగు చంద్రుని యందు, రామచంద్రుని యందు, నారీ దృగంచలము నందును అనురక్తమై ఎవని మనస్సామోదింపక యుండును?

"ఝటితి జగతీ మాగచ్ఛంత్యాః పితామహవిష్టపాత్
మహతి పథి యో దేవ్యా వాచ శ్శ్రమస్సమజాయత
అపి కథమసౌముం చే దేనం నచే దవగాహతే
రఘుపతి గుణగ్రామ శ్లాఘా సుధామయ దీర్ఘికామ్."

సరస్వతీదేవి బ్రహ్మలోకము నుండి భూతలమునకు వచ్చుచున్నప్పుడు శ్రీరామచంద్రుని గుణశ్లాఘామయ సుధాదీర్ఘికలో స్నానమాడు భాగ్యము లభింప కున్నచో, అతిదూరప్రయాణము వలన కలిగిన బడలిక ఆమెకు తొలగి పోయెడిదా? ఒక్క శ్రీరామునినే కవులెల్లరు వర్ణించుట యనునది వారి దోషము కాదు ఏలనన :-

"స్వసూక్తీనాం పాత్రం రఘుపతి తిలకమేకం కలయతాం
కవీనాం కో దోష స్సతు గుణ గణానామవగుణః
యదేతై ర్నిశ్శేషై రపర గుణ లుబ్ధై రివ జగ
త్యసావేక శ్చక్రే సతతసుఖసంవాసవసతిః."

తామితరగుణములతో కలిసి సుఖ మనుభవింపదలచి ఆ శ్రీరామచంద్రునినే ఆశ్రయించిన ఆ గుణము దోషమగును గాని, సర్వ గుణవరణీయుడగు రాముని వర్ణించెడి కవుల దోషమెట్లగును?

"బీజం యస్య చిరార్జితం సుచరితం ప్రజ్ఞా నవీనోంకురః
కాండః పండితమండలీ పరిచయః కావ్యం నవః పల్లవః
కీర్తిః పుష్పపరంపరా పరిణతస్సోయం కవిత్వ ద్రుమః
కిం వంధ్యః క్రియతే వినా రఘుకులోత్తంసప్రశంసాఫలమ్."

చిరకాలార్జితమగు చరిత్ర సంపద బీజముగా, ప్రతిభ యంకురముగా పండిత ప్రకాండ పరిచయము కాండముగా రసమయమైన వాక్కు పల్లవముగా, కీర్తి పుష్పమంజరికాగా, పరిణమించిన కవితాద్రుమము శ్రీరామచంద్ర కీర్తి ప్రశంసయను ఫలవృద్ధి కలుగనీక గొడ్డుదానిగా నెవడు చేయును?

నటి :- దీనిని వ్రాసిన కవి యెవరు?

సూత్ర :- (సప్రణయ కోపమున)

"విలాసో యద్వాచామసమరసనిష్యంద మధురః
కురంగాక్షీ బింబాధరమధురభావం గమయతి
కవీంద్రః కౌండిన్యః స తవ జయదేవః శ్రవణయో
రయాసీదా తిథ్యం న కిమిహ మహాదేవ తనయః."

అనుపమ రసస్రుతి స్వాదువై ఎవరి కవితా విలాసము హరిణలోచనా బింబాధర మాధురిని తలపింపజేయుచున్నదో మహాదేవుని పుత్రుడు కౌండిన్యుడునౌ ఆ జయదేవకవీంద్రుని వినెడి భాగ్యము నీ చెవులు నోచుకొనలేదా?

"లక్ష్మణస్యేవ యస్యాస్య సుమిత్రాకుక్షిజన్మనః
రామచంద్రపదాంభోజే భ్రమద్భృంగాయ తే మనః."

లక్ష్మణునివలె సుమిత్రా పుత్రుడైన జయదేవుని మనస్సు నిరంతరము శ్రీరామచరణ సరోజ చంచరీకమగుచుండును.

నటు :- జయదేవ కవిని విస్మరించిన నా స్థితి లోకరంజకుడగు చంద్రుని ఎరుగనిచో కోరశాబకమును తలపింపజేయుచున్నది. బావా! ఆ కవియే తన నాటకమును నా చేత నుంచి చకోరుల నుండి ఈ సూక్తి రత్నమును కాపాడుమని యనినాడు. నేను విధేయుడనై ఇటులనినాను.

"కర్ణే నిధాయ చ పిధాయ చ కంఠపీఠే
ధృత్వా చ మూర్ధని నతే హృదయే చ కృత్వా
చౌరాపహార చకితేన చిరం మయైష
త్వత్సూక్తి మౌక్తికగణః పరిరక్షణీయః."

దొంగలు దోచుకొనకుండ నీ సూక్తి మౌక్తిక నికురంబమును చెవిలో పెట్టుకొని కంఠములో దాచుకొని తలపై నుంచుకొని పరిపక్వమగు హృదయ మును భద్రపరచుకొని రక్షింతును.

సూత్ర : ఈ మిధ్యా సందేహము కవికేల కలిగినది?

"సులలితవదనా ముదారవృత్తాం కృతిమధవా యువతిం పస్య హృత్వా
తటమపి పరమర్ణవస్య గత్వా వద కతరః సుఖభాజనం జనః స్యాత్"

సురుచిర వదనలాలిత్యమున, వృత్తౌదార్యమున విలసిల్లెడి పరుని కృతిని గాని, యువతిని గాని హరించి సాగర పరతట ప్రాంతమును జేరిన వాడెవడైనను సుఖమును పొందలేడు

(ఇట రావణుడు సీత నపహరించి లంకకు జేరి ఏమి బావుకొనినాడను కావ్యాంశము సూచితము. కాన పతాకా స్థానము.)

నటు :- కవి ప్రమాణ ప్రవీణుడని వినినాను. కవితానైయాయికతలకు చంద్రికా చండాతపములకు వలె సామానాధికరణ్య మెట్లు కుదిరియుండును? ఆశ్చర్యముగా నున్నదే!

సూత్ర :- అబ్బుర పడవలసిన పనిలేదు.

యేషాం కోమల కావ్య కౌశల కలాలీలావతీ భారతీ
తేషాం కర్కశతర్క వక్ర వచనోద్గారేఽపి కిం హీయతే
యైః కాంతా కుచమండలే కరరుహాః సానంద మారోపితాః
తైః కిం మత్త కరీంద్ర కుంభ శిఖరే నారోపణీయాశ్శరాః."

విలాసమందిరములో విలాసవతీ కుచ కుట్మములందు నఖక్షతము జేయు వారే మత్తమాతంగ కుంభస్థలముల ప్రయ్యలింప శరప్రహారము చేయుట చూచుట లేదా! అట్టులే సుకుమార రచనా నిపుణులుకూడ కర్కశతర్క వక్రములగు వాక్యముల నుపయోగింతురు. అందాశ్చర్య మేమియును లేదు.

నటు :- అందుకొరకే కవితా కోవిదులగు పారిషదులు ఇతని సూక్తు లనిన ఎంతో వినోదపడుదురు.

సూత్ర :- ఆ మాటే కవి యనినాడు.

"అపి ముదముపయాన్తో వాగ్విలాసైః స్వకీయైః
పరభణితి షు తేషాం యాంతి సంతః కియంతః
నిజఘనమకరందస్యందపూర్ణాలవాలః
కలశసలిలసేకం నేహతే కిం రసాలః."

కావలసినంత పూదేనియల యూటలలో తన పాదును నింపుకొనినను సహకార తరువు కుండ నీటిపోతను కోరెడివిధముగా తమ రచనలతో ఆనందము ననుభవించు వారు కూడ కొందరు సహృదయులు పరసూక్తుల గ్రహించి ఆనందింతురు.

నటు :- ఈ కవి సూక్తులతో ఎంత సారళ్యము, ఎంత సౌకుమార్య మున్నది.

సూత్ర :- అవియే కాదు? వక్రతాకాఠిన్యములు కూడ కలవు.

నటు :- ఇది రమణీయ మెట్లగును?

సూత్ర :- ఎందుకు కాదు!

"నింద్యంతే యదినామ మందమతిభిర్వక్రాః కవీనాం గిరః
స్తూయంతే నచ నీరసైర్మృగదృశాం వక్రాః కటాక్షచ్ఛటాః
తద్వైదగ్ధ్యవతాం సతామపి మనః కిం నేహతే వక్రతామ్
ధత్తే కిం న హరః కిరీటశిఖరే వక్రాం కలామైందవీమ్."

మందబుద్ధులు కవుల వక్రోక్తి వైచిత్యమును నిందించినంతమాత్రమున కొరత ఏమి? శుష్కహృదయులు హరిణాక్షుల వక్రాపాంగ విలాసములను స్తుతింపనంత మాత్రమున వారి సొగసునకు లోపమా! అది నైపుణ్యము గల సహృదయులు గ్రహించి మెచ్చుదురు. వక్రమైన ఇందు రేఖను శివుడు తన యుత్తమాంగాగ్రమున ధరించుట లేదా? ఇంతే కాదు-

"అమృతజలధేః పాయం పాయం పయాంసి పయోధరః
కిరతి కరకాస్తారా కారా యది స్ఫటికావనౌ
తదిహ తుల నామా నీయన్తే క్షణం కఠినాః పునః
సతతమమృతస్యందోద్గారా గిరః ప్రతిభావతామ్."

మేఘము సాగరములో జలపానము చేసి నీటితోపాటు శిలలను వర్షించును. వర్షోపలములు మొదట కఠినములైనను స్ఫటిక ప్రాంతమున పడి ద్రవీభవించును. అదే విధము కఠినములయ్యు ప్రతిభావంతుల వాక్కులు బుద్ధి పరిపాకముగల సహృదయుల ఆలోచనా పథమునుజేరి విస్ఫుటార్థతను పొందుచుండును. క్షణకాలము కఠినముగా తోచినను నిరంతర మననమున ఆ వక్రోక్తులు అమృత స్యందోద్గారములగును.

నటుః- ఔరా! ఈ కవి వాగ్వైచిత్ర్యము క్షణ క్షణ ముత్సుకత సాపాదించుచున్నది. ఇతని సూక్తులు సరస శీతలములు.

సూత్ర:- నిక్కువము.

"యస్యాశ్చోరశ్చికురనికరః కర్ణపూరో మయూరః
భాసో హాసః కవికులగురుః కాళిదాసో విలాసః
హర్షో హర్షో హృదయవసతిః పంచబాణస్తు బాణః
కేషాం నైషా కథయ కవితాకామినీ కౌతుకాయ."

ఏ కవితా కామిని చికుర నికురముగా చోరుడు, కర్ణపూరముగా మయూరుడు, హాసము భాసుడు, కవితాచార్యుడగు కాళిదాసు విలాసము, శ్రీహర్షుడు హర్షము, బాణుడు పంచ బాణుడును - అగుదురో ఆ కవితా కామిని ఎవరికి వినోదము కలిగింపదు? మరియు-

"న బ్రహ్మవిద్యా న చ రాజలక్ష్మీ, స్తథా యథేయం కవితా కవీనామ్
లోకోత్తరే పుంసి నివేశ్యమానా, పుత్రవతీవ హర్షం హృదయే కరోతి"

పురుషోత్తమునకు సమర్పితమైన కన్యకవోలె అర్పింపబడిన కవిత కవులకు హృదయానందము కల్గించునంత బ్రహ్మవిద్యకాని రాజ్యలక్ష్మిగాని కల్గింపదు.

(తెరలో)

బాగు బాగు, కుశీలవాతంసమా! బాగు!

సూత్ర : ఏమి, యాజ్ఞవల్క్యుల వారి ప్రియశిష్యుడు దాల్భ్యాయనుడు ఈ వైపే వచ్చుచున్నాడు. ఇచ్చోట మనము నిలుపరాదు, వెళ్లుదము.

ఇట "లోకోత్తరే పుంసి నివేశ్యమానా పుత్రీవ" అను వాక్యమునకు జనకమహారాజు లోకోత్తరుడగు పురుషోత్తమునకు తన కన్యారత్నమును ప్రదానము చేయదలచి ఇంచుక బ్రహ్మ విద్యయందు రాజ్యలక్ష్మి యందును మందార మరందుడైనాడను అర్థమును గ్రహించి - దాల్భ్యాయన పాత్రరంగ స్థలమున ప్రవేశించును. కాన ఇది కథోద్ఘాతమను ప్రస్తావనాంగము. శంకరోత్సవమనుట వలన దేశ నిర్దేశము చేయబడినది. కవి కావ్యనామ నిర్దేశము చేయుటయేగాక, కవి కావ్యముల ప్రశంస విపులముగా ఆదికవి వాల్మీకి, వాగ్దేవత, పూర్వకవి స్తుతి, దుష్కవి నింద అనునవి క్రొత్తగా చేర్చబడినవి. కవి ప్రౌఢుడు, కావ్య గీతనాయక ప్రశంసయు పరమోదాత్తముగా నిర్వహింపబడినది. ఒక కాల ప్రశంస లేదు. ఐనను కవి సంక్షిప్తముగా గాక విస్తృతముగా ప్రరోచనను నిర్వహించినాడు. ఎవడో శైలూషాపశదుడు అభినయించి ఉద్వేగపరచినాడు. మాకు రసానందము చేకూరునట్లు నాట్యమును ప్రదర్శింపుమని కోరుటచే నట ప్రశంసయు - సకల కవితా రహస్యముల నెరిగిన వారనుటచే సభ్య ప్రశంసయు నొనరింపబడినది. సభ్యులు ప్రార్థకులు, ప్రయోక్త ప్రార్థనీయుడు. "శారదార వింద" అను శంకర విశేషణము వలన నించుక శరత్కార్యము సూచించబడు టచే కాల ప్రశంసయు కలదని భావింపవచ్చును...

## రాజశేఖరుడు : బాలరామాయణము

మారిష సూత్రధారోక్తి.

సూత్ర :— సకలకళావిదులౌ ఓ సభాసదులారా! ఈ గుణనిధి మీకొక విన్నపము చేయుచున్నాడు. నాట్యాచార్యుడైన దూర్తిలుడు గావించిన ప్రతిజ్ఞ మీరెరిగినదే.

"వీరాద్భుత ప్రాయరసే ప్రబంధే లోకోత్తరం కౌశలమస్తి యస్య
నాట్యే చ నృత్యే చ పరం ప్రవీణామసౌ సుతాం మే పరిణేష్యతీతి."

వీరాద్భుత రసభూయిష్ఠమైన ప్రబంధమందు, నాట్యమందు, నృత్యమందును లోకోత్తరముగా నైపుణ్యమును గడించినవాడే కళాకోవిదురాలైన నా కూతురిని పెండ్లియాడ నర్హత గలవాడని (ప్రతిజ్ఞ చేసిన వాడాతడు.) అందు దక్షిణా పథమునుండి వచ్చిన రంగ విద్యాధరుడను భరత పుత్రుడు మీ పరీక్షలో నెగ్గలేదు కదా! ఇక నన్ను పరీక్షించుడు. ఏమనుచున్నారు? విలక్షణుడౌ ఆ కర్ణాటనటుడు. "కర్ణాటకుల పౌరుషములే విషయమునను వైనుదీయవనుచు'' నిర్మర్యాదముగా ఇట్లనినాడు:

"అహమేవ హరిష్యామి పరిణేతుః పురోపితామ్
నారీ పరిభవం సోఢుం దాక్షిణాత్యా న శిక్షితాః''

పరిణయమాడెడువాడు చూచుచుండగనే ఆమె నపహరింతును. స్త్రీని గురించి ఏర్పడిన అవమానమును దాక్షిణాత్యులు భరింప నేర్చుకొనలేదు అని అనినాడనుచుంటిరా! అట్లైనచో నా మాటలను కూడ వినుడు.

''అపి ద్వీపాంతరాదేష హృతాం ప్రత్యాహరామితామ్
కళత్రహరణే పుంసాం కియదర్ణవలంఘనమ్.''

నేనే పరిణయ మాడినచో - ద్వీపాంతరమునకు గొంపోబడినను తిరిగి తీసికొని వత్తును. భార్యను ద్వీపాంతర గతు డపహరించినపుడు ఆమె భర్తకు అర్ణవలంఘన మొక లెక్కయగునా?

(దీనివలన సీతా పరిణయమున రావణ భంగము, రాముని కృతార్థత, సీతాపహరణమును రావణుడు గావించుట, సముద్ర లంఘనము చేసి రాముడు సీతను తిరిగి తీసికొని వచ్చుటయను రీతి కావ్యాంశము సూచితమైనది)

ఇంతలో మారిషుడు ప్రవేశించి ప్రభువుల ఆదేశ పత్రము నిచ్చును.

సూత్ర :- (తనలో ఎండ నభిలషించుచుండగనే మబ్బుపడినట్లు నేనొకటి యనుకొన మరియొకటి జరిగినది. కాంతా క్రియారంభములకు విఘ్నపు తుంపర లడ్డుపడుచుండును. కానిమ్ము, నిర్వేదా భావము కార్య సిద్ధికి మూలము. (ప్రకాశముగా) రసాంతరమగ్నమౌటచే నా మనస్సవహితమైనది. నీవే ఈ పత్రమును చదువుము. (అని మారిషున కిచ్చును)

మారిష :- (తీసికొని ఇట్లు చదువును)

"క్రమవర్ధమానవిలాసం రసాతలే కం కరోతి కందర్పః?"

భూతలము నందు మదను డెవనిని క్రమముగా పెంపొందు విలాసము గల వానిగా నొనరించును? నిరంతర విలాసాభివృద్ధి గల సుఖము నెవడు చిర కాలము పొందలేడని భావము. (లోకోపద్రవకరుడౌ రావణునకు అవసాదము తప్పదను కావ్యార్థము స్ఫురితమగును) (ఇది ప్రశ్నోత్తర రూపమున నున్న బహిర్లాపికయేమో?)

సూత్ర :- ఇదియే మాకు ప్రీతి నొసగు నాట్యమని ప్రభువుల ఆదేశము, కావుననే పత్రము చదివి అవగతార్థుడనౌదును (అని తీసికొని చదువును)

"నిర్భయ గురుర్వ్యాథత్త చ వాల్మీకి కథాం కిమనుసృత్య?"

నిర్భయ గురువౌ రాజశేఖరుడు రామాయణ రూపమైన వాల్మీకి కృత కథను ఏ నాటక రూపమున ననుసరించినాడు. "బాల కవిః కవి రాజో నిర్భయ రాజస్య తథోపాధ్యాయః" అని తన కర్పూర మంజరిలో నిర్భయుడౌ మహేంద్ర పాలునకు తా నుపాధ్యాయుడననినాడు, అందువలన నిర్భయ గురువు, నిర్భయో పాధ్యాయు డను నామము రాజశేఖరునకు కలిగినది. ఎంత చక్కని భాషా చిత్రము! బాల రామాయణ నాటకమును ప్రయోగించుమని అర్థాత్ సూచిత మగుచున్నది. దైవ మనుకూలించినపుడు శుభము చేకూరునన్నది ప్రభువుల ఆదేశము తెల్పుచున్నది. ప్రస్తుతము:

"సద్విజ్ఞానం కవితిలకతాం యాతి దారైరుదారైః
ఫుల్లా కీర్తిర్భ్రమతి సుకవేర్దిక్షు యాయావరస్య
ధీరోదాత్తం జయతి చరితం రామనామ్నశ్చ విష్ణోః
కావ్యవ్యాజాత్తదియ మపరా కాప్యహో కామధేనుః."

ఈ సత్కృతియే రాజశేఖరుని కవితిలక మొనర్చినది. భార్యతోపాటు కీర్తి నిర్మలమై అన్నివైపుల ప్రకాశము చెందినది. అట్లే రామరూపము దాల్చి నారాయణుని ధీరోదాత్తమౌ చరితము సర్వోత్కృష్టమైనది. అది కావ్యవ్యాజమున వచ్చిన రెండవ కామధేనువనక తప్పదు.

మారి : పూర్వము వాల్మీకి వ్రాసిన రామాయణముకంటె ఈ రాజశేఖర కవి తన కృతిలో వెల్లడించిన విశేషమేమి?

సూత్ర : ఒక్కొక్కరికి ఒక్కొక పట్టున ప్రౌఢి యుండును. ఎవడు సర్వజ్ఞుడు కాదు.

మారి : దివ్యదృష్టితో సర్వము కరతలగతముగా నెరిగిన ఆ మహర్షికన్న ఇతడు చర్మదృష్టితో నెరుగునా?

సూత్ర : అట్లుకాదు.

"వదనేందుషు వామదృశామిందీవర పత్రసంఘటితమ్
రచనాసు చ కవీనాం నివసతి సారస్వతం చక్షుః."

వామాక్షుల వదనములందు నీలోత్పలదల ఘటితమౌ చక్షువున్నట్లు సత్కవుల రసనలయందు సారస్వత చక్షు వుండును. ఇంతేకాదు, ఇతడు మహా ప్రాజ్ఞుడు. తుల్య వస్త్వంతరముల నతిక్రమించుటె కదా ప్రజ్ఞాప్రకర్షము? మహా మంత్రి పుత్రుడౌ ఆ కవియే ఇట్లనినాడు:

"ఉదన్వచ్ఛన్నా భూస్స చ నిధిరపాం యోజనశతం
సదాపాంథః పూషాగగన పరిమాణం గణయతి
ఇతి ప్రాయో భావాః స్ఫురదవధిముద్రాముకుళితాః
సతాం ప్రజ్ఞోన్మేషః పునరయ మసీమా విజయతే."

భూమి సాగరావృతమైనది. ఆ సాగరము నూరు యోజనముల విస్తీర్ణమైనది. సూర్యుడు పథికునివలె గగన పరిమాణమును కొల్చుచుండును. ఈ విధముగా లోకము నందలి ప్రతి వస్తువునకు మేర కన్పట్టును. కాని సత్కవి ప్రజ్ఞకు మేర కానరాదు.

మారి:- అట్లైన నమస్కరింతును.

సూత్ర:- కవియె నమస్కరించినాడు. వినుము.

"యోగీంద్రశ్ఛందసాం స్రష్టా రామాయణమహాకవిః
వల్మీకజన్మా జయతి ప్రాచ్యః ప్రాచేతసో మునిః."

వల్మీకమున జనించినవాడు, ఋషిశ్రేష్ఠుడు, కావ్యచ్ఛందస్సుల సృష్టించినవాడు, ప్రాచీనుడౌ ప్రాచేతస మహర్షి సర్వోత్కర్షమున చెలంగును. మరియు ప్రబంధారంభమున ఆ కవి ఇట్లనినాడు:

"బ్రహ్మణ్యేభ్యశ్శివమస్తు వస్తు వితతం కించిద్వయం బ్రూమహే
హే సంత శ్శృణు తావదత్ర విధృతో యుష్మాసు సేవాంజలిః
యద్వా కిం వినయోక్తిభిర్మమ గిరాం యద్యస్తి సూక్తామృతం
మాద్యంతి స్వయమేవ తత్సుమనసో యాఞ్ఛా పరం దైన్యభూః."

వేదవేత్తలైన మీకు శుభమగుత! ఏదో కొంత విస్తృతమౌ వస్తువును వర్ణింప బూనినాము. విన్నిగ్రహింపుడని దోసిలి యొగ్గుచున్నాను. ఐన వినయోక్తులాడ వలసిన పనిలేదు. మా వాక్కులలో సూక్తామృత పక్షమున మీరే గ్రోలి ఆనందింతురు. దైన్యాస్పదమౌ యాచ్ఞ యేల?

సర్వభాషా విచక్షణుడైన ఆ కవి తిరిగి ఇట్లనినాడు:

"గిరశ్శ్రవ్యా దివ్యాః ప్రకృతి మధురాః ప్రాకృతధురాః
సభవ్యోప భ్రంశః సరస రచనం భూతవచనమ్
విభిన్నాః పంథానః కిమపి కమనీయాశ్చ త ఇమే
నిబంధా యస్త్వేషాం స ఖలు నిఖిలేస్మిన్ కవివృషా."

సంస్కృతోక్తులు శ్రవఃపేయములు. ప్రాకృతవాక్కులు ప్రకృతి మధురములు, అపభ్రంశ భాష అతి భావ్యము, భూత భాషావచన రచనా సారస్యము గలది. ఇట్లు వీని త్రోవలు వేరువేరు. కమ్మని సువాసనల వెదజల్లునవి. ఈ భాషలన్నింటిలో కవనమల్ల జాలినవాడు కదా కవీంద్రుడు! ఈ ప్రబంధ మహత్తును గూర్చి కవి ఇట్లనినాడు :

"బ్రూతే యః కోపి దోషం మహదితి సుమతిర్బాల రామాయణేస్మిన్
ప్రష్టవ్యో సౌపటీయానిహ భణితిగుణో విద్యతే వా నవేతి
యద్యస్తి స్వస్తి తుభ్యం భవ. పఠనరుచిర్విద్ధి నష్టప్రబంధాన్
నైవం చేత్ దీర్ఘమాస్తాం నటవటువదనే జర్జరా కావ్యకన్యా:"

బాలరామాయణ నాటకము చాల పెద్ద నాటకమని దోషము జూపిన పెద్దమనిషి నొకమాట యడిగెద. ఇందు భణితి గుణమున్నదా లేదా? ఆ గుణమున్నదన్నచో బాగుగా నా షట్ప్రబంధములను పఠించినట్లు పఠించి పరిశీలించుము. అతుకుల బొంతయే ఇది యందువేని నటుని నోటిలోనే జీర్ణము కానిమ్ము.

మారి :- బావా! నీకు మహారాజునకును ప్రీతి పాత్రుడైన ఈ కవి ఏ గోత్రమున జనించినవాడు.

సూత్ర :- గగనమణియైన సూర్యుని జూచి ఇతడెవ్వడని అడిగినట్లున్నదీ ప్రశ్న.

"సమూర్తో యత్రాసీత్ గుణగణ ఇవాకాలజలదః
సురానందః సోపి శ్రవణపటునా యేన వచసా
న చాన్యే గణ్యంతే తరలకవిరాజ ప్రభృతయః
మహాభాగ స్తస్మిన్ నయ మజని యాయావరకులే."

మూర్తీభవించిన గుణగణమున్నట్లు అకాలజలదుడను మహాపురుషుడు శ్రవఃపేయమౌ తనసూక్తి వైభవముచే దేవతలకు సైతము నానందము కూర్చినాడు. ఆతని ముందు చపలులౌ కవిరాజ ప్రభృతులకు గణనయే లేకుండెడిది. అట్టివాని జన్మచే పావనమైన యాయావర వంశమున మన కవి జనించినాడు. ఇతడు

మహారాష్ట్ర చూడామణియైన అకాల జలదునకు చతుర్థపురుషుడు, శీలవతీ దర్దురులకు పుత్రుడు. ఇతనికి ఉపాధ్యాయ రాజశేఖర కవి యన్నది గొప్ప ప్రతిష్ఠ కాదా? అహా! తనను గూర్చి చేసికొనిన ఆశీర్వాద సూక్తి ఎంత కమనీయముగా నున్నది!

"ఆద్యః కందో వేద విద్యాలతానాం జైహ్వం చక్షుర్నిర్నిమేషం కవీనామ్
యో యేనార్థీ తస్య తత్త్వక్షరస్తీ వాఙ్మూర్తిర్మే దేవతా సన్నిధత్తామ్."

వేదవిద్యాలతలకు మూలకందము నాలుకపై రెప్పపాటులేని నన్ను కవులెవ్వరేది, గోరిననది యిచ్చునట్టి వాఙ్మూర్తియౌ దేవి నన్ననుగ్రహించుత!

తిరిగి ఆతడే ఇట్లనినాడు:

"జిహ్వే దేవి సరస్వతీం భగవతీమగ్రే సమగ్రాం కురు
త్వాం బద్ధాంజలి రాజశేఖరకవిస్సోఽయం స్వయం యాచతే
స్తుత్యేఽస్మిన్నిజవంశమౌక్తికమణే రామే విరామే ద్విషామ్
కుంఠా మే ప్రతిభైవ దైవతవశాద్వాచాం ప్రవృత్తిర్యది."

ఓ జిహ్వా! ముందు సంపూర్ణముగా సరస్వతీమాతను స్తుతించి ఆవాహన జేసికొనుము. ఈ రాజశేఖరకవి కై మోడ్చి నిను వేడుకొనుచున్నాడు. స్తోత్రార్హుడు నిజవంశముక్తామణి రాక్షసకుల విరాముడునైన రామునిస్తుతిపట్ల నా ప్రతిభ మొక్కపోయినది. ఆ అమ్మ అనుగ్రహమున మహోజ్జ్వల వాక్ప్రసార మేర్పడునేని దివ్యముగా రామకథను వ్రాయుదును.

మారి:- ఇట్లు ప్రార్థించినవాడేల పొగడ్తకెక్కడు?
సూత్ర:- దైవజ్ఞుని పొగడ్తగాంచినాడు కదా!
"బభూవ వల్మీకభవః కవిః పురా
తతః ప్రపేదే భువి భర్తృమేంఠతామ్
స్థితః పునర్యో భవభూతిరేఖయా
స వర్తతే సంప్రతి రాజశేఖరః."

కవినామము మొదట వాల్మీకిని, పిదప భర్తృమేంఠుని, తరువాత భవభూతిని ప్రస్తుతము రాజశేఖరుని ఆశ్రయించి చరితార్థమైనదని దైవజ్ఞుడు స్తుతించినాడు. ఇతడే కాదు - సభ్యుడైన శంకరవర్మయు పొగడినాడు:

"పాతుం శ్రోత్రరసాయనం రచయితుం వాచస్సతాం సమ్మతా
వ్యుత్పత్తిం పరమామవాప్తుమధిం లబ్ధుం రసస్రోతసః
భోక్తుం స్వాదుఫలం చ జీవితతరోర్యద్యస్తి తే కౌతుకం
తద్భ్రాతశ్శృణు రాజశేఖరకవేస్సూక్తీః సుధాస్యందినీః."

చెవులచే రసాయనం చవిచూడ, సదుక్తుల కూర్పునొనర్ప, అపార పాండిత్యము సంపాదింప, ఉదారరసస్రోతస్సులో నోలలాడి దరిజేర జీవిత సత్ఫలము నను భవింపను గోరుదువేని సోదరా! రాజశేఖరుని సుధానిష్యందములౌ సూక్తులను సేవింపుము.

మరియు, అతడు :-

"ఆపన్నార్తిహరః పరాక్రమధనః సౌజన్యవారాంనిధిః
త్యాగీ, సత్యసుధాప్రవాహశశభృత్కాంతః కవీనాం గురుః
వర్ణ్యం వా గుణ రత్నరోహణగిరేః కిం తస్య సాక్షాద సౌ
దేవోయస్య మహేంద్రపాలనృపతిః శిష్యో రఘుగ్రామణీః."

కవిగురువగు ఈ రాజశేఖరుడు ఆపన్నార్తి హరుడు, శౌర్యధనుడు, సౌజన్యజలధి, వదాన్యుడు, సత్యసాగరమునకు చంద్రుడు, కమనీయుడు, గుణ రత్నములకు రోహణగిరివంటి వాడు, రఘువంశీయుడౌ మహేంద్రపాల మహా రాజే ఇతని శిష్యుడైనపుడు ఇతని గూర్చి వేరు వర్ణింప బనిలేదు. (అని శంకర వర్మ స్తుతించినాడు)

(ధ్రువాగానము తెరలో వినబడును)

"ముక్తహరిణాంక మండల పార్శ్వప్రసరో బుధో విబుధవర్గః
అవతీర్య రాహువిధురం నలినీనాథం సముల్లిఖతి."

బుధ విబుధ సమూహము విధుమండల సాన్నిధ్యమును విడనాడి తమో విదురుడౌ గగనమణి సన్నిధి కేగి సముల్లిఖించెదను. (అను ధ్రువ వినబడును.)

సూత్ర :- సభాసదుల ఆదేశమును గ్రహించి కుశలులగు కుశీలవు లుపక్రమించినట్లున్నది. లేనియెడల శునశ్శేఫుని ప్రవేశము దెల్పు ధ్రువ యేల వినబడును? ధ్రువ యనగా నాటకమునకు తొలిప్రాణము.

"ప్రథయతి పాత్రవిశేషాన్ సామాజికమనాంసి రంజయతి
అనుసందధాతిచ రసాన్ నాట్యవిధానే ధ్రువా గీతిః."

నాట్యమందు ధ్రువాగీతి రంగమున ప్రవేశించెడి పాత్రలను వెల్లడించును. సామాజికుల మనస్సునకు సంతోషము చేగూర్చును. సకల రసముల ననుసంధింప జేయును.

ఇట ప్రరోచన కడు విస్తారముగా కలదు. కవి ప్రశంస బహుళముగా నొనరింపబడినది. వాల్మీకి స్తుతి, సరస్వతీ స్తుతియు కలదు. సింగభూపాలుడు పేర్కొనిన ప్రౌఢత్వము సరిగా సమన్వితమగును. కొంత ఔద్ధత్యము లేకపోలేదు. కాని దేశకాల ప్రశంస కానరాదు. బహిర్లాపికను బట్టి నట సభ్య ప్రశంసయు ఆక్షిప్తమగుచున్నది. శునశ్శేఫ పాత్ర సూత్రధారోక్తి వలన ప్రవేశించుటచే ప్రయోగాతిశయము.

ప్రతాపరుద్ర కల్యాణము : విద్యానాథుడు

భద్రాం కౌతుకవేదిమాగతవతోరన్యోన్యమా సేదుషో
శ్శైలై ర్మేరు హిమాచల ప్రభృతిభి ర్దేవైస్సహేంద్రాదిభిః
వ్యాప్తాం పార్శ్వయుగే పురోంబుజభువా పశ్చాచ్చ మేనాదిభి
స్సాధ్వీభి శ్శివయో రపాంగసరణి ర్వైవాహికీ పాతు వః.

ఇంద్రాది దేవతలొకవైపు, మేరు హిమాలయాదులు మరియొకవైపు, ముందు వైపు బ్రహ్మ, మేనాదిసతులు వెన్కవైవు పరివేష్టించి కొల్వ వివాహవేదిక నధిష్ఠించియున్న గౌరీశంకరుల కల్యాణాపాంగ సరణి మిమ్ము రక్షించుత! (ప్రతాపరుద్రునకు కాకతీయ రాజ్యలక్ష్మి ప్రాప్తియను కావ్యార్థము సూచింపబడినది. ఇది ద్వావింశంతిపద. ఆశీరూప. నాంది.)

దేయాత్సిద్ధిం మహాలక్ష్మి ర్జగద్రక్షాధురంధరా
విష్ణు వక్ష స్స్ఫురన్మాలా విహితాలయతోరణా.

విష్ణు వక్షస్థ్సలమున మాలయై దివ్యమందిరమున తోరణ లీలయునై వెల్గుచున్న మహాలక్ష్మి జగత్తును రక్షించుచు అభ్యుదయముల నొసగుత! ప్రతాప

ద్రుని రాజ్యలక్ష్మి జగన్మంగళముల నొసగునను కావ్యార్థము సూచితము. రెండు శ్లోకముల పాదములనుబట్టి అష్టపదానాంది.)

(నాంద్యంతమున)

సూత్ర - (అంతట కలయజూచి) రంగాలంకరణమంతయు ఒనగూడినది. అదిగో!

ఆవిష్కుర్వంతి మురజా స్సర్వతశ్శబ్దమాధురీమ్
సంగీతోపనిషద్విద్యాం వీణాః ప్రస్తావయంత్యమూః.

నాదమాధురి జాలువార మురజములు మ్రోగుచున్నవి. సంగీత విద్యా రహస్యములను వీణియలు ప్రస్తావించుచున్నవి. (ఇందు రంగాలంకరణ విధానము సూచింపబడినది.)

(సంతోషమున)

భూభృత్సుతామహాదేవౌ పితరౌ యస్య విశ్రుతౌ
నరనాగాకృతి శ్శ్రీమాన్ స దేవ శ్శ్రేయసేஉస్తు వః.

భూభృత్సుతా మహాదేవుల ముద్దుబిడ్డడు, నరనాగాకారుడు, రమణీయుడు నైన వినాయకుడు మీకు శ్రేయస్సు గూర్చుగాత!

(ముమ్మడాంబా మహాదేవరాజుల ముద్దుబిడ్డడు, పురుషశ్రేష్ఠులౌ నల నహుషాదుల బోలినవాడు, రూపకనాయకుడైన ప్రతాపరుద్రుడను కావ్యార్థము సూచితము.)

(పైకి చూచి) ఔరా ఇప్పటికి అనుకూల సమయ మేర్పడినది. దుర్దినములు తొలగి దిక్కు లెంతో ప్రసన్నముగా నున్నవి చూడుడు.

విహరద్రాజహంసశ్రీ ర్విలసన్మిత్ర మండలః
ప్రసాదయతి సన్మార్గం ప్రసన్న శ్శరదాగమః

రాయంచల సొబగు విలసిల్ల, సూర్యబింబము విస్ఫురింప శరదాగమము ఆకాశమునకు వన్నె దిద్దుచున్నది. (రాజశ్రేష్ఠులకు సిరి, ఆప్తుల కుల్లాసము కలుగ ప్రతాపరుద్రుడు రాజపదవి చేబట్టి ధర్మ మార్గమును వన్నె దెచ్చుచున్నాడను కావ్యార్థ మీ ఋతుగాన శ్లోకమున సూచింపబడినది. ఇది కాలప్రశంస.)

(సభ వైపు తిరిగి చేతులు జోడించి) మధ్యమ భువన భాగధేయ వివర్తము ఏకశిలానగర పుణ్యరాశియు కాకతి కులదేవతయునైన స్వయంభూదేవుని మహోత్సవమున పాల్గొనిన విబుధులారా! నాట్య వేదాచార్యుడౌ కలార్ణవుని పుత్రుడను, అభినయ దర్పణ బిరుదాంచితుడనగు నన్ను ఏదేని రూపకమును ప్రయోగింప నియోగించి అనుగ్రహింపుడు. (ఆకాశమువైపు చెవియొగ్గి) ఆఁ. ఏమనుచున్నారు?

యస్మిన్ జగన్మంగళ మస్తి వస్తు
యస్మై స్వయంభూ స్స్పృహయ త్యజస్రమ్
తచ్ఛ్రోత్రయో ర్లోచనయోః పథా న్నః
శృంగాటకం నాటక మావిరస్తు.

స్వయంభూదేవునకభీష్టమై జగన్మంగళకరమైన వస్తు వేనాటకమున కూర్చబడినదో, చక్షుశ్శ్రవః పేయమౌ ఆ నాటకమును ప్రయోగించుము అనియా? (సంతసమున) నేను మనస్సులో ననుకొనినట్లే ప్రతాపరుద్ర దేవుని చరిత్ర మితివృత్తముగానున్న రూపకమును ప్రయోగింపవలెనని సభాసదుల ఆదేశము. ఔరా? అన్నిటిని చక్కగా కూర్చినాడు నేడా విధాత.

సభా స్వయంభూపరమేశ్వరస్య ప్రతాపరుద్రస్య గుణా మహార్ఘాః
అహం చ నాట్యశ్రుతిపారదృశ్వా సుధాముచ స్తస్య కవేశ్చ వాచః.

ఈ సభయో సాక్షాత్తు స్వయంభూదేవునిది. ప్రతాపరుద్రుని గుణములో మహార్ఘములు. నేనును నాట్యవేద మర్మజ్ఞుడను. కవి వాక్కులో సుధా నిష్యందములు (ఇందు సభా నాయక నట కవి ప్రశంస కావింపబడినది.)

(ఆలోచించినట్లభినయించి) నా సంగీత శారిక నేడేల విలంబించుచున్నది?

నటి :- (ప్రవేశించి ముందువైపు చూచి)

కిం భారత్యా శ్రూయతే మంజీరరవః సభాయాం విహరంత్యాః
అథ సంగీతశ్రుతిర్వా విజ్ఞాతం నాట్యప్రముఖతూర్యనినాదః.

ఇది సభా విహారము సల్పు సరస్వతీదేవి మంజు మంజీర శింజితమా? లేక ఏపారు సంగీతశ్రుతియా? ఇది నిక్కువముగా నటాగ్రేసరుడు సల్పు తూర్యనాదమే.

(శ్రుతిసామ్యమున ననేకార్థములు యోజింపబడుటచే నిది త్రిగతమను వీథ్యంగము)

(సమీపించి) ఆర్యపుత్రా! ఇదిగో వచ్చినాను. ఆజ్ఞాపించుడు.

సూత్ర: - ప్రేయసీ!

యద్గేహే కలకంఠనాదమధురం గాస్యామి గీతిం ధ్రువాం
లాస్యం చారుభి రంగహారలలితై రావిష్కరిష్యామి యత్
రమ్యం యత్కిల రంగమంగళవిధిం సంపాదయిష్యా మ్యహం
ప్రాగిత్యుక్తవతీ తదద్య నిపుణే! నిర్వ్యూఢ మేవం త్వయా!

కోకిలాలాపపేశలముగా ధ్రువాగీతి నాలాపింతును. లలితాంగహారోల్లసితముగా లాస్యము జేతును. పరమరమణీయముగా రంగమంగళవిధి నొనగూర్తునని ఇంటిలో ఎన్నియో పల్కినావు. ఇప్పటికి అవి పల్కులుగానే ఉండిపోయినవి. (మంచి మాటలవలె పైకి తోచినను నిజమున కవి అప్రియముగా నిందితములుగానే పర్యవసించుటవలన ఇది ఛలమను వీథ్యంగము.)

నటి : (భీతితో) నాట్యసామగ్రి నొనగూర్చుటలో ఇంత విలంబమైనది. ఆర్యపుత్రా! అంతయు సిద్ధమైనది. ఏ రూపకమును ప్రయోగింతము?

సూత్ర :- ఇదిగో, దీని నభినయింతము (అని పత్రిక నిచ్చును)

నటి:- (తీసికొని ఇట్లు చదువును)

తేజః పర్యాయహరయోః కిం కిం సంబోధనం మతమ్
కిమాశీర్వాదవిషయః విద్యానాథకృతిశ్చ కా.

తేజః పర్యాయపదముల సంబోధన లెట్లుండును? పండితు లాశీర్వదించు విషయమేమి? విద్యానాథుని కృతి యెయ్యది?

(ఇది బహిర్లాప యను నాళిక) (చిరునవ్వుతో) నేర్చినవారి మాటలలో నేదియో గూఢభావమున్నది. దీని సమాధానము మీరే విప్పి చెప్పుడు.

సూత్ర:- ప్రేయసీ! స్పష్టముగా నున్నది. ప్రతాపరుద్ర కల్యాణమని తెలుచునేయున్నది. (ఇది నిగూఢార్థమౌ నాళిక)

నటి:- ఏమి? ఈ నాటకము కథానాయకుని శుభనామముతో విలసిల్లు చున్నదా! ఈ రాజు శుభనామమున ప్రతాప యను ఉప పదమెట్లు ఏర్పడి యుండును?

సూత్ర:- ప్రేయసీ వినుము.

తం సుజాతం సముద్వీక్ష్య క్షోణ్యాం రవిమివోదితమ్
ప్రతాపరుద్ర ఇత్యాఖ్యా మకరోత్ కాకతీశ్వరః.

ఉదయించెడి సూర్యుని తేజస్సు ఉట్టిపడుచుండ గుణాభిరాముడై పుట్టి తన పుత్రునకు ప్రతాపరుద్రుడను నామమిడినాడు కాకతీశ్వరుడు.

మరియు-

విష్ణో ర్వైశ్వైక వీరస్య కాతతీయకులే స్థితమ్
అవతారమముం జ్ఞాత్వా వీరరుద్రం ప్రచక్షతే.

జగదేకవీరుడౌ విష్ణువు కాకతి వంగడమున నావిర్భవించినాడు. అతని ఈ యవతారమునకు విజ్ఞులు వీరరుద్రుడను నామమిడినారు.

నటి :- ఈ ప్రభువుగారి రెండు పేర్లును ప్రజల కర్ణయుగళి చేసికొనిన నోముల పంటలు. లోకమంగళమౌ కాకతీంద్రుని చరిత్రము నభియింప నవకాశ మేర్పడుటచే మన నాట్య విద్యానువృత్తి చరితార్థమైనది. (నాట్య ప్రసంగ మూలమున ప్రకృతార్థము సంబద్ధమగుటచే నిది అవలగితమను వీథ్యంగము.)

సూత్ర : ప్రేయసీ! నిజముగా నీ యీ ప్రసంగము ప్రజ్ఞాపాటవమునకు ప్రతీక. కవు లీ విధముగానే ప్రశ్నోత్తరమాలిక గూర్తురు.

"కిం లోకశ్రవసో ర్భాగ్యం మంగళశ్రవణం ముహుః
కిం మంగళం ప్రతాపాంకరుద్రస్య చరితాద్భుతమ్."

లోకుల కర్ణయుగళికి భాగ్యమెయ్యది? మంగళకథా శ్రవణము. మంగళ కథ యెయ్యది? ప్రతాపరుద్రుని దివ్యచరిత్రయే! (ఇది ప్రశ్నోత్తర మాలికా రూపమున నున్నందున ఉద్ఘాత్యకము.)

నటి : మీరు ఏర్చి కూర్చిన వన్నియు సమంజసముగా నుండును.

సూత్ర : ప్రేయసీ!

"త్వయా దారై రుదారశ్రీ ర్నాట్య సంపదియం మమ
ప్రబంధలక్ష్మీ రిత్యేవ విదర్భ ఫణితిస్ఫ్రుశా."

కవితాలక్ష్మి వైదర్భీరీతిచే వెలుగునట్లు నా నాట్యసంపద నీ పాణిగ్రహణ ప్రభావముచే విలసిల్లుచున్నది. (ఇందు పరస్పర స్తుతి యున్నందున ప్రపంచము.)

నటి : ఇట్టి గుణరత్నములతో నమూల్యమై విలసిల్లు ప్రతాపరుద్రుని చరిత్ర గ్రథింపబూనిన ఆ కవికి సంపూర్ణముగా సరస్వతీ మాతృప్రసాదము చేకూరియుండును.

సూత్ర : వాస్తవము. కవిభారతులకు జరిగిన వాక్కేళిని వినుము.

మాతర్భారతి వత్స కిం తవ కృపాం యాచేఽద్య కిం ప్రస్తుతం
జిహ్వా కాకతివీరరుద్రనృపతౌ స్తోత్రాయ సన్నహ్యతి
జ్ఞాతం తే విహరంతు వాగ్లహరయస్సంధానటద్ధూర్జటి
త్వంగన్మౌళితరంగిణీకలకలారంభ ప్రియంభావుకాః.

తల్లీ భారతీ! పుత్రా ఏమి? నీ కృప గోరుచున్నాను. పుత్రా ఏమని? జననీ! ప్రతాపరుద్రుని గుణములను వర్ణింప నా జిహ్వ సన్నద్ధపడుచున్నది. పుత్రా కానిమ్ము. పరమేశ్వరుని జటాజూటమున తాండవమాడెడి వియన్నదీకల కలారంభములకు ప్రియంభావుకములే వాగ్వైఖరులు నీ జిహ్వాంగణమున విహరించుత! (ఇందు ఒండొరుల సంలాపమున్నందున వాక్కేళియను వీధ్యంగము.)

నటి :- ఇట్టి నరేంద్రుని చరిత్ర కనుగుణమౌ నాట్యవిద్యాసామగ్రి మన కున్నదా? అను భయముచే నా హృదయము వేపితమగుచున్నది.

సూత్ర :- (ఇంచుక అసూయ నభినయించి) ఆఁ. ఏమంటివి? నా నాట్య విద్యా సామగ్రి నిరవద్యమైనదే కాని నీ సంగీతమెంత యోగ్యముగా నుండునో చూడవలసియున్నది.

నటి :- (నవ్వుచు) ఇదిగో సంగీత సార సాగర మువ్పొంగుచున్నది. మీ రిక అవధాన నౌకనధిష్ఠించవలసినదే (ఒకరి నొకరు మాటలచే మించినందున ఇది అధిబలమను వీథ్యంగము)

సూత్ర : చిరకాలమునుండి సావధానుడనై యున్నాను. ఇదిగో మొదలిడ బడుచున్నది ధ్రువ. (నటి చేయవలసిన ధ్రువాగానములా నే చేసేదనని పొర పాటుచే నన్నందున ఇది గండము)

నటి :- ఓహో మీరు ధ్రువాగానము చేసెదరా? (అని నవ్వును)

సూత్ర :- నా మాట ముగియకముందే ఈ విరుగుబాటు? నాట్య విద్య యను నా వాక్య శేషము నీవు వినలేదు. కానిమ్ము. ఏదీ నీ ధ్రువాగానము విని పింపుము. (అన్న మాటను వేరుగా త్రిప్పికొన్నందున ఇది అవస్యందితము)

నటి :- (అట్లొనర్చును.)

లక్ష్మీస్సరస్వతీ చేయం ధవళిభూవనాంతరా విరాజంతీ
విలసత్కువలయశ్రీరాజ్ఞః ప్రసాధనం కురుతే.

అమల గుణములతో భువనాంతరము వెలుగునట్లు కువలయశ్రీ విలసిల్లు నట్లు రాజును లక్ష్మి సరస్వతులు కై సేయుచున్నారు (జలాంతరమున వైశద్యము కువలయములకు వికాసము కల్గుచుండ సరస్వతీనది చంద్రుని ప్రసాదించునట్లు రాజ్యలక్ష్మి లోకములకు ప్రశాంతత భూతలమున కళాకాంతులు చేకూరునట్లు ప్రతాపరుద్రుని నలంకరించు చున్నదని రెండర్థములు గ్రహింపవలయు.)

సూత్ర :- (విని రసావేశమున)

గాఢాలింగన సమ్మర్ద ప్రత్యక్షరగళత్సుధామ్
ధ్రువాం కరోమి సర్వాంగే శ్రోత్రైకామృతవర్షిణీమ్.

చెవులలో అమృతము గురిపించు ధ్రువను కౌగిట నదిమి ప్రత్యక్షరమున సుధ జిల్కించి సర్వాంగమున చొక్కుదును. (రసావేశమున అసంగతార్థము ప్రసగించుటచే ఇది అసత్ప్రలాపమను వీథ్యంగము)

నటి :- (ఉపహాసమున సుకుమారముగా నున్న ఇది మీ బిగి కౌగిలి నోర్వజాలదు సుమా! (హాస్యలోభకర మాటచే ఇది వ్యాహారమను వీథ్యంగము)

సూత్ర :- (సిగ్గుతో)
రసాస్వాదేన తరళా యే మాద్యంతి విపశ్చితః
త ఏవ భావుకా లోకే భవంతి హృదయాళవః

రసాస్వాదమత్తులై ఎవరు తమ దేహమునే మరతురో వారే భావుకులు. వారే సహృదయులనదగినవారు (ధ్రువను కౌగిటజేర్చి సౌక్కుదునని తా జేసిన దోషమును ఇట్లు గుణముగా నిరూపించుటచే ఇది మృదవమను వీథ్యంగము.)

నటి :- సరిలెండు. అనంతరకరణీయ మానతీయుడు.

సూత్ర :- ఇదిగో సభాపతియౌ స్వయంభూదేవుని స్తుతి వినుము:
సర్వాంగవిలసత్సర్వమంగళాలంకృతా కృతేః
రుద్రస్య మహిమా భాతి విశ్వానుగ్రహకారిణః.

సర్వ మంగళాలంకృతచారుమూర్తి భువన కల్యాణకరుడు నౌ రుద్ర దేవుని మహిమ నిర్నిద్రముగా వెల్గుచున్నది. (సర్వ లక్షణ సంపన్నుడు లోక క్షేమంకరుడునైన ప్రతాపరుద్రుని మహిమ విలసిల్లుచున్నదను కావ్యార్థము ద్యోతితము).

(తెరలో సర్వాంగ విలసత్సర్వ మంగళాలంకృతా కృతియే సుమా ఈ రుద్రుడు)

సూత్ర :- (విని సంతోషముతో) కుశలులౌ మా కుశీలవులు నా మాట తలదాల్చి ప్రకృత కార్యమునకు గడగినట్లున్నారు. అదిగో కాకతీశ్వరుని స్తుతింప వెళ్ళెడి వైతాళికుల మాటలు వినవచ్చుచున్నవి. కావున మనము తరువాతి కార్య మనుష్ఠింతము (అని నిష్క్రమింతురు. సూత్రధారోక్త్యనుసారము వైతాళికులు ప్రవేశింతురు కావున ఇది ప్రయోగాతిశయము. ఈ ప్రస్తావనలో మొత్తము వీథ్యంగములు సమన్వయింపబడినవి).

## శ్రీవేదాంత దేశికులు: సంకల్పసూర్యోదయ నాటకం

"యద్భక్తి ప్రచయాత్మకే దినముఖే దృష్టి క్షమః క్షేత్రిణః
క్షిప్రం సంసృతి శర్వరీం క్షిపతి యత్సంకల్పసూర్యోదయః
తత్త్వైరస్త్ర విభూషణై రధిగతః స్వాధీననిత్యోన్నతిః
శ్రీమాన్ అస్తు స మే సమస్తవిపదుత్తారాయ నారాయణః"

ఏ శ్రీ మన్నారాయణుని యందలి పరమ భక్తియను ప్రత్యూష వేళలో పరమ భక్తులకు జ్ఞాన గోచరమగుచు వివిధ చేతనుల జనన మరణాది రూపమౌ సంసృతి యను తమిస్రను ప్రారబ్ధ కర్మావసానమున తొలగించు చున్నదో, దివ్యాస్త్ర భూషణోజ్జ్వలుడు, సకల లోకౌన్నత్యములు కైవస మయినవాడు, ఉభయ విభూతి నాయకుడునౌ యా శ్రీ మన్నారాయణుడు నా విపత్తులన్నియు తొలగించు గావుత!

ఇట "తత్రైవ రత్న విభూషణై రధిగతః" అని అనుటవలన సకల తత్త్వములకు 'శేషి' అనునది ద్యోతితము. దీనివలన సమన్వయాధ్యాయార్థము సంగ్రహింపబడినది. "స్వాధీన నిత్యోన్నతిః" అనుటవలన అవిరోధ లక్షణార్థము. "సంసృతిశర్వరీం క్షిపతి" అనుటచే ఫల లక్షణార్థము. "తత్రైవః" అనుటచే లీలా విభూతి యోగము. "శ్రీమాన్" అనుటచే నిత్య విభూతి యోగ సౌలభ్యములు సూచితమైనవి. భక్తి మోక్ష హేతువనుటచే జ్ఞానము మాత్రమే మోక్ష హేతువనువారి వాదము పరాస్తమైనది. ఈశ్వరుని ఫల ప్రదాతృత్వము సమర్థింపబడుటచే కర్మ మీమాంసక వాదము. ప్రధానాదుల పారతంత్ర్యోక్తిచే సాంఖ్య వాదము, స్వాధీనోన్నత్యుక్తిచే ఉత్తీర్ణ బ్రహ్మవాది మతము, నిత్యోన్నత్యుక్తిచే క్షణిక వాదము, నారాయణోక్తిచే హైరణ్య గర్భ పాశుపతాది మతములు, 'శ్రీమాన్' అనుటచే నిర్విశేష బ్రహ్మవాదము నిరసింపబడినవి. మఱియు - భక్తి దృష్టి - శబ్దములచే వివేక వ్యవసాయ సుమత్యాది పాత్రలు, సంసృతిపదముచే మోహాది పాత్రలు, 'క్షిపతి' యనుట వలన వివేకాదికృత మోహాది భంగమను కావ్యార్థము సూచించబడినది. అస్త్ర పదముచే శంఖ, చక్రాబ్జాదులు సూచితము. అష్టాదశ పదా పత్రావళి నీలీ ఆశీ రూపానాంది. ఈ శ్లోకమున భక్త్యుపాయ మహిమను వర్ణించి ఉత్తర శ్లోకమున ప్రపత్తి మహత్త నభిస్తుతించుచున్నాడు.

"లక్ష్యే యత్ర శ్రుతిమిత గుణాకృష్టి లబ్ధా వధానైః
ప్రత్యగ్బాణః ప్రణవధనుషా సత్త్వ వద్భిః ప్రయుక్తః
మధ్యే వక్షః స్ఫురతి మహసా పత్రలః కౌస్తుభాత్మా
పద్మాకాంత స్స భవతు దయాదుగ్ధసింధుః శ్రియై వః"

ఈ శ్లోకమున "ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే, అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్" అను ఉపనిషదర్థము వివరింపబడినది. చెవిదాక లాగి గుఱి చెదరనీక క్రొత్త విల్లునుండి బలవంతులు ప్రయోగించిన ఱెక్కలు గల వజ్రసారమౌ బాణము పరపురుష వక్షోమధ్యమమున నాటబడి స్ఫురించునట్లు వేద ప్రతిపాదిత సత్యజ్ఞానానందాది కళ్యాణ గుణానుసంధాన విశేషమను ఆకర్ణాంత 'జ్యా' సమాకర్షణమున అవహితులైన సాత్త్వికులను బలవంతులు కౌస్తుభకాంతి పత్రి విచిత్రముగా ప్రయోగించిన (సమర్పించిన) ప్రత్యగాత్మయను బాణము లక్ష్యభూతుడౌ ఏ శ్రియఃపతి వక్షస్థలమున విరాజిల్లు చుండునో దయాపయః పారావారమౌ ఆ శ్రియఃపతి మీకు ఐహికాముష్మిక సంపత్సమృద్ధి నొసగుత! "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా సహ విపశ్చితా" అనునట్లు తత్సామ్యాపత్తిరూప మోక్షము ప్రపత్తి వలన సిద్ధించునను విషయము సూచింపబడినది. శ్లోకపాదము పదమనువారి మతానుసారము అష్టపదా నాంది.

నాంద్యంతమున

సూత్రధారుడు :- నిఖిల సురాసుర కోటీరకోటి మణికిరణ నికర నీరాజిత పాదపీఠుడు, శరణాగత పరిత్రాణ సప్రతంతు దీక్షితుడు, సరసీ రుహవాసినీ సహచరిత ధర్ముడు. సంసరణ దవ దహన తాప నిర్వాపణ మహా వలాహకుడు నగు సర్వేశ్వరుని శ్రీరంగము, వృషగిరి, సత్యవ్రతము (కాంచి), యదుగిరి, పురుషోత్తమము, పాండురంగము - మున్నగు అర్చావతారాభివ్యక్తి సమభ్యర్హములౌ దివ్య దేశములందలి యాత్రోత్సవములలో భగవత్సేవారసము గ్రోల నరుదెంచినవారు తమ చరణ ధూళీ ప్రసారముల చేత తత్తద్దేశముల పావన పరచినవారు, కావేరీ మధ్య దేశ విరాజమానమౌ శ్రీరంగము నధిష్ఠించినవారు, శేష శేషాశనగరుడ నిర్విశేషులు, అశేష జన సంభావనీయులు, అసంభవద వద్యగంధులు, అభిజన విద్యా సముచిత సదాచార శీల శీలురు. అనాది మాయా మహావర్త బంభ్రమ్య మాణ బాహ్య కథక రంభావన మథన గంధ సింధురులు, అధి జిగ మిషితముక్తి ఘంటా పథులు, అఖిల దిఙ్మండల శిఖండకులు, ఔపనిషద రహస్యోపదేశ దేశికులు, అవగత సకల కళా కలాపులు, అనవరత పరిచిత గంధర్వ విద్యాప్రసాదిత పరమ పురుషులునైన పూజ్య సభాసదుల ఆదేశమేమున

లలిత మనసాం ప్రీత్యై బిభ్రత్ రసాంతర భూమికా
మనవ గుణో యస్మిన్నాట్యే రసోనవమః స్థితః
జనన పదవీ జంఘాలార్తిచ్ఛిదా నృగుణీ భవ
న్నట పరిషదా తేన స్వాదం సతా ముపచిన్వతి.

సుకుమార మతులు మెచ్చునట్లు శృంగారాది భూమికలను దాల్చియు, అనవమముగా నున్న నవమ రసమౌ శాంతము మూలమున వివేకాది పాత్రల ప్రాముఖ్యమునను, సంసార మార్గమున నిరంతర సంచారము చేసెడి చేతనుల ఆర్తిని తొలగించు నాటకమును ప్రదర్శించుమని సభాసదుల ఆదేశము. (రంగ నాథ యాత్రోత్సవ మనుట దేశ ప్రశంస, అభిమత కాలప్రశంస, సభాసదుల ప్రశంసయు నొనరింపబడినది.) భరతమతోపాధ్యాయులైన సన్మార్గ వర్ధనుల వారి శిష్యుడైన సంతోష పాలకుడను శైలూష చక్రవర్తి పుత్రుడను ప్రతిభట కుశీలవ కుంజర కంఠీరవుడనై వైకుంఠ వినోదియను నేను ఉత్తమ నాటక ప్రయోజనముచే సభ్యప్రీతి కలిగింపని పక్షమున 'ప్రతిభట కుశీలవ కుంజర కంఠీరవ' యను బిరుదు త్యజింతునని ప్రతిజ్ఞా పూర్వకముగా వారి ఆదేశమును స్వీకరించితిని. దివ్య ప్రయోగమును దర్శింప సభవారు సమావేశ మగుచున్నారు చూడుము.

"అవధారిత నాట్య దేశి మార్గైరసమీచీన పరాఙ్ముఖైరమీభిః
భరతాగమ దైవతైరి వైషా పరిషత్ సంప్రతి భాసతే మహద్భిః."

నాట్య, నృత్త, నృత్యముల స్వరూప స్వభావములను బాగుగా పరిశీలించిన వారు, లక్షణ రహితములు, అసత్ప్రాయములైన నృత్తముల పట్ల వైముఖ్యము జూపువారు, నాట్యాధి దేవతలన్నట్లున్న పెద్దలచే ఈ సభ క్రిక్కిరిసి యున్నది. (సభ్యప్రశంస)

కావున చతుష్షష్టి కళా విద్యా వ్యాప్తికి మూలము, ప్రతి కల్పమున బహు విధ లీలావతారముల దాల్చియు తన పరమ పురుషత్వము గోల్పోవక అజ్ఞాన పరంపరా నివర్తకమున ఆదిమ దేవత నభిగమింతును.

"ప్రాచీ సంధ్యా కాచి దంతర్నిశాయాః ప్రజ్ఞా దృష్టే రంజన శ్రీరపూర్వా
వక్త్రీ వేదాన్ భాతు మే వాజివక్త్రా వాగీశాఖ్యా వాసుదేవస్య మూర్తిః."

అజ్ఞానాంధకారము పాలిటి ప్రత్యూష సంధ్య ప్రజ్ఞామయ దృష్టికి సితాంజన శోభ సర్వవేదముల ఆద్యోపదేష్ట్రి వాగీశ్వరియునైన వాసుదేవుని హయగ్రీవమూర్తి నా ఎదలో భాసిల్లుత!

(సరస్వతీ దక్షిణా మూర్త్యాదులు పారమ్య రహితములు హయగ్రీవుడు అవతారములలో నాదిమ మూర్తి కాన ఆదిమ దేవత యని పేర్కొనబడినాడు.

(వినయముగా నంజలి యొగ్గి)
"దేవో నశ్శుభ మాతనోతు దశధా నిర్వర్తయన్ భూమికాం
రంగే ధామని లబ్ధ నిర్భర రసైః అధ్యక్షితో భావుకైః
యద్భావేషు పృథగ్విధేష్వనుగుణాన్ భావాన్ స్వయం బిభ్రతీ
యద్ధర్మైరిహ ధర్మిణీ విహరతే నానా కృతిర్నాయికా."

వివిధ భావానుగుణముగా వివిధ భూమికలను దాల్చుచు అదే ధర్మమును నిర్వర్తించుచు 'నటి' తనకు సహకరించుచుండ నాటకాది దశవిధ రూపకముల నిర్వహించుచు రసాస్వాద లోలుపతా సామాజికులకు రంగస్థలమున సాక్షాత్కరించు ప్రధాన నటుని వోలె వివిధ విభవావతారముల యందు తదనుగుణ రూపములు దాల్చి అవే ఆశ్రిత రక్షణాది ధర్మములు గల్గి మహాలక్ష్మి తన వెన్నంటి యుండ దశరూపముల దాల్చుచు శ్రీరంగమున భగవదైకాంత్య ప్రేతులౌ బ్రహ్మవేత్తలకు మాత్రము గోచరించు శ్రీమన్నారాయణుడు మనకు సకల శుభముల నొసగు గాత!

(క్షణము నిల్చి ఏదో ధ్యానించినట్లు ఉల్లాసముగా) సర్వ పదార్థములకు ఏకైక మూలమగు ఆ పరమ పురుషుడు కటాక్షించినాడు.

"శ్రుతి కిరీట విహారజుషా ధియా
సురభితామిహ నాటకపద్ధతిమ్
ముహురవేక్ష్య వివేక ముపఘ్నయన్
మతమపశ్చిమ యామి విపశ్చితామ్."

వేద వేదాంత పరిశీలన పారీణమౌ ప్రజ్ఞాపాటవము పరిమళింప వివేక నాయకోపేతమౌ ప్రయోగము ద్వారా శ్రీ భగవద్రామానుజ యామున బోధాయ నవ్యాస ప్రతిపాదితము పరమ వైదికమునైన విశిష్టాద్వైత సిద్ధాంతమును సర్వ ప్రథమముగా వెల్లడింతును.

(తెరవైపుజూచి) ఆర్యా! ఇటురమ్ము.

నటి : ఆర్యా! ఆజ్ఞానియోగమేమి సెలవీయుడు.

సూత్ర : ఆర్యా! పరమ సాత్వికులైన సామాజికు లాదేశించిన నాటక భూమికా సంపాదనమున మన కుశీలవులు సన్నాహపడుచుండిరా?

నటి : ఆర్యా! నీ అవయవముల వంటివారు కుశీలవులు. నీ తలంపునకు భిన్నమేల జరుగును? ఏ రూపకమును ప్రయోగింప బూనినారు.

సూత్ర : వివేకమును నాయకునిగా నొనర్చి క్రొత్తగా కూర్చిన 'సంకల్ప సూర్యోదయ'మను నాటకము ప్రదర్శింపబూనుట నీ వెఱుగవా?

"భావం విదంతి పరమత్ర పరావరజ్ఞాః
ప్రజ్ఞాధనాః ప్రగుణ నూతన సంవిధానమ్।
యస్మిన్ గుణాస్తను భృతః సదసత్ప్రకారాః
పాత్రీ భవంత్యనుగుణైః అధిదేవతైః స్వైః॥"

జీవేశ్వర తత్త్వముల నెఱిగిన బ్రహ్మవేత్తలే ఈ అపూర్వసంవిధానకమౌ నాటకమును గ్రహింపజాలుదురు. ఈ నాటకమున జీవుని సద్గుణములైన వివేకాదులు, అసద్గుణములౌ మోహాదులు తమ తమ అధిదేవతలతో కూడ పాత్రలుగా నిబంధింపబడినవి. ఇంతేకాదు-

"వివేక ప్రాగల్భ్యస్ఫురిత రణవీర వ్యతికరః
పర బ్రహ్మోదంత ప్రకటిత దయావీర విభవః
ప్రబుద్ధ క్షేత్రజ్ఞస్థితి ఘటిత శాంతాకృతిరభూత్
ప్రయోగ శ్చిత్రోయం భవరస భుజామస్యభిమతః."

వివేకము మహామోహమును జయించుటచే వీరరసము పరాత్పరుని ప్రహ్లాద, విభీషణాది పరిత్రాణోదంత ప్రతిపాదన వలన దయావీరము స్వస్వరూప పర

స్వరూపముల నెఱిగి తదనుగుణముగా ననుష్ఠించు క్షేత్రజ్ఞుని స్థితి నుపాదించుట చేతను, ధీరశాంత రసమునను నవికల్గి పరమాశ్చర్యకరమౌ ఈ నాటకము ముముక్షువులకే కాదు, సాంసారికులకు కూడా అభినందనీయమగును.

ఈ రూపకము యొక్క ఉత్కర్షావధి నెన్నతరము కాదు. ఎన్ని శంఖములు సాగరమున జనింపలేదు? అవి పురుషోత్తముని పాణిపద్మము నలంకరించిన పాంచజన్యము లగునా? మఱియును—

"యే లోకానిహ వంచయంతి విరలోదంచన్మహః కంచుకా
స్తే తిష్ఠంతు మహద్గృహేషు మణయః కిం తైరిదం చింత్యతామ్
శ్రీవత్స ప్రతివేశ దీప్తరుచినా సార్ధం కిమా భాష్యతే
పద్మోల్లాసన దర్పణేన మణినా ప్రత్నేషు రత్నేష్వపి."

మణులు కొన్ని కొద్దిపాటి తేజస్సుతో అజ్ఞులను వంచించును. కాని, శ్రీవత్సము ప్రతిగృహమునందు దీపాయమానమై లక్ష్మీదేవి విలాసములకు దర్పణమై విరాజిల్లుచు భగవదేక భోగ్యమైన కౌస్తుభ మణికి అల్పతేజస్కములు అస్థిరకాంతికములునైన ఇతర ప్రాచీన, నవీన మణులకు పోలిక యుండునా! (భగవద్గుణానుభవ రాహిత్యమే గాక అనౌచిత్య భూయిష్ఠతయు గల శాకుంతలాదులు, నిష్ప్రపంచ నిశ్శ్లోక చిన్మాత్ర బోధైక తానములౌ ప్రబోధ చంద్రోదయాదులు, భగవత్స్వరూపగుణ విభూతి విగ్రహ పత్నీ పరిజనాది బహు ప్రపంచన పరమౌ ఈ సంకల్ప సూర్యోదయమునకు సాటిరావని తాత్పర్యము. కౌస్తుభ మను అప్రస్తుత వస్తు వర్ణన ద్వారా ప్రస్తుత కావ్య ప్రతిపాద్యమౌ వస్తువు సూచింపబడుటచే అవలగిత మను వీధ్యంగము. అప్రస్తుతార్థక కథనాత్ క్రియతే సూచనం తు యత్ పాత్రస్య వస్తునో వాపి నామ్నావలగితం హి తత్.)

వస్తు గౌరవముననే కాదు, మహాకవి గౌరవమునను ఈ రూపకము బహుమానార్హమైనది. ఏలనన—

"అపదిశ్య కిమప్యశేషగుప్త్యై నిగమాంతేషు నిరూఢగౌరవేణ
ప్రవిభక్తహితా హితః ప్రయోగః కవినా కారుణికేన కల్పితోఽసౌ."

కాంతా సమ్మితముగా పరమ తత్త్వోపదేశము కావింపవలయునను వ్యాజమున వేదాన్తమునం దాచార్య ప్రసిద్ధిని గాంచిన మహానుభావుడు నిఖిల చేతనోజ్జీవనార్థము హితాహితప్రవృత్తి నివృత్తి బోధకమమౌ ఈ నాటకము నిర్మించినాడు.

నటి : (కౌతుకమున) ఆర్య! అశేష విద్యా వైదుషీ భూషితులౌ సభాసదుల గౌరవమునకు పాత్రమైన ఈ నాటకమును వ్రాసిన వారెవరు?

సూత్ర : ఆర్యా! నీవు వినలేదా? సమస్త లోక సంభావనీయుడు, విశ్వాతిశాయి, విశ్వామిత్ర గోత్ర భూషణుడు, విశుద్ధ విద్యా విహార పుండరీకుడు, పుండరీకాక్ష సోమయాజి పౌత్రుడు, అనంత గుణ శేవధియునైన అనంత సూరి పుత్రుడు, శ్రీ రంగరాజ దివ్యాజ్ఞాలబ్ధ వేదాంతాచార్య పదవీకుడు, కవితార్కిక కేసరియను ప్రఖ్యాత గుణ సమాఖ్యుడు. ఛాత్రజన నిబద్ధజైత్ర ధ్వజ ప్రసాదిత దశదిశాసౌధుడు, సర్వతంత్ర సంకట ప్రశమన విశంకట శేముషీకుడునైన శ్రీ మద్వేంకట నాథుడీ మహోత్తమ నాటకమును ప్రసాదించినాడు.

"గౌడ వైదర్భపాంచాల మాలాకారాం సరస్వతీం
యస్య నిత్యం ప్రశంసంతి సంతస్సౌరభవేదినః"

సరస కవితా సౌరభ మెఱిగిన తత్త్వజ్ఞులు గౌడ, వైదర్భ, పాంచాల మాలా లాలితాకారమౌ ఏ మహాదేశికుల భారతీమతల్లికను ప్రశంసింతురో

"అన్యేంద్రకం భువన మన్యద నిద్రకం వా
కర్తుం క్షమే కవిరభూదయమన్వవాయే
జన్మ ద్వితీయ మృషిభిః కథితం యతస్సా
దేవీ చ విశ్వజననీ యదనన్య గోత్రా."

లోకమున కంతటికి వేరే వ్యక్తిని ఇంద్రునిగా నొనర్ప జాలినవాడు, లేదా లోకము నింద్ర రహితముగా నైనను సృష్టింప సమర్థుడునైన విశ్వామిత్రమహర్షి వంశమున బ్రాహ్మణత్వమును ప్రసాదించెడి గాయత్రీ దేవికి సగోత్రుడుగా నుదయించినవాడు (గాయత్రీ మంత్రమునకు 'విశ్వామిత్రర్షిః సవితా దేవతా' అన్నట్లు విశ్వామిత్రుడు ఋషి యని, శ్రుతి వాక్య మనుసంధింపబడినది.) మఱియు—

"విశ్రాసినీ విబుధవైరి వరూధినీనాం, పద్మాసనేన పరిచార విధౌ ప్రయుక్తా
ఉత్ప్రేక్షతే బుధ జనైరుపపత్తి భూమ్నా, ఘంటాహరేః సమజనిష్ట
యదాత్మనేతి."

కుదృష్టులైన విబుధ విరోధులకు హృదయకంపము నాపాదించుచు, శ్రీమన్నారాయణుని సమారాధనలో నుపయోగపడెడి ఘంట ఏ దేశికుని రూపమున అవతరిల్లినదని తాత్త్వికులు భావింతురో— (పూర్వము వేదాంతాచార్యుల తండ్రి పుత్రసంతానము నభిలషించి శ్రియః పతి నారాధింప నాతడు స్వప్నమందు తన ఘంట నొసగినాడని దాని మూలమున ఆమె గర్భవతియై ద్వాదశాబ్దముల పిదప వేదాంతాచార్యు లుదయించి రను ఐతిహ్యము కలదు. "వేదాంతాచార్యజననీ వరపుత్రాభిలాషిణీ, స్వప్నే ద్వాదశాబ్దం పతివ్రతా తత్తో జిజ్ఞే గురురయం వేదాంతాచార్య శేఖరః.")

"వింశత్యబ్దే విశ్రుత నానావిధ విద్యః
త్రింశద్వారం శ్రావిత శారీరక భాష్యః
శ్రేయః శ్రీమాన్ వేంకటనాథః శ్రుతిపథ్యం
నాథ ప్రీత్యై నాటక మర్థ్యం వ్యధితైతత్."

ఆ మహాదేశికుడు వేంకటనాథాచార్యుడు ఇరువది వత్సరముల ప్రాయముననే శ్రుతి - స్మృతేతిహాస శాస్త్రాది వివిధ విద్యావైదుషి పరమావధిని గడించినాడు. ముప్పది పర్యాయములు భగవద్రామానుజుల శ్రీభాష్యమును ప్రవచనము చేసినాడు. ఆ దేశిక సార్వభౌముడే శ్రీరంగనాథప్రీతికై సుహార్థ గర్భితము, శ్రుతి సతీ హృదయ మర్మజ్ఞమునైన ఈ సంకల్ప సూర్యోదయ నాటకమును నిర్మించినాడు.

నటి : ఆర్యా! వేదాంత వితాన నందిత మానసుడౌ కర్కశ, తర్క కులిశ విస్ఫుటిత పాషండ ద్రుమషండ యౌ భారతి మన బోటి వారి అభినయ ప్రయోగమున కుపకరించునా?

సూత్ర:- (అంతర్హాసముగా) ఆర్యా! నీ మాటలో రెండు ప్రశ్నలు కలవు. అందు మొదట పరమాత్మగుణానుసంధానమున పరవశుడగు నితనికి కవితాసక్తి

ఏల యనునది మొదటి ప్రశ్న. కఠిన వాగ్వ్యాపారము గల తార్కికునకు లలిత కవితావైచిత్రి ఏల అలవడునను నది రెండవ ప్రశ్న కదా? అందు మొదటి ప్రశ్నకు సమాధానము వినుము

"మనువ్యాస ప్రాచేతస పరిషదర్ఘ్యా క్వచిదియం
సుధాసిక్తా సూక్తిః స్వయముదయ మన్విచ్ఛతి జనే
నిరుంధ్యుః కే వింధ్యాచల వికట సంధ్యానట జటా
పరిభ్రాంతా పంగోరుపరి యది గంగా నిపతతి."

బ్రహ్మవేత్తలు మను, వ్యాస, ప్రాచేతసుల ప్రభావము సంతరించుకొనియు అమృతమాధుర్యము సృజించెడి సూక్తి ఒకానొక వ్యక్తి ముఖమున ఆవిర్భవింప బూనినపుడు నిరోధించువా రెవరు? వింధ్యాచల విశాలమౌ నటరాజ జటాతటమున విహారముసల్పెడి గంగానదియే స్వయముగ కుంటివానిపై ప్రసరించినపుడు అడ్డగించువారుందురా?

ఇక రెండవ ప్రశ్నకు సమాధానము వినుము- "గంభీర భీషణ గతిర్గిరి ఖండనాదౌ చూడాపదమ్ పశుపతే రపి ఘూర్ణయంతీ, స్వాదుప్రసన్న సుభగాని వసుంధరాయాం స్రోతాంసి దర్శయతి కిం న సురస్రవంతీ"-హిమాలయాదులను తన గంభీర భీషణగతులచే అభిఘాత మొనరించునదైనను పశుపతి జటాజూటము ననే అస్తవ్యస్తము చేయజాలినదైనను గంగానది భూతలమున మాత్రము స్వాదు ప్రసన్న సుభగములౌ పాయలతో ప్రవహించుట చూచుటలేమా? (బాహ్యులు, కుదృష్టులు మొదలగు దుర్వాదులను ఖండించు విషయమున తర్కకార్కశ్యము ప్రదర్శించినను ఇతని భారతి నాటకమున లలిత లలితోదార మధురమై విరాజిల్లునని తాత్పర్యము. ఇందు ప్రశ్నోత్తరరూపమౌ ఉద్ఘాత్యకమను వీథ్యంగము నిబద్ధము.)

నటి:- (ఆనందముతో) ఆర్యుని మాట యుక్తియుక్తముగా నున్నది. కాని గంధర్వాగమ కోవిదులంగీకరించని శాంతరస నివేశ మీ నాటకమున ఎట్లు యుక్తమగును?

సూత్ర :- (అనాదార గోపన పురస్సరముగా) ఆర్యా! శాంతము నంగీకరింపని వారు భరతాగమ కోవిదులు కారని నా యభిప్రాయము. (ఆలోచించి)

"అథవా తాదృశాన్ సభ్యాన్ మత్వా జగతి దుర్లభాన్
శంకే శాంతిరసోల్లాస మశక్య మభిమేనిరే."

లేదా, శాంతరసాభినయము జూచెడి సామాజికులరుదను ఉద్దేశమున శాంతరస ప్రయోగ మశక్యమని పూర్వులు తలచి యుందురని భావింతును. మఱియు—

"అసభ్యపరిపాటికామధికరోతి శృంగారితా
పరస్పర తిరస్కృతిం పరిచినోతి వీరాయితం
విరుద్ధ గతి రద్భుత స్తదల మల్పసారైః పరైః
శమస్తు పరిశిష్యతే శమిత చిత్తభేదో రసః."

శృంగార చేష్టలు (కృత్యము) అసభ్యత నాపాదించును. వీరకర్మ పరస్పర తిరస్కారావహము. ఇక బీభత్సాదు లుద్వేగకరములగుట వలన అల్ప సారములు. మనో వ్యధను తొలగించి చిత్తమునకు నిర్వృతి నొసగూర్చునది శాంత మొక్కటే.

నటి :- ఆర్య! ఆ శాంతరసము సనకసనందనాదిమునిజనాదృతముగా వచ్చును. ఐన కరణ వ్యాపార రహితమౌ యోగము ప్రధానముగా భాసిల్లు నియ్యది సర్వజన ప్రేక్షణీయమౌ నాటక వృత్తాంతమున నెట్లు సంపాదిత మగును?

సూత్ర :- ఆర్య! మనము సాంఖ్య మతానుయాయులము కాము. మోక్ష ధర్మ పద్ధతి నియతములునైన వ్యాపారములు గీతాచార్యు డడుగడుగున బోధించిన వెన్నియో కలవు. ఆ వ్యాపారముల ననుకరించి సామాజికులను మెప్పించుటయే మనబోటి రంగోపజీవుల జీవిక కవకాశమున వచ్చును. మఱియు నాట్య వైభవము తిలకింతుము.

"న తచ్ఛాస్త్రం న సా విద్యా న తచ్ఛిల్పం న తాః కళాః
నాసౌ యోగో న తద్ జ్ఞానం నాటకే యన్న దృశ్యతే."

(నాట్యమున కంగము గాని) నాట్యము నందు ప్రతిపాదింపబడని శాస్త్రముగాని, విద్యగాని, శిల్పముగాని, కళలుగాని, యోగముగాని, విజ్ఞానము గాని లోకమున వేఱొకచో నగుపడవు. అని పరంపరగా వినవచ్చు సూక్తిని వినకుంటివా?

నటి :- అతి దుష్కరమౌ ప్రయోగమునకు తలపడినారు. మత్సర గ్రహ గృహీతులౌ ప్రతిపక్షులను తలచుకొన్న కొలది నా యెడలు కంపించు చున్నది. ఇది స్త్రీ స్వభావమని భావింతురేమో!

సూత్ర :- ఆర్యా! కాతర్యమేల? నేడు మన అదృష్టము పండనున్నది. చూడుము.

"లక్షణసమృద్ధిరనఘా రసపరిపోషశ్చ సహృదయ గ్రాహ్యః
సంపతతి నాటకేస్మిన్ స ఏష శైలూష సుకృత పరిపాకః."

నాటకమా సర్వ లక్షణ లక్షితము, నిర్దుష్టము; సభ్యులా మత్సర రహితులు, సరసులు; రసమా విమల భావనా చతుర వేద్యము. ఇది అంతయు మన శైలూషుల పుణ్య విశేషణముననే లభించినది. మఱియు

"విద్యా సంపన్నిధిరవహితో వేంకటేశః కవీంద్రః
సిద్ధారంభశ్చిరమభినయే మామకః పాత్రవర్గః
ప్రఖ్యాతేయం పరిషదనఘా పక్షపాతానభిజ్ఞా
రామాదీనాం కులధన మిదం రంగతాం యాతి రంగమ్."

ఏతద్రచయిత వేంకట నాథుడు సకల విద్యా శేవధియైన కవీంద్రుడు. మన నటీ నట బృందము వివిధాభినయ ప్రయోగములందు గడదేరినది. పరిషత్తు పక్షపాతాది దోషలేశము లేని రసాస్వాద పారీణమైనది. శ్రీరామాదుల కుల ధనమైన శ్రీరంగము రంగస్థలమైనది. ఇది కాదు నీవు భావింపవలసినది - మఱి యొకటి కలదు

"శమధననిధిం సత్త్వ ప్రాయం ప్రయోగమయోగినః
స్వగుణవశతః స్తోతుం యద్వా వరీ వ్రతు నిందితుమ్
కిమిహ బహుభిః కిం న శ్చి న్నం న విశ్వ మనీశ్వరం
తదుపనిహితా జాగ్రత్యేవం చతుర్దశ సాక్షిణః."

శమ దమాది గుణోపస్కృతము, సత్త్వ ప్రకృతి వివేకాది పాత్ర ప్రచురమునైన ఈ నాటకము రాజస, తామస స్వభావులు తమ తమ స్వభావాను సారము నిందించినను, స్తుతించినను మా కొరుగున దేమియు లేదు. ఇంత మాత్రమున విశ్వమనీశ్వరము కాదు గదా! ఆ ఈశ్వర నిర్మితములైన చతుర్దశ లోకములే సాక్షులగును.

మఱియు, అత్కారితోప నతముగా మెఱుపు తీగలవలె మనీషుల ఈర్ష్యాదు లారంభ సమయముననే అవసానము జెందును. లేదా—

"మౌనం బిభ్రతు మత్సరేణ నమితాః తూర్ణం త ఏవ ధ్రువం
కాలోన్నిద్రకదంబగోళవపుషః కంపస్ఫు రన్మౌళయః
కించిద్వ్రీడితకుంచితాక్షమ వశాతత్ ఉత్తానదత్తాననాః
ప్రస్తోష్యంత్యవధిం ప్రయోగపదవీసారస్యసారస్య నః."

మొదట ఈ నాటక ప్రశంస పట్ల ప్రతిపక్షులు మాత్సర్యగ్రస్తులై, మౌనవ్రతము దాల్చినను కొద్ది సమయముననే వర్షాకాలమున పూచిన కడిమి పూగుత్తులవలె కంటకితాంగులై తలలనూపుదురు. వారే తమ పొరపాటునకు సిగ్గుపడి ఈ నాటకము యొక్క సారస్యము నుగ్గడింతురు.

నిరంతర నియమిత మత్సర నీరంధ్ర హృదయులు నిర్వికారులును కావచ్చు. ఐనను

"ఉపవేద ముదారధీః స్వనామ్నా
భరతః సూచితభావరాగతాళమ్
యముదాహరతి స్మ దిశ్వ భోగ్యమ్
తదభి జ్ఞైర బహి ష్కృతా వయం స్మః."

భరతుడు తన నామానుగుణముగ రాగ, భావ, తాళమయమైన నాట్య శాస్త్రము నుపవేదముగ లోక శ్రేయస్సునకై రూపొందించినాడు. అందు ప్రావీణ్యము గడించినవారు మమ్మెట్లైన అభిమానింతురు.

నటి:- ఆర్యా! వాస్తవము. శాస్త్ర పండితులు విరుద్ధవాదము లేవదీయుచు రంధ్రాన్వేషణ చేయునప్పుడు మనము ప్రతిజ్ఞ జేసిన విధము అభినయింప జాలుదుమా!

సూత్ర:- పరగుణ సంతోషిణీ! పరమార్థము నెఱిగిన వారికి కూడా ఏవో కొన్ని ప్రశ్నలు కలుగుచునే యుండును. కానిమ్ము. విశిష్ట విద్యా పరిజ్ఞానము కలవారిని గౌరవింపవలయును.

"భూయసీరపి కళాః కళంకితాః
ప్రాప్య కశ్చిదపచీయతే శనైః
ఏకయాపి కళయా విశుద్ధయా
యోఽపి కోఽపి భజతే గిరీశతాం."

ఒకడెన్నియో కళంకిత కళలను పొంది అపచయము నొందుచుండ, వేరొకడు ఒకానొక పవిత్రకళాప్రభావమున గిరీశత్వమును (సర్వజ్ఞతను) పొందుచున్నాడు.

కావున పరాశర, పారాశర్యాది - బహు మతముల దుర్వినీత చిత్తవృత్తి తిరస్కారిణి, అనవరత పరిచిత గాంధర్వ విద్యా వినోదన ప్రసాదిత పరమ పురుషము పరావరతత్త్వ యాథాత్మ్యావగమన దురీణమునైన పరిషత్తును అభిముఖ పరచుదము. (వినయముగా అంజలి యొగ్గి) ఆర్య మిత్రులారా! వినుడు-

"వివేకప్రారంభే విమతమతభంగప్ర యతనే
ముముక్షా సంసిద్ధే ముద మథన యోగే చ సఫలే
ముఖాదీన్ నిధ్యాతుం నిభృత మిహ నాట్యే-కృతముఖై
ర్భవద్భిః స్థాతవ్యం భరతమతధౌరేయ మతిభిః."

వివేక నాయకుని జీవ న్నిశ్శ్రేయస రూపమున బీజారంభ సమన్వయము, నిశ్శ్రేయస ప్రాప్తికి విరోధులౌ బాహ్య కుదృష్టి, దుర్మతముల ఖండన ప్రయత్న రూపమున బిందు ప్రయత్న సమన్వయము, ముక్తీచ్ఛా సంసిద్ధి రూప పతాకా ప్రాప్త్యాశా సమన్వయము, పరమాత్మ కృపా వాప్తి రూప ప్రకరీ, నియతాప్తుల సమన్వయము. పిదప మోక్ష ఫల ప్రాప్తి యనుకార్య ఫలాగమ సమన్వయ మనునవి ముఖాది పంచ సంధి రూపమున పది యంకములలో ప్రతిపాదింపబడినవి. అనగా - మొదటి అంకమున పురుష మోచనోద్యోగము, రెండవ అంకమున పరపక్ష భంగము, మూడవ అంకమున మోక్షోపాయారంభము, నాల్గవ అంకమున కామాది వ్యూహ భంగము, ఐదవ అంకమున దంభాద్యు పాలంభము, ఆరవ అంకమున స్థాన విశేష సంగ్రహము, ఏడవ అంకమున శుభా శుభ నిర్ధారణ, ఎనిమిదవ అంకమున మోహాది భంగము, తొమ్మిదవ

అంకమున సమాధి సంభూతి, పదియవ అంకమున నిశ్శ్రేయస లాభము - అనునవి ప్రతిపాదింపబడినవి. కావున వానిని మనమీ అభినయములద్వారా సామాజికుల ముందు ప్రదర్శించి, రంజన నాపాదించి నాట్య యోగ శాస్త్ర గౌరవము నినుమడింపజేయవలసియున్నది.

(తెరలో)

"సమయనియతైః ప్రయోగైః సత్పథసీమామనుజ్ఝితో విదుషః
కిరణైరివ దివసకృతః క్షిప్యంతే తామసారంభాః."

ఇందు నాలుగర్థములు గలవు.

1. దివా నియతములైన కిరణ ప్రసారములచే గగన మార్గమును విడువక లోకోజ్జీవన నాపాదించు సూర్య భగవానునిచే తిమిర పరంపరలు తొలగింపబడునట్లు;

2. భరత శాస్త్ర మర్యాదను తప్పకుండా నియమములను పాటించు నాట్యాభిజ్ఞుడైన నటునిచే నాట్య శాస్త్రోద్దిష్టములైన నాట్య ప్రయోగములతో నటాధముల అసభ్యతా పాదకములౌ అభినయములు తొలగింప బడునట్లు.

3. స్వస్వరూపానుగుణముగా సాత్త్వీక ధర్మములు గోల్పోక భగవత్ కైంకర్యమును అనుష్ఠించెడి ప్రపన్నునిచే ప్రకృష్టముగా ఆత్మార్పణముచే సాధనాంతర, మంత్రాంతర, దేవతాంతర ప్రవృత్తులౌ వారి దుర్వ్యాపారములు తొలగింపబడునట్లు;

4. శాస్త్ర నియమమానుసారము యోగ మర్యాదను విడువక స్వవర్ణాశ్రమోచితములౌ అనుష్ఠానములచే తమోగుణ ప్రధానుల చెడునడతలు తొలగింపబడునట్లు నిరసింపబడును. సాత్త్వీక మార్గ మర్యాద నుల్లంఘింపక సదనుష్ఠానమును పాటించెడి వివేక నాయకుని యొక్క సమయోచిత ప్రయుక్తములౌ కామాది విజయ వ్యాపారముల వలన తామసులౌ మోహాదుల వివిధ దుర్వ్యాపారములు నిరసింపబడునను కావ్యార్థము సూచింపబడినది.

సూత్ర :- (చెవియొగ్గి ఆనందముతో) ఆర్యురాలా! బాగుగా పరికించుము. మన అభినయ వృత్తిని మఱియు ఆపవర్గిక వృత్తిని ఒకే ప్రయోగమున ఈ ఔద్ధాతికి గీతి నిరూపించుచున్నది.

"దుర్జనం ప్రతిపక్షం చ దూరదృష్టిరయం జనః
వివేకశ్చ మహామోహం విజేతుం ప్రభవిష్యతః."

దూరదృష్టియౌ నటాగ్రేసరుడు దుష్ట నటుని జయింప నుద్యమించునట్లు వివేక నాయకుడు మహా మోహ ప్రతినాయకుని జయింప సమకట్టుచున్నాడు. (బాహ్య కుదృష్ట్యాది ప్రతిపక్ష వర్గమును, బ్రహ్మవేత్త జయింప సమకట్టినాడను అర్థము సూచితము.)

(తెరలో)

ఎవడురా వాడు? కుశీలవ కులాంగారుడు, కరతల కలిత కఠోర మధుర ధనుష్కుడు, సురభి సుకుమార చిత్రపుంఖుడు, విత్రాసిత నిఖిల వైరిజనుడ నగు నేను జీవించియుండ సకల సురాసుర మునిమనుజ చిత్తవృత్తి సార్వభౌముడు దుర్మతి ధర్మచారిణీ సహితుడు, రణరంగ మహా నటుడునగు ఈ మహా మోహుని గుఱించి యేదో అనిష్టమును ప్రతిపక్షుల వలన కలుగునని ఆశంసించు చున్నాడు!

సూత్ర :- (భయసంభ్రమములతో తిరిగి చూచి) ఆర్యురాలా! క్రోధ, మద, లోభా ముఖ్యులైన సహాయులు వెంటరాగా ఎవడో ఇటు వచ్చుచున్నాడు. మన మిట యుండరాదు. ఇతడు—

"అపవర్గవిరుద్ధేషు త్రిషు వర్గేషు తిష్ఠతాం
ప్రధాన పురుషార్థస్య పశ్చి మస్యాధిదైవతమ్."

ధర్మార్థ కామములను త్రివర్గముల ననుష్ఠించు వారికి, ఆ మూటిలోను ప్రధానమై, అంతిమమునైన కామపురుషార్థమున కధిదేవతయైన కాము డీతడు సుమా!

"అర్ధావశేషిత మహేశ్వర పౌరుషోయం
వర్గం తృతీయ మవధీరయతాం వినేతా
రత్యా సలీలపరిరంభణలోలగత్యా
పుష్పాయుధః పులకితైకభుజోభ్యుపైతి."

మహేశ్వరుని పుంస్త్వమును, పరాక్రమమును సగము చేసినవాడు, కామము నేవగించు వారిని శిక్షించువాడు, రతీదేవి సంస్పర్శ మూలమున పులకితైక భుజుడు పుష్పాయుధుడునైన కామదేవు డీ వైపు వచ్చుచున్నాడు.

కావున - కాలోపపన్న కామోత్సవ విహార సంకులమౌ జీవలోకమున గుప్త వృత్తులపై అనంతర కరణీయ మనుష్ఠింతము.

(అని నిష్క్రమింతురు)

**నరకాసుర విజయవ్యాయోగము :**

"కస్తూరీ పరిదిగ్ధ ముగ్ధ కమలా వక్షోజ బుద్ధ్యా ధ్రువం
నీలాద్రేః శిఖరేషు నిత్యకుతుకీ దైత్యారిరవ్యాత్ స నః
ప్రత్యంగాభరణేషు దీప్తవపుషః సేవాసుదేవాఃస్ఫుటమ్
యస్యాశేషసురాత్మతాం విదధతే చన్ద్రార్ధచూడాదయః."

తనను సేవింప అరుదెంచిన శివాదిదేవతలు, ఎవని ప్రత్యంగములందు అలంకరింపబడిన మణిమయాభరణములలో ప్రతిఫలించి ఏ పరాత్పరుని సర్వదేవతామయునిగా తలపింపజేయుచుండిరో కస్తూరీ పరిలిప్తమౌ లక్ష్మీ వక్షోజమను భ్రాంతిన నీలాచల శిఖరమందు సతతోత్కంఠితుడై విలసిల్లెడి జగన్నాథస్వామి మిమ్ము రక్షించు గావుత!

ఇది అష్టాదశపద నాంది. చంద్రనామ నిర్దేశమువలన నీవి. ఆశీర్వాద రూప.

(నాంద్యంతమున)

(వేడుకతో నన్నివైపుల తిలకించి) ఔరా! ప్రాతఃకాలికమౌ ఈ భువన శోభ నా హృదయము నెంత మత్తు గొల్పుచున్నది?

"శయ్యాంబరం శశినిశోరివ భాతి లాక్షా
తాంబూలయోరివ రసైరరుణాభ్రవేశైః
హారైః ప్రసూననికరైరివ తారకైశ్చ
చూర్ణైఃపటీర నివహైరివ చన్ద్రికాంశైః."

శర్వరీ నిశాకరుల సెజ్జవోలె ఆకాశము వారివ, లాక్షాతాంబూల రసరేఖల వోలె అరుణాభ్రఖండములు, వారివ పుష్పమాలాహారములవోలె తారకలు, వారివ తెల్లని చూర్ణములు శ్రీగంధపాంసువులవోలె చంద్రికాంశములు విలసిల్లుచున్నవి.

మరియు,

త్రాసాదాసాదితాశావివర భువి హరే రంధకారామరారౌ
తద్యోధాః ప్రాప్తబాధా ఇవ దిశి విహగా విద్రవంతి ధ్వనంతః
భ్రష్టాశ్చిత్రాః పతాకా ఇవ సలిల ధరా హారవత్తారకాశ్చ
ప్రాతఃప్రాలంబి బింబోఽంబర భువి నితరాం ఛత్రవత్ శీతరోచిః."

విష్ణువునకు వెరచి అంధకారమను రాక్షసుడు ఏదోనొక దిక్కోణమున దాగుకొనినాడు. బాధితులైన యాతని యోధులవలె పక్షులు ఆక్రోశించుచు ఆయా దిక్కులకు పారిపోవుచున్నవి. చిత్రములైన పతాకలవోలె మేఘములు భ్రంశము నొందుచున్నవి. అతని హారములవలె చెదరిపడినవి. ఆకాశరంగమున చంద్రుడు విశీర్ణుడై ఆతని శ్వేతచ్ఛత్రమువలె విగతశ్రీకుడై యొరిగిపోయినాడు. (తూర్పు దిశ తిలకించి ఆశ్చర్యమున)

"ప్రాక్శిఖరిశిఖర శేఖరతరుణారుణకిరణమంజరీ తరణేః
విదధాతి రథతురంగమచూడారుణచారుచామరభ్రాంతిమ్."

ఉదయాచల శిఖరమునకు శేఖరాయమాణమైన సూర్యభగవానుని పరిణామ తరుణ కిరణమంజరి తన రథమునకు బూన్చిన అశ్వముల తలలపై కట్టిన ఎఱ్ఱని చామరముల భ్రాంతిని కలిగించుచున్నది. (తిరిగి జూచి అచ్చెరువున) భక్తజన శ్రేయస్కరుడగు భగవానుడుదయించినాడు. నిక్కువముగా నితడొక కాముక పరిపాటిని ప్రకటించుచున్నాడు. చూడుడు.

"నీతక్షపః క్వచిదధః కృత జీవనాయా
రాగాన్వితః తుహినబాష్పముచో నలిన్యాః
లీనశ్రియో విగళితాళి గిరో వివస్వాన్
పుష్ణాతి పాదపతనేన పురః ప్రహర్షమ్"

ఒకచో రాత్రి గడిపి తన జీవనమును క్రిందుపరచమంచు కన్నీటి నొలుకుచు శోభ చెదరి భ్రమరగుంజిత వ్యాజమున ఆక్రందన నొనరించుచున్న పద్మిని ముందు రాగాన్వితుడై సూర్యుడు పాదప్రణిపాతమొనరించి తిరిగి ఆమెకు ఆమోదము పెంపొందించుచున్నాడు. (ఆకాశమువైపు జూచి అబ్బురముతో)

"శ్యామీభూతా సురపథవనీ వాసరేషాత్రపేన
స్పృష్టాః ధాత్రా నిశి విరచితైః దోహదైః ధ్వాంతరూపైః
సద్యస్తారా కుసుమరుచిరా మండలేనాస్య భానోః
సంప్రత్యేషా భవతి ఫలితా పల్లవిన్యంశుభిశ్చ."

బ్రహ్మయను ఉద్యానపాలుడు గగనమను వనమునకు ధ్వాంతమను దోహదక్రియ సల్పి ఆతపమును సోకింప ఆకుపసిమి గొలుపునట్లు చేయ, అది కిరణ పల్లవములతో తారా కుసుమములతో పరిఢవిల్లి ప్రకృతము సూర్యమండల ఫలవిలాసమున నొప్పుచున్నది.

కావున అభీష్ట సిద్ధికి సూర్యభగవాను నుపాసింతును.
"నమ స్తమః కర్దమదుర్దమాంబుధేః
ప్రణష్ట చేష్టాఖిల జంతు సంతతిమ్
ప్రసార్యమాణైః పటు దీర్ఘరశ్మి భిర్
జగ త్త్రియా ముద్ధరతే వివస్వతే."

అంధతమసమను కర్దమపూర్ణమౌ అంబుధిలో మునిగి సకల వ్యాపారము లుడిగి అలమటించెడి జీవలోకమును దృఢములైన కిరణములను త్రాళ్ళచే ఆ తమః కర్దమాంబుధి నుండి లాగి ఉజ్జీవింప జేసిన ద్వాదశాత్మకు నా నమస్కారము. (అని భక్తితో నమస్కరించును. ఆకాశమువైపు జూచి సంతసమున)

"కాలాభ్ర ద్వీపపాకలః కతకజక్షోదః కఠోరాంభసాం
కేకామ్నాయకుహూః కలానిధిమణేః శాణోపలోత్కర్షణమ్
కంసారేః ప్రతిబోధనః కమలినీ కాదంబయోః కుట్టినీ
కాలః కోఽపి కరోతి కాశసురభిః కామం మనఃకౌతుకమ్."

కాలాభ్రమను గజముగండు నణచి చిల్లగింజవోలె ప్రవాహ మాలిన్యమును తొలగించి మయూరముల కేకలనడగించి చంద్రబింబమునకు సానవలె మెరుగు వెట్టి సాగరశయానుడౌ భగవానుని మేల్కొల్పి కమలినీ కాదంబములకు ప్రీతి నాపాదించి కాశకుసుమ పరీమళముతో నించుకొని శరత్కాలము సర్వ ప్రాణులకు మనోవినోదము నొనగూర్చుచున్నది.

మరియు -

"చాపాన్ పుండ్రేక్షురూపాన్ కమల కువలయోత్ఫుల్ల మల్లీక్షురప్రాన్
దీప్తాంశ్చో ద్వృత్త సప్తచ్ఛదమధుమదవత్ గంధవాహద్విపేంద్రాన్
నిర్బాధాన్ హంసయోధాన్ శరకుసుమరజో వైజయంతీః జయంతీః
సజ్జీకుర్వన్ సమంతాత్ వదతి శరదృతుర్జైత్రయాత్రాం స్మరస్య."

మదన సార్వభౌమునకు శరత్కాలము పుండ్రేక్షు చాపములను వికచ కమల కువలయ మల్లీ కుసుమ రూపమున దీపించు శరములను సప్తచ్ఛదమద బంధురములే మలయానిలములను కుంజరములను, మొక్కవోని పీకగల హంస యోధులను, కాశ కుసుమ పరాగచ్ఛటలను పతాకలను సమకూర్చి జైత్రయాత్రా సమయము డాసినదని ఆతనికి తెలుపుచున్నది.

"సప్తచ్ఛదస్త బక సంభృత సౌరభాంధ
పుష్పంధయ ప్రణయ మంథర గంధవాహాః
వ్యాతన్వతే విమల శాలివనాళికేళి
లోలద్భుజంగ యువపుంగవమంగళాని"

అరటి జొంపముల సువాసనలకు మత్తిల్లి సోలుచున్న తుమ్మెదల కుత్సాహము గొల్పు మలయానిలయములు గాఢముగా పెరిగిన వరి పొలములలో కేళీ వినోద తత్పరులైన తరుణపల్లవ తల్లజులకు మంగళము లొనగూర్చుచున్నవి.

కావున, ఆశ్రితాభిమత ఫల ప్రదాయకుడు, నిఖిల నిగమశ్రేణి ముక్తావళీ నాయకుడు, కమలాముఖ కమలదిన నాయకుడునైన జగన్నాథ భగవానుని శరత్కాలోత్సవముల సేవింప నుత్కంఠతో పలు దిగంతముల నుండి అరు

దెంచిన సకల కళాకోవిదులైన సభాసదుల దరిజేరి ఏదేని ఒక రూపమును ప్రయోగించి నా కోరిక నీడేర్చుకొనెద. (తిరిగిజూచి) లవణసాగరుడు తన ఉల్లోల కల్లోల జలముచే తీరము వైపు ఎగజిమ్మిన మహేంద్ర నీలమణిరాశివోలె ఈ నీలాచలము ప్రకాశించుచున్నది.

చాంపేయసాంద్రవనరాజివిరాజమాన
పార్శ్వద్వయః తుహినపాండురతుంగశృంగః!
నిష్పందమానవితతాయత హేమపక్ష
భ్రాజద్వలక్షముఖ తార్క్ష్యధియం తనోతి."

ఇరు ప్రక్కల సంపంగి తోపులతో విరాజిల్లుచు హిమ పాండురమై, ఎత్తైన శిఖరములు కలిగిన ఈ నీలగిరి చాచబడి నిశ్చలమునై, విస్తృతా యుతమునై యున్న బంగారు ఱెక్కలు, తెల్లని తుండమును కలిగిన గరుత్మం తుండను భ్రాంతిని కలిగించుచున్నది.

ఔరా! మన భాగ్యమెట్టిది

"జగత్పతే రస్య దయార్ద్రమూర్తిభిః
కటాక్షవీక్షాభిరభిక్షణోక్షి తే
సశీతలచ్ఛాయ పటాంతికస్థలే
సుఖోపవిష్టాః స్వయమేవ సజ్జనాః."

పరాత్పరుని విభిన్న లీలావతారముల అవ్యాజకరుణా కటాక్షము లొకచో నొలికినవా యనునట్లు, ప్రచ్ఛాయ శీతలమౌ పటాంతిక స్థలమున సజ్జను లెల్లరు సుఖముగా కూర్చొనినారు.

ఇక విలంబ మీప్సితార్థమును భంగపరచును (తెర వైపు జూచి) ఆర్యురాలా! ఈ వైపు రమ్ము.

నటి :- (ప్రవేశించి) ఆర్యపుత్రా! ఆదేశింపుము.

సూత్ర :- ఆర్యురాలా! ఈ సామాజికులకు మనో వినోదము కలిగించుట కన్న మనకు మరియొక పని యుండునా?

నటి :- ఆర్యపుత్రా! సామాజిక హృదయానురంజన మెట్లు కల్గింప వలయును?

సూత్ర :- వినుము.

"విఖ్యాతేఽజని పర్వతేశ్వర సుధీః శ్రీవారణాస్యన్వయే
షణ్ణాం దర్శనకారిణాం సుమనసామేకాత్మ లీలాయితః
ధర్మాఖ్యేన మనీషిణా విరచిత స్తత్సూనునా తాదృశో
వ్యాయోగో రసజృంభితోస్తి నరకధ్వంసాభిధో నూతనః."

షట్‌శాస్త్రములను నిర్మించిన ఋషులెల్లరు ఒకే రూపమున ఆవిర్భవిల్లిరా యన్నట్లు పర్వతేశ్వరు డను పండితుడు ప్రఖ్యాతమౌ శ్రీ వారణాసీ వంశమున జనించినాడు. అతని పుత్రుడు అన్ని విషయములలో తండ్రిని బోలినవాడు. ధర్మసూరి యను నామమున బరగిన కవీంద్రుడు రసనిష్యందముగా నరకాసుర విజయమను క్రొత్తవ్యాయోగమును వ్రాసినాడు.

కావున దానిని ప్రయోగించి సభాసదుల నానందపరచుదము.

నటి:- కొద్దిపాటి అభినయ పరిచయమున మనము సకల కళాకోవిదులు నిండిన సభ మెచ్చునట్లు ప్రదర్శింప జాలెదమా?

సూత్ర:- మహాత్ము లెదుటివారిలోనుండు కొద్దిపాటిదైనను చక్కని గుణమును శ్లాఘింతురు. చూడుము—

"దోషాకరోపి నిత్యం సుధాకరత్వేన చంద్రమాలోకే
శ్లాఘ్యతరో భవతి స తథాఽయం పంకజన్మభిస్తు జడైః."

దోషాకరుడైనను చంద్రుని సుధాకరుడగుటవలన ఎంతయో శ్లాఘింతురు. జడములౌ పంకజములు మాత్రము ఆ విషయమున మూతిముడుచుకొని యుండును.

నటి:- ఆర్యపుత్రా; చంద్రునిలో సుధాకరత్వమను మంచి గుణమొకటి కలదు. కాని రూపక ప్రయోగమున మనకున్న మంచి గుణమేది?

సూత్ర:- అమృతరస నిష్యంది, సకల తమస్తోమ పరిపంథియునగు కృష్ణ పరమాత్మని నరకాసుర నిబర్హణోదాహరణ రూపమౌ గుణ శిరోమణియే మన కున్న మంచి గుణము. ఈ విధముగా మన ధర్మసూరి తన బాల భాగవతము నందు పేర్కొనిన రీతి నిట్లు నుడివినాడు:

"వినిందితాః కేనచ పంకజన్మనా
జడేన దోషోపహతా అపి స్వతః
మమోక్తయో విష్ణుపదస్పృశో బుధైః
కళా ఇవ గ్రాహ్యతమాః కళానిధేః"

జడమగు పంకజాతము వోలె జడబుద్ధియైన ఎవడో ఒకడు నిర్దుష్టములౌ నా యుక్తులను నిందింపవచ్చును. విష్ణు పదావమర్శము నొనరించు ఆ సూక్తులను చంద్రుని కళలను వలె విబుధులు గ్రహింపకుందురా?

నటి : ఆర్యపుత్రా! స్వభావతః వక్రమై తర్కకర్కశములైన ధర్మసూరి వాగ్విన్యాసమున సుధారస పరిస్పంద మెట్లొనగూడును?

"తర్కే కర్కశతాం గతాపి నితరాం వాగ్వైఖరీ సత్కవేః
మాధుర్యం ప్రకటీకరోతి కవితా కాలేషు కింవాద్భుతమ్
పశ్యాత్యంత కఠోరతాముపగతా గ్రీష్మే మయూఖావళిః
కిం నావిష్కురుతే నవాఽమృతభరం భాసాం నిధేః ప్రావృషి"

ఒకప్పుడు తర్క కార్కశ్యము నొందినను వర్ణనా సందర్భములలో సత్కవి వాక్కు తదనుగుణముగా మధురోదార సుధారసము నుద్గారించును. ఇందబ్బురపడ పనిలేదు. గ్రీష్మమున బాష్పోష్మమును గ్రక్కెడి సూర్యుని గభస్తి స్తోమము వర్షాకాల మేర్పడుతరి అమృతభరము నావిష్కరించుట చూచుటలేదా?

నటి : చక్కగా సెలవిచ్చినారు.

సూత్ర : ఆర్యురాలా? విలంబమేల.

"ధారాధర తమస్తోమైశ్ఛన్నామాశాం శచీపతేః
హరిః ప్రసాదయన్నేవ నాట్యే త్వరయతే హ నః"

జలదతమస్తోమావృతమౌ పురందర హరిత్తటమును సూర్యుడు వెలిగించుచు అభినయమును ప్రయోగింప మనను త్వరపెట్టుచున్నాడు.

(ఇందు తమోగుణ ప్రధానుడగు నరకాసురుడు క్రమ్ముకొనిన ఇంద్ర పురికి తిరిగి కళాకాంతుల నాపాదించి ఇంద్రునకు ప్రీతి నొనగూర్ప కృష్ణుడు నరకునితో తలపడ నుద్యమించుచున్నాడను కావ్యార్థము సూచింపబడినది.)

— తెరలో —

"భాతిం విపక్షజనతాజనితాం జహీహి
దేవేశ ముంచ నగరీం నగరీయసీం స్వామ్
రక్షోబలేన సహసా సహ సాయకాగ్నౌ
హవ్యం కరోమి నరకం నరకంటకం తమ్."

ఇంద్రా! శత్రువులకు వెరచి నీ అమరావతీ నగరమును విడిచి పారి పోకుము. నరకంటకుడౌ నరకాసురుని రాక్షసబలముతోపాటు నా సాయకాగ్నిలో నాహుతిపరతును.

సూత్ర:- (విమర్శించి) నిజముగా నరకునకు వెరచి తన అమరావతిని విడిచి పారిపోనున్న పురందరుని సాంత్వనపరచ శ్రీకృష్ణుని వేషమున వచ్చెడి నా సోదరుడౌ కాలకంధరుని మాట యపుడే వినవచ్చుచున్నది. ఇతడు విలం బింపకయే నరకునితో తలపడ నుద్యమించుచున్నాడు. ఇదిగో—

"అంకేనిధాయ దయితామిహ సత్యభామాం
ప్రాప్తాం పురైవ సమరాదివ వీరలక్ష్మీమ్
దివ్యం రథే మహతి దారుకచోదితాశ్వే
పంచాయుధీపరికరః పురతోఽభ్యుపైతి."

ముందే తనను వరింపజేసిన వీరలక్ష్మివోలెనున్న ప్రియవల్లభయౌ సత్య భామను వామాంకమున నిల్పి దారుక సారథ్యమున పిరాజిల్లు ఉత్తమ శతాంగ మున ప్రకాశించుచు పంచాయుధీ పరికర్మితపాణియౌ కృష్ణభగవానుడు ముందు వైపు కరుదెంచుచున్నాడు.

కాన మనమును తర్వాతనే కర్తవ్యము నిర్వహింప సన్నద్ధులమగుదము. (అని నటీసూత్రధారులు నిష్క్రమింతురు.)

**అభినవకాళిదాసు : : శృంగారశేఖర భాణము**

"యమాలోక్య స్వస్మిన్ మణిముకురభాసి స్తనతటే
స్ఫురద్వక్రాకారం కరరుహపదా శంకి హృదయా
సలజ్జా హస్తాభ్యాం స్థగయతి నవోఢా ముహురుమా
సబాలేందుః క్లాంతిం హరముకుటవాసీ హరతు వః."

"మణి ముకుర భాసమానమౌ తన యురోజ తటమున ప్రతిఫలించిన ఏ చంద్రుని వక్రరేఖను జూచి నఖక్షతమను భ్రాంతికి గురియై నవోఢయైన ఉమాదేవి సిగ్గుతో తన చేతులతో కప్పుకొనునో, హరజటాజూట వాస్తవ్యుడౌ ఆ బాలచంద్రుడు మీ క్లేశములను తొలగించుత!"

"పిబతి నిబిడం కాంతే బింబాధరం రతిలోలుపే
స్ఫురిత కపట క్రోధం భ్రూవల్లి నర్తనలీలయా
మసృణముకులాపాంగం మా మేతివాద మనోహరం
ముఖమవతు వో ముగ్ధాక్షీణామభంగుర సీత్కృతమ్."

రతిలోలుపుడై ప్రియుడు గాఢముగా తన బింబాధరమును గ్రోల బొమముడి నర్తింప కపటకోపము స్ఫురింప లేలేత క్రీగంటిచూపులు తొణికిసలాడ వలదు, వలదను మాటలు సొగసుమీర సీత్కారోదంచితమౌ, వామాక్షుల వదనము మిమ్ము రక్షించుత!

(ఇందు అష్టపద "ఇందు' పదోపాదానము వలన నీలి. ఆశీస్సులుండుటచే ఆశీర్వాదరూపయౌ నాంది)

(నాంద్యంతమున)

**సూత్ర :-** (పరిక్రమించి జూచి) కంపాతట మందిరమున మలయాంక నామమున వెలసిన కామకోటి వల్లభుడను పరమేశ్వరుని వసంత యాత్రోత్సవ సందర్భమున మా ప్రయత్న మీడేరినట్లే.

"అధీతరతితంత్రాణామ్ అనఙ్గ బ్రహ్మవాదినామ్
సోఽయం విదగ్ధమిశ్రాణాం సమాజస్సముపస్థితః"

రతి తంత్రముల నధ్యయనము చేసిన వారు, అనంగ బ్రహ్మవాదమున ఆరితేరిన వారునైన విదగ్ధమిశ్రుడు సభ దీర్చి యున్నారు.

కావున దేశమునకు, కాలమునకు, పరిషత్తునకును, అనుగుణముగా రూపకము ప్రయోగింపవలసి యున్నది.

"ఏషా పురీ పురనిషూదనవామభాగ
సౌభాగ్యకందలితమన్మథవిక్రమశ్రీః
పుంస్కోకిల ప్రణయినో దివసాః ప్రరూఢాః
శృంగారభంగిరసికా యదమీ చ సభ్యాః"

ఈ నగరములో పరమేశ్వరుని వామభాగమున విరాజిల్లెడి పార్వతీదేవి కమనీయ కళా విశేషముచే మదనుని విక్రమ శోభ కందలించి యున్నది. గండు కోయిలలకు ప్రీతిని కల్గించు దివసములు బరగుచున్నవి.

శృంగార తత్త్వజ్ఞులైన సభ్యులిచ్చో సమావేశమై యున్నారు. ఏ రూపకమును అభినయింతును? (ఆలోచించి, ఆనందమున) కాశ్యప గోత్రతిలకమై విరాజిల్లు అభినవ కాళిదాసను కవి యున్నాడు కదా!

"యస్యామనంతి కులదైవతమిందుమౌళి
మేకామ్ర మూలనిలయం పతిమంబికాయాః
యస్యాగ్రజం చ కవితాకృతచాటుబంధం
సాహిత్యభూషణమసోఢమదం కవీనామ్."

ఏకామ్రమూలమున నివసించువాడు, అంబికాపతియునైన చంద్రమౌళిని ఎవని కులదేవతగా ప్రశంసింతురో, ఎవని అగ్రజుడు కవిమద దళనుడై, సాహిత్య భూషణుడై చాటు ప్రబంధ నిర్మాణమున లబ్ధప్రతిష్ఠు డాయెనో— అతడు వ్రాసిన శృంగార శేఖర భాణమును ప్రదర్శించి సభ్యుల నారాధింతును, (వినయముతో)

అనుబద్ధకామసూత్రః ప్రతిపదముద్భిన్న రసమయూఖ భరః
కంఠేషు కలితగుంఫో భాణోయం భవతి భూషణం విదుషామ్."

కామసూత్రానుబంధమన రససమృద్ధి యను కాంతి సమృద్ధిన విలసిల్లు ఈ భాణము భూషణము వలె విద్వాంసుల కంఠములందు కలితగుంఫమై ప్రకాశించుత.

(తెరలో)

(సూర్యభగవానుని రాగాతిశయ మెంత కమనీయముగా నున్నది.)

సూత్ర :- ఇదిగో, మందారకు డపుడే శృంగార శేఖర వేషము దాల్చి ఈ వైపే వచ్చుచున్నాడు. నేనును తరువాతి కార్యము నెరవేర్చ దొరకొందును. (అని నిష్క్రమించును)

ఇందు దేశకాల కవి కావ్య ప్రశంస సంక్షిప్తముగా చేయబడినది. ఋతు గానము లేదు. సూత్రధారుని మాట వలన శృంగార శేఖరుడను పాత్ర రంగ స్థలమున ప్రవేశించుటచే ప్రయోగాతిశయము.

## ముకుందానందభాణము - కాశీపతి

"వందే వందారుమందారు మందారమిన్దుభూషణనందనమ్
అమందానందసందోహ బంధురం సింధురాననమ్".

నతజన మందారుడు, చంద్రమౌళి నందనుడు, అమందా నంద సందోహ బంధురుడునైన సింధురాననునకు నమస్కారము.

"కంఠాలింగన మంగళం ఘన కుచాభోగోపభోగోత్సవం
శ్రోణీ సంగమ సౌభగం చ సతతం మత్ప్రేయసీనాం పురః
ప్రాప్తుం కోఽ య మితీర్ష్యయేవ యమునాకూలే బలాత్ యస్స్వయం
గోపీనాఘహరద్దుకూలనిచయం కృష్ణస్స పుష్ణాతు నః."

నా ప్రేయసుల కంఠాలింగన మాంగల్యమును, ఘన కుచా భోగోప భోగోత్సవమును, శ్రోణీ సంగమ సౌభాగ్యమును నిరంతరము నా యెదుటనే పొందులుకినిది (ఈ సిచయ నిచయము) యెంతటిది అను ఈసు బూని యన్నట్లు యమునా తీరమున పల్లవ తరుణీ మణుల యా సిచయ నిచయము నపహరించిన కృష్ణుడు మమ్ము పోషించుత!

"చంద్రే శీతలయత్యలీకనయనం శంభోస్సుధాశ్శీకరై ః
విష్వగ్ వ్యాకులయత్సు సంయమధనాన్ కాంతాదృగంతేషు చ
లీలాయై పరమైషవం ధనురిషూన్ బిభ్రత్ ప్రసూనాత్మనః
స్వచ్ఛందం రతివల్లభో విజయతే త్రైలోక్యవీరస్స్మరః."

ఒకవైపు చంద్రుడు శివుని ఫాలలోచనమును తన సుధాశీకరములచే చల్లబరుచ, వేరొకవైపు కాంతా దృగంచలములు సంయమ ధనులౌ తాపసులను కలవర పరచ కేవల విలాసార్థము ఇక్షు రూపమౌ చాపమును, పుష్పమ యములౌ బాణములను ధరించి రతి వాల్లభ్యమున త్రైలోక్య వీరుడై విలసిల్లు మన్మథుడు సర్వోత్కృష్టుడగుత!

(నాంద్యంతమున)

సూత్ర : (ముందు వైపు జూచి ఆనందముతో) మా పూర్వ పుణ్య కల్ప వల్లికలు ఇవ్వేళ పూర్తిగా పండినవి. ఏలనన- నూతన పుర పరిసరాలంకారము భద్రగిరి చూడామణియునైన చూడేశ్వర భగవానుని వసంతోత్సవము దర్శింప సముత్సుకులై సామాజికులు కళ్యాణమంటపము నధిష్ఠించుచున్నారు. వీరి దరిచేరి చిరపరిచితమౌ మా లాస్యకళను దర్శించి వినోదింప వేడుకొందును. (రెండడుగులు వేసి చేతులు జోడించి) సకల కళాకోవిదులారా! సభాసదులారా! భరతాచార్య పుత్రుడను, 'కళాప్రవీణుడ'ను నేను, మా ప్రయోగము ననుమతింప వేడు చున్నాను. (ఆకాశమువైపు జూచి చెవియొగ్గి) "బాగు! భరతాచార్యపుత్రా! బాగు. మేమును సరస కవి కూర్చిన సూక్తిముక్తామణి మంజులము, అభినవమునైన మిశ్ర భాణము నవలోకింప నుత్కంఠపడుచున్నాము, కావున అట్టి భాణము నభినయించి ప్రదర్శించు"మని సెలవిచ్చుచున్నారా? చిత్తము. అనుగ్రహింపబడినాను. (తనలో) ప్రస్తుతము మిశ్రభాణముల ప్రచారము విరళముగా నున్నది. అట్టి కవులును

అరుదు. సామాజికుల ఆదేశమా అపరిహార్యము. ఎట్లు ఈ కోర్కె నీడేర్తును. (స్మృతి నభినయించి) ప్రణయ కుపిత గృహిణీ మనో వినోద వ్యాసక్త చిత్తత వలన ఇంతదాక మరచినాను. కొద్దికాలమున అభ్యస్తమైనట్లు ఈ సామాజికుల ఆదేశము వలన ఇదిగో రూపకము స్మరణకు వచ్చినది. కానిమ్ము! గృహిణిని పిలిచి సంప్రతించెద! (వెల్లడిగ) ఆర్యరాలా! ఇటు రమ్ము!

నటి : (ప్రవేశించి) ఆజ్ఞాపించుడు. అనుష్ఠింపదగినదేమి?

సూత్ర : ఆర్యరాలా!

"కౌండిన్యవంశరత్నస్య కవేః కాశీపతేః కృతిః
ముకుందానందనామాయం మిశ్రభాణః ప్రయుజ్యతే."

కౌండిన్య వంశమణియైన కాశీపతి కవి వ్రాసిన ముకుందానందమను మిశ్ర భాణము ప్రవర్శింపబూనినాము. కావున (అని అనుచున్నంతలో)

నటి : ఆర్యపుత్రా! ఎంత ఆశ్చర్యము!

"తార్కే కర్కశ వక్రోక్తి నిష్ఠురా తస్య భారతీ
జాతా మధురసందర్భే కావ్యేపి మృదు లాకథమ్."

తర్క కర్కశము, వక్రోక్తి నిష్ఠురమునైన ఆ కవి వాక్కు మధుర సందర్భ సముప స్కృతమౌ కావ్యమునందు మార్దవ మెట్లు సంతరించుకొనును.

సూత్ర : (పరిహాసముగా) నీవే చెప్పు.

"క్షణం ప్రణయకోపే త్వం నిష్ఠురాపి కథం పునః
ప్రేమార్ద్రహృదయా జాతా మృదులప్రకృతిః ప్రియే."

ప్రణయ కోపము వహించినపుడు క్షణకాలము నైష్ఠుర్యము వహించినను, పిదప హృదయమున ప్రేమ జాలువార స్వభావతః మార్దవమును నాయందు నీవు చూపుటలేదా?

నటి : ఒక వాక్కే పరస్పర విరుద్ధముగా మార్దవ - కార్కశ్యము లెట్లు వహించుననునది నా ప్రశ్న మీరిచ్చు సమాధానము భిన్నముగా నున్నది.

సూత్ర : ఇందు విరోధమేమి? ఆతడే నుడివినాడు.

"తర్కే కర్కశవక్రవాక్యగహనే యా నిష్ఠురా భారతీ
సా కావ్యే మృదులోక్తి సారసురభౌ స్యా దేవ మే కోమలా
యా ప్రాయః ప్రియవిప్రయుక్త వనితా హృత్కర్త నే కర్తరీ
ప్రేమ్ణో లాలితయౌవతేన మృదులా సా కిం ప్రసూనావలిః."

కర్కశములు, వక్రములునైన వాక్యములచే గహనమౌ తర్కమును ప్రతిపాదించునపుడు నైష్ఠుర్యమును బూనిన ఆ నా భారతి మృదులోక్తి సార సురభిలమౌ కావ్యమునందు తదుచిత శబ్దార్థ కోమలత్వమున విరాజిల్లుటలో అబ్బురపడ పనిలేదు. ప్రియవియోగ సమయమున కాంతా స్వాంతములందు కర్తరీ ధర్మము నిర్వహించు చున్నను కుసుమావలి ప్రియహస్తోప లాలన వేళ లలో వారి హృదయములందు పన్నీరు జల్లుట లేదా?

నటి : కుసుమ సుషమవోలె ఈ కవి వాక్కు మృదు మనోజ్ఞమనియే కదా భావము.

సూత్ర : కుసుమశ్రీతో బోల్పనేల?

"వ్యాకోచప్రసవశ్రియోపి మృదులా వాచా మియం ప్రక్రియా
మందస్యంది మరంద తోఽపి మధురస్త్రాయ మర్థ క్రమః
సౌరభ్యాదపి సమ్మతం పునరిహ వ్యంగ్యం పికేభ్యోప్యమీ
మద్వర్గ్యా మధురస్వరాః కవిరయం శ్లాఘ్యో వసంతాదపి"

ఈ కవి వాణీ విలాసము వికస్వర కుసుమశ్రీ కన్న మృదులము, అర్థ క్రమము మెలమెల్లన జాలువారు పూదేనియకన్న మధురము. ఇతని వ్యంగ్యము జాతి సౌరభము కన్న హృదయ తర్పణము. మన నటీనటులు కోయిలకన్న మధుర స్వరోదారులు. ఈ కవియో పుష్పాకరమౌ వసంతుని కన్న సర్వథా శ్లాఘనీయుడు.

నటి : (అన్నివైపుల జూచి) ఈ రసాల వాటిక వసంత లక్ష్మి సమాగ మమును తెల్పుచున్నది. ఇటు చూడుడు.

"కిసలయ కర సంపుటేన వల్లీ కిరతి పురః కుసుమాఞ్జలిం నటస్త్రీ
పవననిహత తాళపత్ర తాళధ్వని మనుగాయతి బంభరావలీకా."

నృత్యమాడుచు ఈ లత పల్లవ పాణి పుటమున పుష్పాంజలి జల్లు చున్నది. తుమ్మెదలబారు గాలి తాకిడివలన నేర్పడెడి తాళపత్ర ధ్వనియను తాళ శబ్దమున కనుగుణముగా గానము చేయుచున్నది.

సూత్ర : చక్కగా నిరూపించినావు. ఇంతేకాక—

మందానిలేరితమనోహర పల్లవాగ్రైర్మాకంద వీరుదియ మాహ్వా
యతీవ రాగాత్
ప్రత్యుత్తరం పరభృతోపి దిశన్నివాస్యై కూజన్ కుహూరితి
సమేతి సపక్షపాతమ్.

రసాల వల్లరి అనురాగమున పిల్లగాలికి రెపరెపలాడు చక్కని చిగురు కొనలను వ్రేళ్ళ నూపుచు ఆహ్వానించుచున్నట్లున్నది. ఈ కోకిల పక్షపాతమున 'కుహూ' కూజన మొనరింపుచు రసాల వల్లరికి తిరిగి ఉత్తర మొసగు చున్నట్లగు పడుచున్నది. మఱియు-

"శ్రేణీభూయ మాదాలసా మధుకరాః పుష్ణంతి వేణీశ్రియం
పాణ్ఛ్రద్గుచ్ఛ భరోఽప్యురోజ కలశ ప్రాగల్భ్య మాలంబతే
రాగోల్లాసి చ పల్లవం కలయతే రమ్యాధర ప్రక్రియాం
వాసంతీ లతికాపి తేన వహతే వామాలకా విభ్రమమ్,"

గండు తుమ్మెదలు బారులు కట్టి కబరీ శోభను కలిగింప, పైపై పొంగారెడి పూగుత్తులు కుచ కలశ ప్రౌఢి ప్రదర్శింప, రాగ రంజితమౌ పల్లవ భరము రమ్యాధర పరిపాటిని వెల్లడింప ఈ వాసంతీ లతిక కులుకులాడియౌ రమణి సొగసును హరించుచున్నది.

(విమర్శించి) ఆర్యురాలా! మన అదృష్ట విశేషమున అంతయు కలసి వచ్చుచున్నది.

"కాలః కోకిలకోమలోక్తిమధురః కావ్యజ్ఞ మాన్యఃకవిః
కావ్యస్యాపి స ఏవ కామజ కో రాధావిటో నాయకః
సారజ్ఞాశ్చ సభాసదః పునరమీ నాట్యే ప్రవీణా వయం
కిం చాయం సముదంచితో భగవతశ్చూడేశ్వర స్యోత్సవః"

సమయమా, కోకిలాలాప కాకలీ పేశలము. కవియా, కావ్య తత్వజ్ఞులకు మాన్యుడు. రూపక నాయకుడా, సాక్షాత్తు కామజనకుడైన రాధాకాంతుడు. సభా సదులా, సారస్య సారజ్ఞులు. అభినయించు మనమో, నాట్యకోవిదులము. చూడేశ్వర భగవానుని ఉత్సవము ఇది యంతయు చేకూర్చినది. కావున సంగీత మనుష్ఠించుము.

నటి:-

"పల్లవితచూతలతికాం కోకిలతరుణా రమంతే రమణీయామ్
ఉజ్ఝింతోపి ముహూర్తం కాకకులక్రూరనిస్వనం శ్రుత్వా."

వికట కాకాక్రోశము నాలకించి క్షణకాలము విడిపెట్టినను తరుణ పికములు తిరిగి చక్కగా చిగిర్చిన రసాల వల్లరులపై రమించుచున్నవి.

సూత్ర :- (తలయూచి) ఆహా, ఏమి సంగీత మాధుర్యము!